# జెండా గీతం

ధ్రువతారై వెలుగుమా – కేతనమ – ధ్రువతారై వెలుగుమా ॥

1. సూర్య చంద్రుల సృష్టి – తేజరిల్లెడిదాక
ఆకాశవీధి మా – ఆదర్శ చిహ్నమై ॥ధ్రువ॥

2. స్వాతంత్ర్య సిద్ధికై – జనత బలి దానముల్
జాతి మహదాశయము – స్ఫురియింప జేయుచును ॥ధ్రువ॥

3. వీరులు హర్షింప – శూరులు పులకింప
శాంతికాములు నిత్య – స్మరణ జేయుచునుండ ॥ధ్రువ॥

4. త్యాగ స్వచ్ఛత ధైర్య – స్థైర్య ప్రతాపముల్
జాతి యలవరచుకొని – జగతిని ప్రకాశింప

5. చిగురించు ఆశలకు – చేవ గలిగించుచును
చేయువలసిన కృషిని – స్మరణకున్ దెచ్చుచును

6. జగతికీ గాంధిజీ – చూపిపోయిన త్రోవ
అడుగు తప్పక మమ్ము – అనుసరింపగ జేయు ॥ధ్రువ॥

7. నీ మూడు రంగులు – నీ ధర్మ చక్రము
నిఖిల పీడిత ప్రజకు – నిజము ముక్తిని జూప ॥ధ్రువ॥

— శ్రీ కోదాటి నారాయణరావు

# శ్రద్ధాంజలి

27 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ సూర్యాపేటలో జరిగి అప్పుడే ఏడేండ్లు గడచినవి. అయితే యివి సామాన్యపు సంవత్సరాలు కావు. ప్రతి సంవత్సరమూ అనేక సంవత్సరాలలోకాని చూడని అద్భుత పరివర్తనలను తనతో తీసుకొనివచ్చిన కాలమిది. మహాసభనాటికీ, ఈ సంచిక ప్రకటన నాటికీ మధ్యనుగల యీ కాలంలో చాలా సంఘటనలు జరిగాయి. నైజాము, ప్రభుస్థానము నుండి రాజప్రముఖుడై, యీనాటికి సామాన్య పౌరమాత్రుడయినాడు. ఈరీతిగా దేశ పరిస్థితుల్లోను, ప్రజల భౌతిక భావ సంపదలలోను వచ్చిన మార్పులను నిర్వచిస్తూపోతే సవాలక్ష గ్రంథమవుతుంది.

27 వ మహాసభ సూర్యాపేటలో జరిగిననాడు మనమధ్యనుగల అనేకమంది పెద్దలు, పిన్నలు ఈ సంచిక ప్రకటన నాటికి మనల వీడుట తటస్థించింది. సభాధ్యక్షులు శ్రీ ప్రతాపగిరి రామమూర్తి, ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ కోదాటి వెంకటేశ్వరరావు గార్లు మనలను వీడిపోయినారు. మహాసభ జరుగవలెనని ఎంతో తాపత్రయపడ్డ సూర్యాపేట పెద్దలలో నొకరైన శ్రీ భోనగిరి లక్ష్మయ్యగారు పరలోక గతులైనారు. తన ప్రబోధ పద్యాలతో ప్రతి సన్నివేశాన్ని ఉత్తేజపరచిన కవిమిత్రుడు శ్రీ గొబ్బూరి గోపాలకృష్ణుడు భౌతిక కాయాన్ని వదలిపోయాడు. మహాసభకు అన్నివిధాలా విజయాన్ని అపేక్షించిన మిత్రుడు శ్రీ తడకమళ్ళ హనుమంతరావు అకాలమృత్యువు వాతబడ్డాడు. మహాసభలో ఎంతో ఉత్సాహముతో పాల్గొని, నిర్వహణ శాఖాసమావేశంలో 'తెనుగు నుడిదండల'ను గూర్చి విపులమైన ఉపన్యాసాన్ని చేసిన శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, వయోజనవిద్యా శాఖాసమావేశంలో హైదరాబాదురాష్ట్రంలోని వయోజన విద్యావ్యా

ప్తిని గురించి దీర్ఘోపన్యాసం చేసిన శ్రీ బారు శ్రీనివాసరావుగారు కీర్తి శేషులైనారు.

ఇంతేకాదు. మహాసభవిజయాన్ని ఆంకాంక్షిస్తూ సందేశాలు పంపినవారిలో కూడ పలువురీప్రపంచాన్ని విడిచి వెళ్ళారు. ఆంధ్ర గ్రంథాలయోద్యమ మూలస్తంభాలలో నొకరైన శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు స్వర్గమునలంకరించారు. విఖ్యాత వాఙ్మయ పరిశోధకులు డాక్టరు చిలుకూరి నారాయణరావు, ప్రముఖ సంఘ సేవకులు శ్రీ రాయసం వెంకటశివుడుగారు, గ్రంథాలయ పయోజన విద్యారంగాలలో కాకలుతీరిన సేవకులు పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులు, కె. జె. జి. సుందరంగార్లు మనలను వదలివెళ్ళారు.

ఈ సంచిక ప్రచురణలో జరిగిన ఆలస్యానికి క్షమాపణ నర్థిస్తూ దీనిని సమర్పించవలసిన సమయంలో పైనపేర్కొన్న వారందరికీ మన శ్రద్ధాంజలిని సమర్పించవలసి రావడం ఎంతో వేదనను కలిగిస్తున్నది. దివంగతులైన మన నాయకులకు, మిత్రులకు హృదయపూర్వకమైన శ్రద్ధాంజలిగా ఈసంచికను సమర్పిస్తున్నాము.

# ప్రకాశకుల విజ్ఞప్తి

౨౭ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ జరిగిన ౭ సంవత్సరాల ౭ నెలల ౭ రోజులకు పిమ్మటగాని దీని సంచిక వెలువడుట కవకాశము లభించలేదు. ఈలోపల యీసభతో సంబంధంగలవారెందరో కాలగర్భంలో కలసిపోవడం జరిగింది. మిగిలినవారుకూడ వారి వారి స్వకార్యములతో తీరక దీనివిషయమై శ్రద్ధవహించుట సాధ్యపడలేదు. మహాసభ నిర్వాహణానికి ముఖ్యకారణభూతులైన మిత్రులు శ్రీ కోదాటి నారాయణరావుగారే యీ సంచిక ప్రచురణ విషయంలో నూ హెచ్చు శ్రద్ధవహించినందుననే నేటికైన దీనిని వెలువరించగలిగినాము. వారీవిషయాలలో చేసిన కృషి మరువరానిదై యున్నది. కనుక మా హృదయపూర్వకమైన కృతజ్ఞతను మొట్టమొదట శ్రీ నారాయణరావు గారికి తెలుపవలసి యున్నది. మహాసభ నిర్వాహణకు, విజయమునకు కారణభూతులైనవారు పలువురు నేడు మా కృతజ్ఞతను స్వీకరించుటకు ఇచ్చటలేరు. అట్టివారందరికీ మా జోహారుల నర్పించు చున్నాము. దొంగలు పడిన ఆరు నెలలకు కుక్కలు మొరిగిన చందమున మహాసభ నిర్వాహణలో వివిధరీతుల పాలు పంచుకొన్న ఆహ్వానసంఘ పెద్దలు, కార్యకర్తలకు మేమిప్పుడు పేరుపేరున కృతజ్ఞతను చెప్పబూనుట హాస్యాస్పదముగ నుండును. అయినను వారందరికీ కలిపి మా వందనముల నిందుమూలమున నందజేయుచున్నాము. ఈసంచిక నిప్పటికైనా ప్రచురించుటకు సాయపడిన గ్రంథాలయ మిత్రులిద్దరి మేలును మేమెన్నటికీ మరువజాలము. వీరిలో ఒకరు రు 500/- వాగ్దానము చేసి రు 300/- చెల్లించినారు. శ్రీ వెంపటి బుచ్చయ్యగారు రు 100/- ఇచ్చుటకంగీకరించి రు 50/- చెల్లించియున్నారు. మిగిలిన మొత్తములను కూడా వీరు త్వరలో చెల్లించి తమ మాటను నిలబెట్టుకొందురని నమ్ముచున్నాము. కాలం చాలగడచినా, ఏలాటి అనుకూలములు గాని తగినంతగా తటస్థపడకున్నా, మొత్తంమీద ఈ సంచికను లోకానికీనాటికైన అందజేయుభాగ్యము మాకబ్బినందులకెంతయు సంతసించుచున్నాము.

ఈ నడుమను జరిగిన మహాసభలన్నింటిలోను ౨౭వ మహాసభ యెంతో విజయవంతముగ జరిగినదనుట అతిశయోక్తికాదు. దీని నిర్వాహణకు దాదాపు రు 7,000/- ఖర్చైనది. మహాసభకు వేలసంఖ్యలో జనం హాజరైనారు. గ్రంథాలయ, వయోజనవిద్యలకు సంబంధించిన ప్రదర్శనం చాలా గొప్పగా యేర్పాటు చేయబడినది. శాఖాసమావేశాలలో చదువబడిన వ్యాసాలుకూడ అధికసంఖ్యలో చాల ఉన్నత స్థాయిలో నుండినవి. ఈ వ్యాసాలలో కొన్ని వివిధ పత్రికలలో ప్రచురింపబడినవి. దిగువ వ్యాసములు పుస్తకరూపంలో ఇంతకుముందే మాచే ప్రచురించబడినవి.

శ్రీ పాతూరి నాగభూషణంగారి

1. "గ్రంథాలయ ప్రచారం

2. "తెలుగుపుస్తకాల వర్గీకరణం"

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి

3. "తెనుఁగు నుడిదండలు"

ఈ మహాసభకు శ్రీ శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరంగారు ప్రత్యేకించి పంపిన

"స్వయంవరం చాటించారోయ్,
త్వరత్వరగా పయనంకావోయ్
పుస్తకాల బాల కుమారితో
నేస్తానికి పోదాం పదవోయ్"

అనే గ్రంథాలయ గేయంకూడా ఇంతకుముందే హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తువారు ప్రచురించిన శ్రీ పాతూరి నాగభూషణంగారి "గ్రంథాలయములు" (వ్యాసావళి) అను పుస్తకము లోను, సంఘ పత్రికయగు "గ్రంథాలయ సర్వస్వము" లోను ప్రకటింపబడి బహుళ ప్రచారములోనికి వచ్చినది. మిగిలిన వ్యాసము

ల లో ము ఖ్య మై న వానిని. మహాసభ ఆహ్వానసంఘాధ్యక్షులయు, ప్రారంభకులయు, అధ్యక్షులయు, ప్రసంగములను; తీర్మానములను, 4 దినములు మహోత్సావాంతో జరిగిన కార్యకలాపాల సంగ్రహ నివేదిక వగైరాల నీసంచికలో చేర్చినాము. కాలం గడచినా దీనిలోని వివరాలు గ్రంథాలయ కార్యకర్తలకు, వయోజనవిద్యా ప్రచారకులకు చాలవరకుపయోగపడగలవు. కాన వీనిని వారంతా ఉపయోగించుకొని గ్రంథాలయోద్యమాభివృద్ధికై తగు విధమున సాయపడుచో మాకృషి సఫలమైనట్లు భావింతుము.

ఆం. ప్ర. గ్రం. సంఘము
పటమట, కృష్ణాజిల్లా
౧౬–౧౧–౧౯౫౪

ఇట్లు విన్నవించు,
పాతూరి నాగభూషణం
కార్యదర్శి.

# 27 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## శ్రీ హరిసర్వోత్తమరావుగారి అభిప్రాయములు

[1950 ఏప్రిల్]

ఈనెల (1950 ఏప్రిల్) 7వ తేదీనుండి 10వ తేదీవరకు హైదరాబాదు రాష్ట్రంలోని సూర్యాపేటలో జరిగిన 27 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ ఆకర్షణీయమైన వివిధ సన్నివేశాలతో హృదయంగమంగా నడిచింది. సూర్యాపేటవంటి చిన్న ప్రదేశాని కిదియొక మహోత్సవం. 27 జతల ఎడ్లను పూన్చిన బండిపై జరిగిన ఊరేగింపు దేవతలుసహితం చూడదగిన దృశ్యం. సూర్యాపేటలోని పెద్దబజారులు రెండూ ఊరేగింపు సమయంలో జనంతో క్రిక్కిరిసిపోయినవి. ఈ ఊరేగింపు 4 దినాలు జరిగిన మహాసభకు ఉత్సాహాన్ని కల్పించినది.

మహాసభకు వచ్చిన ప్రజానీకం కార్యక్రమం ముగిసేవరకు కదలకపోవడం ప్రశంసనీయం. స్త్రీలు, పురుషులు యీసమావేశంలో సరిసమానంగాపాల్గొన్నారు. స్త్రీల విషయంలో ఇప్పటివరకూ అవలంబిస్తూవచ్చిన సాంప్రదాయాన్ని హైదరాబాదు అధిగమించిం దనడాని కిది నిదర్శనంగా వుంది. మహాసభ, మహాత్మాగాంధీమూర్తి సభాచర్యలను పరికిస్తూ వుండగా, గాంధీపార్కులో జరిగింది. సాయంత్రంవేళలలో 6 గంటల కాలం, రాత్రులు జరిగిన నాటకాలు వగైరా వైజ్ఞానిక ప్రదర్శనాల సమయాన్ని కలుపుకుంటే వాస్తవానికి 10 గంటల కాలం మహాసభ ప్రదేశం యావత్తూ 6 మొదలు 8 వేల ప్రజానీకంతో క్రిక్కిరిసి యుండినది. ఇంత మహాజనమున్నప్పటికీ సభాకార్యాలకు భంగంకలిగే యే విధమైన సద్దుగానీ చేయకుండా నిశ్శబ్దంగా కూర్చోవడం ముఖ్యంగా ఎన్నదగిన విషయం.

ప్రదర్శనం, శాఖాసమావేశాలు చాలా విజయవంతంగా సాగినవి. ప్రదర్శనంలో వయోజనవిద్య, గ్రంథాలయ భాగములు సమగ్రంగాఉండి వేల జనాన్ని ఆకర్షించినవి. మొదటిరోజు ఉత్తేజకరమైన ఉపన్యాసంతో మహాసభను ప్రారంభించిన హైదరాబాదు విద్యాశాఖ డైరక్టరు శ్రీ ఫజులురహిమాన్ గారు 8 వ తేదీ ఉదయం ప్రదర్శనాన్ని పరికించినారు. ఆయనను నేను ప్రదర్శనమంతాత్రిప్పిచూపి మదరాసు రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతంలో మేమేమి చేస్తున్నదీ విశదీకరించినాను. ఆయన గాఢమైన అభిరుచిని కనబరచినారు. ఆహ్వాన సంఘంవారు ప్రదర్శనానికి వచ్చిన పుస్తకాలలో శ్రేష్ఠమైన వాటికి బహుమతులేర్పాటు చేసినారు. సర్వాంగ సౌందర్యానికి రెండు, విజ్ఞాన శాస్త్రానికి మూడు, సాధారణ సాహిత్యానికి రెండు బహుమతులీయబడినవి. సాధారణ సాహిత్య గ్రంథాల స్థాయి చాల ఉన్నతంగా ఉండినది. వీటిలో శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' ఉత్తమోత్తమంగా వుంది. అనుభవ విజ్ఞానానికి సంబంధించిన రెండుపుస్తకాలకు బహుమతు లివ్వగలగడం అదృష్టం.



స్వచ్ఛంద సేవకులు (పుట VIII)

సాధారణంగా శాఖాసమావేశాలకు అభిరుచిగల ఏ కొద్దిమందో హాజరవుతూ వుంటారు. ఈపర్యాయ మట్లుగాక యివి చాలమంది సాక్షించినవి. ఆ యా విషయాలలో అనుభవజ్ఞులు కాకపోయినప్పటికీ, శాఖాసమావేశాలలో పాల్గొన్న వారంతా వాస్తవానికి కార్యకర్తలే. సాంకేతిక విషయాలలోకూడా ఇంత ఉత్సాహాన్ని కనబరచడం తెలంగాణా గౌరవాన్ని హెచ్చుచేస్తున్నది. ఈతూరి శాఖా సమావేశాలలో ఆంధ్రదేశంలో అక్షరాస్యతా బోధన విషయంలో మనం సాధించిన అభివృద్ధిని రాయలసీమనుండి వచ్చిన శ్రీ ఎ. పి. వెంకటరెడ్డిగారు వయోజనవిద్యా శాఖా సమావేశంలో వివరించడమొక ప్రత్యేకత. వీరు మహాసభలో నిరక్షరాస్యులకు నా ఛార్టులోని మొదటి మూడక్షరాలను నేర్పి చూపించినారు.

మహాసభాధ్యక్షత వహించిన నా మిత్రులు ఆచార్య ప్రతాపగిరి రామమూర్తి గారు గ్రంథాలయాల విషయమై ప్రజ్ఞావంతంగా ప్రసంగం చేయుటద్వారానూ, తమ కార్యనిర్వహణా చాతుర్యంద్వారానూ సభవారి ప్రేమ గౌరవములను చూరగొన గలిగినారు. తమ నాగరికతవలనను, సహృదయత వలనను మహాసభను ప్రారంభించిన శ్రీ ఫజులుర్రహమాన్ గారు కూడ సభికుల ప్రేమకు పాత్రులయ్యారు.

ఈ సందర్భంలో సూర్యాపేటలోని ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథనిలయం రజతోత్సవంకూడ జరిగింది. దీనికి ఆంధ్ర పితామహులు శ్రీ మాడపాటి హనుమంత రావుగారధ్యక్షత వహించారు. శ్రీ హనుమంతరావుగారు సెలవిచ్చినట్లు తెలంగాణా లోని ప్రజాజీవితపు అన్ని దశలను యీ గ్రంథాలయము, తాముకూడ అనుభవించారు. తెలంగాణాలో ప్రజాజీవితాన్ని మార్చిన గ్రంథాలయోద్యమం ప్రాముఖ్యత యావత్తూ ఆయన జీవితంలో ప్రతిబింబించింది. ప్రస్తుతస్థితి ప్రజలకు చాల కఠినంగా వున్నప్పటికీ నిరంకుశుడైన నైజాము పరిపాలనలోని భయానక పరిస్థితులను జయించడం చాలా సంతసించదగిన విషయం. ఇందుమూలంగా కలిగిన ప్రతిష్ఠలో చాలా భాగం గ్రంథాలయోద్యమానికే చెందుతుంది. 10 వ తేదీన శ్రీ జాస్తి వెంకటనరసయ్యగారి అధ్యక్షతను జరిగిన కవి సమ్మేళనంలోకూడ యీవిషయం ప్రస్ఫుటమైనది. సుమారు 20 మంది కవులు తమ రచనలను చదివి వినిపించారు. వారిగీతాలలో తెలంగాణా నైజాము పరిపాలనలోని నిరంకుశత్వంనుంచి విముక్తిపొందడమే ముఖ్య విషయంగా కన్పట్టినది. పూర్వపరిపాలనలోగల మత దురహంకారం వీరి మనసులను ఏవిధంగా రెచ్చగొట్టిందో పోలీసుచర్య విజయం పొందడంపట్ల వీరికిగల ఆనందాన్ని వెల్లడించడంవల్లను, వీరు నైజామును గురించి చేసిన తీవ్ర విమర్శవల్లను స్పష్టపడింది.

నా గౌరవార్థం జరిగిన షష్టిపూర్త్యుత్సవం విషయమై హెచ్చుగా ప్రస్తావించడం నాకిష్టంగాదు. సర్కారులు, తెలంగాణా, రాయలసీమల మధ్య సామరస్యాన్ని నెలకొల్పుటకీ కార్యక్రమం ఉపయోగపడగలదని నాయువకమిత్రు లొకరు చెప్పినారు. నాద్వారాగాని, నా సేవద్వారాగాని యీఫలితం ఏమాత్రం సిద్ధించినప్పటికీ నా జీవితం వృథాకాలేదని నేను భావిస్తాను. సూర్యాపేట నాయెడజూపిన అపారప్రేమను నా జీవితంలో మరువజాలను.

ఆహ్వాన సంఘంవారు 10 వ తేదీ ఉదయం పిల్లలమర్రి ప్రాచీన దేవాలయాల సందర్శనానికి కార్యక్రమ మేర్పాటు చేసినారు. చాలామంది ప్రతినిధులు దీని లాభాన్ని పొందినారు. ప్రాచీనతకు, సౌందర్యానికి ఆటపట్టులైన యీదేవాలయాలు అధికారంలోవున్న ప్రతికూలశక్తుల చేతుల్లో పాడైన చిహ్నాలు స్పష్టంగా కనుపిస్తున్నవి. సుందరంగావున్న ప్రతిమల ముక్కు మొగాలు చెక్కారు. ఇతర అవయవాలనుకూడా క్రూరంగా నాశనం చేశారు. ఇవి కాకతీయ యుగం సంస్కృతికి చిహ్నాలుగా నిలచియున్నవి. ఈలాంటివి భూగర్భంలో యింకెన్నో దాగియున్నవని స్థానిక ప్రజలనుకునే ఊహాలు నిజమేకావచ్చు. పూర్వ వైభవ చిహ్నాలైన యీ ప్రదేశాలను త్రవ్వి పైకి తీయించుట ప్రస్తుత ప్రభుత్వంవారి కర్తవ్యం. తెలంగాణా లోని నేటిఅస్థిర పరిస్థితులలో యీపని త్వరగా జరుగుతుందని ఆశించలేము. ఈ సందర్భంలో విద్యావిషయకంగా మహాసభచేసిన కృషి ఎంత గొప్పదైనా గూండా శక్తుల బాధలకు గురి అవుతామనే భయంతో బాధపడే మామూలు పౌరునికి తగిన ఓదార్పును యీ మహాసభ కలిగించజాలక పోయెనని ఒకరిద్దరనగావిన్నాను. ఇందులో సత్యం లేకపోలేదు. విద్యావిషయకమైన ప్రబోధాల ఫలితం వెంటవే గోచరించడం పూర్తిగా చెడియున్న పరిస్థితులలోకూడ చెడుగును ఎదిరించుటకు గాంధీజీ చూపిన ఆదర్శమార్గాన్ని యీ ప్రాంతాలలోని మహాజనానికి చూపి జీవితంలో ఉత్తమ పథ మేదో వారికి తెలుపగలిగినందులకు మేము సంతృప్తిపడుచున్నాము. సూర్యాపేట జనతా కళామండలివారీ సందర్భంలో ప్రత్యేకంగాప్రదర్శించిన నాటక మొకదానిలో కూడ యీ సందేశాన్ని ప్రజలకందించే ప్రయత్నం జరిగింది. ఈ మండలి ప్రదర్శించిన ప్రజ్ఞా చాతుర్యాలు అభినందనీయాలు. గ్రంథాలయ, వయోజనవిద్య ఉద్యమాలకు సంబంధించి వీరుచెప్పిన బుర్రకథకూడ స్తవనీయంగాఉంది. సూర్యాపేట వైదికాంధ్ర బాలికా పాఠశాల బాలికలు ప్రదర్శించిన 'అల్లుళ్ళసంత' అనే సాంఘిక నాటిక వరశుల్క పద్ధతిపై గట్టిదెబ్బగానున్నది. దీనిని వీరు చక్కగా ప్రదర్శించారు.

ప్రతినిధులపట్ల సూర్యాపేట చూపిన ఆదరణ అపారమైనది. తెలంగాణా అతిథి సత్కారానికి, ఔదార్యానికి భోజన సదుపాయాల బాధ్యత వహించిన శ్రీ వెంపటి బుచ్చయ్యగారు నమూనాగా నాకు కన్పించినారు. ఎవ్వరికి తెలియనట్లుగావున్న మా మిత్రులు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ సహాయ కార్యదర్శి శ్రీ కోదాటి నారాయణరావుగారు మహాసభకు శరీరం, ప్రాణంగా కూడ వుండినారు.

వాలంటీర్లు ముఖ్యంగా శ్రీ ఇటిక్యాల మధుసూదనరావుగారి నాయకత్వంలో పనిచేసిన ఒరంగల్లు ఆర్య సేవాదళంవారి సేవ ప్రశంసనీయంగా వుంది. మొత్తంమైన యీ మహాసభ తెలంగాణాప్రజలకు లాభం కలుగజేసిందనిన్నీ, వారి సాహచర్యంవల్ల మేమును ఎంతో లాభంపొందితిమనిన్నీ నేను భావిస్తున్నాను.

— గాడిచర్ల హరిసర్వోత్తమరావు



ప్రతినిధులు (పుట X)

# విషయసూచిక

## ౨౭ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ


| | | |
|---|---|---|
| జెండాగీతం | శ్రీ కోదాటి నారాయణరావు | ii |
| శ్రద్ధాంజలి | | iii |
| ప్రకాశకులకు విజ్ఞప్తి | శ్రీ పాతూరి నాగభూషణం | v |
| మహాసభ: అభిప్రాయము | శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు | viii |
| సందేశములు | ... ... | 1–8 |
| సమీక్ష | రవి | 1 |
| స్వాగతపద్యములు (పద్యాలు) | శ్రీ గొబ్బూరి గోపాలకృష్ణశర్మ | 13 |
| స్వాగతోపన్యాసము | శ్రీ కోదాటి వెంకటేశ్వరరావు | 14 |
| ప్రారంభోపన్యాసము | శ్రీ ఫజులు రహమాన్ | 20 |
| అధ్యక్షోపన్యాసము | శ్రీ ప్రతాపగిరి రామమూర్తి | 22 |
| తీర్మానములు | ... ... | 29 |

**ప్రచార శాఖా సమావేశము:**

| | | |
|---|---|---|
| పుస్తకాల స్వయంవరం (గేయం) | శ్రీ శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం | 38 |
| గ్రంథనిలయార్చకుడు | శ్రీ పేరంబూదూరు లక్ష్మీనరసింహాచార్యులు | 40 |
| గ్రంథాలయములు : విశ్వకవి సుభాషితములు | డిటో | 41 |
| గ్రంథాలయాల కార్యక్రమం నూతనరూపం దాల్చాలి | శ్రీ బండి నాగేశ్వరరావు | 43 |
| ఆంధ్ర సరస్వతీ ( పద్యాలు ) | శ్రీయుతులు చిగురుపాటి, ఆకెళ్ళ సుబ్రహ్మణ్యులు | 47 |
| గ్రంథాలయ ప్రచారము: ఉపాధ్యాయులు | శ్రీ నూరపరాజు కోటయ్య | 48 |

**వయోజనవిద్యా శాఖా సమావేశము:**

| | | |
|---|---|---|
| హైదరాబాదు రాష్ట్రమునవయోజన విద్యావ్యాప్తి | శ్రీ బారు శ్రీనివాసరావు | 51 |

| | | |
|---|---|---|
| వయోజనవిద్యా ప్రచారము | శ్రీ నర్రావుల వెంకటసుబ్బారావు | 57 |
| ప్రభుత్వ వయోజన ఉపాధ్యాయశిక్షణ కేంద్రము: నిత్య దినచర్య – కొన్ని ప్రత్యేకతలు | శ్రీ ఆత్మకూరి రాఘవాచార్యులు | 61 |
| వయోజనవిద్య: జైలులోని ఒక చిన్న అనుభవము | శ్రీ వంటెద్దు పంకజ పార్వతీశం | 66 |
| అక్షరాస్యతా ప్రచారానికొక ప్రణాళిక | శ్రీ కొర్రపాటి వెంకటసుబ్బారావు | 68 |
| అధ్యక్షోపన్యాసము | రివరెండ్ యం. జె. ప్రకాశం | 76 |
| **నిర్వహణశాఖా సమావేశము:** | | |
| The Library Catalogue | Dr. S. R. Ranganathan | 82 |
| అధ్యక్షోపన్యాసము | శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు | 85 |
| **కవితా గోష్ఠి:** | | |
| పిల్లలమర్రి యాత్ర (పద్యాలు) | శ్రీ ఆకెళ్ళ సుబ్రహ్మణ్యకవి | 88 |
| క్షమాపణ | శ్రీ కోదాటి నారాయణరావు | 90 |

# సందేశములు (Messages)

There are two stages in library service. A useful collection of reading and kindred materials should be built up, organised and administered in an inviting manner. But this is only half the battle. The public too should come in large numbers to accept the services offered by libraries. A Library Conference has to work on both these fronts. It has to pursuade the people at large to recognise the value of better knowledge and better information and for that purpose use libraries with willingness. They should use them not only for relaxation during leisure but also for information on their daily vocation and their relation to their environment both physical and social. They should further use them for drawing inspiration and thereby getting their own creative urge stimulated. On the other side the Conference has also to pursuade the people in power and those who have the purse to see the value of libraries for the betterment of the community and to provide a library service suited not only to the top men but also to men drawn from all intellectual strata.

I trust that the 27th Andhradesha Library Conference will pay equal attention to both these functions. The public Library Act which the state of Madras has secured for itself is only suggestive of what should be done by the Government and the people at large to make a comprehensive library service a reality. I trust *that the Conference will succeed in enlivening the Public Library Act and making it a lifeforce in the progressive betterment of the people.*

*I wish every success to the Andhradesha Library Conference in all the directions in which it proposes to forge ahead.*

— *S. R. Ranganathan, M. A., D. Litt., L. T., F. L. A.*
**President, Indian Library Association**

"...I wish the conference success ..."

— *U. M. Patil*

Asst. Curator, Library Department, Baroda

" ...I am desired to convey the best wishes of the vice - chancellor for the success of the 27th session of the Andhradesa Library Conference... "

— *P. I. Das*

Personal Assistant to Vice - Chancellor
Allahabad Univesity

" I offer my best wishes for the success of the 27th Andhradesa Library Conference... "

— *K. L. Dubey*

Vice - Chancellor, Nagpur University

...I - - wish the conference every success. "

— *T. Chandrasekharan*

Curator, Govt - Oriental Manu-scripts
Library, Madras

"...We wish the conference every success..."

— *P. S. Veeraswami*

Dean, Faculty of Arts, Osmania Univesity

" Please accept my hearty congratulations on your organising this Library Conference and my best wishes for a successful conference."

— *V. S. Ratnasabhapathy*

Provincial Secretary
The Hindustan Scout Association,
Madras Presidency

"Wish functions Conferences great success."

— *Vyas, Librarian, Bombay*

" The Special Commissioner, Warangal has great pleasure in wishing the conference all success.'

— *P. Narasimham*
P. A. to Special Commissioner

" I pray to God to endow Sri Harisarvottama Rao Garu strength and health and bless him with a very long life, so that every village can boast of a library and every adult is educated during his lifetime by his exertions. "

— *P, Veerabhadraswami*
B. A., M. L. C., President,
Vizagapatam District
Congress Committee

" Illness prevents attendance. Wish Conference success. "

— *A. Ramakrishna Rao*
Librarian, Andhra University

" భారతదేశ గ్రంథాలయోద్యమ చరిత్ర యందు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము స్వర్ణాక్షరములతో వ్రాయ దగినదనుట యతిశయోక్తిగాదు. ఈ సంఘము 1914 వ సంవత్సరమునుండి చేయుచున్న యమోఘమైన సేవ యందఱకు విదితమే. గ్రామ గ్రామమునను దేవాలయపు ప్రాకారములలో నొకమూల గ్రంథాలయముల స్థాపించుచు, గ్రామ ప్రజలను సాయం సమయమునను, విరామ సమయమునను పఠనార్థ మాకర్షించుచు, వయోజన విద్య వివిధ విధముల గఱపుచు, ప్రజలలో నూతన చైతన్యమును కల్పించుచు వచ్చిన యీ సంఘపు కార్యము గడుంగడు ప్రశంసనీయము. కేవలము ప్రజాభిమానము చేతనే పోషింపఁబడి, దాదాపు అర్థశతాబ్దము వరకు యనారత దీక్షతో విరామములేని యీ యుద్యమ సాధన, ఆంధ్రదేశపు భావియౌన్నత్యమును ఆంధ్రయువకుల యుత్కృష్ట యాదర్శములను జాటుచున్నది.

నవయువకులలో నీ యుత్సాహము పురికొల్పి భారత దేశమున ఆంధ్రులను గ్రంథాలయోద్యమమున నాదర్శ నీయముగ పెంపొందింపవలెననియు, నీ 27 వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ జయప్రదముగ జఱుగవలెననియు శ్రీ విశ్వనాథుని ప్రార్థించుచు, నా యాశీస్సుల నంపుచున్నాను.

దర్భా సుబ్రహ్మణ్యము, ఎం. ఏ.
గ్రంథాలయాధ్యక్షుడు, కాశీ విశ్వవిద్యాలయము

"27 వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ, ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథనిలయ రజతోత్సవము, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారి షష్టిపూర్త్యుత్సవము, గ్రంథాలయ - వయోజన విద్యా ప్రదర్శనము, కవిసమ్మేళనము అఖండ జయప్రదముగా జరుపగలందు లకు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను."

—మందలపర్తి ఉపేంద్రశర్మ
లెక్చరర్, హిందూకాలేజి, గుంటూరు

"మీ సమావేశం జయప్రదం కాగలదని, నిరాశాజనితమైన నేటి తమస్సుకొక నూతన శోభ కూర్చగల నిర్దిష్ట కార్యాచరణకు పూనుకొనే సత్ఫలితదాయకమైన, నిర్మాణయుతమైన తీర్మానాలను చేసి ఆచరించగలరని పెద్ద ఆశతో మీ పెద్దలపై మా యువకులు కేంద్రీకరించుకొన్న నేత్రాలతో ఎదురు చూస్తున్నారు."

— టి. వి. ఎ. నరసింహాచార్య
'నవీనవిద్య' సంపాదకులు

"మీరు తలపెట్టిన కార్యక్రమమంతయు దిగ్విజయముగా జరుగ గలదని ఆశించు చున్నాను. ఆంధ్రవిజ్ఞాన ప్రచారమునకు మూలస్తంభములగు వయోజన విద్య - గ్రంథాలయోద్యమమునకు భీష్మాచార్యులును, పూజ్యులును అగు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్త్యుత్సవము కూడా ఈ మహాసభలతో పాటు జరుపుట యెంతయు తగియున్నది చిరకాలము నుంచియు అవిరళముగా వారొనర్చుచున్న విజ్ఞానసేవకు ఆంధ్రులెల్లరీ విధముగ వారిని సన్మానించుట వారి యెడ తమకు గల కృతజ్ఞతను వెలిబుచ్చుట యగును."

—తాడిపర్తి శ్రీకంఠము
ప్రధాన న్యాయమూర్తి, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఎన్నికల న్యాయస్థానము

"మహాసభలు జయప్రదముగ జరుగుగాక !"

— జి. కృష్ణమూర్తి, వకీలు, ప్రొద్దుటూరు

"మీ సమావేశం అన్ని విధాల విజయవంతంగా కొనసాగగల దని కాంక్షించుచున్నాను."

— జె. వి. నర్సింగరావు, హైదరాబాదు

"శ్రీ ఆంధ్ర పితామహులున్నారు పూజ్యులు మాడపాటి హనుమంతరావుగారు. వారి నాయకత్వాన అతీంద్రులై, స్వతంత్రులై, ఏక ముఖమున కృషి, నిరంతర కృషి, సఫలకృషి జరుగ గలదని ఆశిస్తున్నాను. గాడిచర్లవారు కొమరు ప్రాయమువారు. షష్టిలో కుడికాలు స్థిరముగ నిలిపి, సప్తతిపై ఎడమకాలు త్రొక్కబోతూ షష్టి మీదికే సింహావలోకనము చేస్తూన్న కేసరీ కిశోరము. ఈయనలో ఆంధ్రము, దేశము గ్రంథము, ఆలయము, వయసు, వాడితనము, జవత్వ, విద్య, అన్ని చరిత్రప్రదర్శనమును పొందుచున్నవి. సర్వోత్తమరావుగారిక్కే వేదోక్త నతిక్రమించి షష్టిపూర్తుల నెప్పటి కప్పుడు పొందుతూ భూతమున కాలునిలిపి, వర్తమానమునను చేయిచేసుకొని, భావిపై కృషిని సాగిస్తూ ఆంధ్రుల నోము పంటమై నెగడుదురుగాక ! మా అయ్యంకి అన్న గారికిని అట్లే."

—చిలుకూరి నారాయణరావు, అనంతపురం

" శ్రీ స్వామి రామానందతీర్థ మున్నగు మహామహుల శుభా గమనముచే మన గ్రంథాలయాది సభలు దిగ్విజయముగా జరుగునని నమ్ముచున్నాను....గ్రంథాలయములకు, గ్రంథకర్తలకుగల సంబంధ మీ మహాసభ ద్వారమున దృఢముకాగలదని విశ్వాసము.

—కొండూరు వీరరాఘవాచార్యులు, సత్తెనపల్లి

"సభలు జయప్రదముగా నెరవేరుగాకయని కోరుచున్నాను."

— కేశిరాజు వెంకటనృసింహ అప్పారావు
సంస్కృతకళాశాల అధ్యక్షులు, కొవ్వూరు

*" I wish you success and hearty congratulations on behalf of the institution for the success of the conference."*

*Senapathy Sreenivas Acharya*
*Asst, Secretary, Sree Hanuman Vyayama Shala, Hyderabad*

"సభలు జయప్రదముగ జరుగవలెననియు, తద్వారా ప్రజల యందు విజ్ఞాన తృష్ణ పెంపొంది బుద్ధితో వ్యవసాయము చేయువారి సంఖ్య పెరిగి దేశ సౌభాగ్యము నకు తోడ్పడవలెననియు, జాతి మత కుల వర్గ వయో లింగ భేదముల స్మరింపక అంద రము దైవాంశ సంభూతులమను ఉత్తమ భావముతో ప్రేమపూరిత హృదయులమై వ్యవహరింతుముగాక యనియు, ఇట్టి సభలు సమావేశములు ఉత్తమాదర్శముల పెం పొందించుకొనుటకే యనియు విశ్వసించుచు, ఇట్టిశక్తి సామర్థ్యముల సత్యస్వరూపుడు మనకు ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నాడను."

— పీతాంబరం వెంకటకృష్ణమాచార్యులు
కార్యదర్శి, విశాఖజిల్లా గ్రంథాలయ సంఘము

"మహాసభ జయప్రదముగ జరిగి ఆంధ్ర విజ్ఞానాభివృద్ధికి మిక్కిలి తోడ్పడుగాక యని భగవంతుని ప్రార్థించుచున్నాను."

—తేకుమళ్ల రామచంద్రరావు
అధ్యక్షులు, కృష్ణాజిల్లా గ్రంథాలయ సంఘము

"సభలు జయప్రదముగాజరిగి, మన ఆశయములన్నియూ నెరవేరగలందులకు భగవంతుని ప్రార్థిస్తూయున్నాను."

— భట్టకుమారస్వామి, పెడన

"మహాసభ విజయవంతముగ జరిగి, ఉపయుక్తాంశములపై ఆచరణ యోగ్యములగునట్టి నిర్ణయములు గావింతురుగాక !"

— అడుసుమల్లి శ్రీనివాసరావు, గౌరవ కార్యదర్శి,
సారస్వతనికేతనము, వేటపాలెము

"సభలు నిర్విఘ్నముగా నెరవేరుగాక !"

— పట్టిసపు శ్రీరామమూర్తి, శ్రీరామా
గ్రంథాలయము, వరహాపురము

"సభ జయప్రదముగా ముగియుగాక యని మిక్కిలి కోరుచున్నాను."

— నాగులపల్లి సీతారామయ్య, కార్యదర్శి
కృష్ణా జిల్లా గ్రంథాలయ సంఘము

"సభకు పరిపూర్ణ ఆశీర్వాదములు."

—దుర్భాక కృష్ణయ్య, హిందూపురము

"27 వ మహాసభ, ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథనిలయ రజతోత్సవము, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్త్యుత్సవము జయప్రదముగా జరుగుగాక !"

— కాళహస్తి లక్ష్మీకాంతశర్మ
అజాద్‌హింద్ గ్రంథాలయము, రేపల్లె

"(మీ) 4 రోజుల కార్యప్రణాళికయును నిర్విఘ్నముగను, జయప్రదముగను కొనసాగి, దేశక్షేమమునకు అన్నివిధములను తోడు పడుగాకయని హృదయ పూర్వకముగ గోరుచున్నాను."

—రాయసం వెంకటశివుడు, రాజమండ్రి

"మీరు తలపెట్టిన కార్యక్రమము బహుజయప్రదంగా కొనసాగగలదని ఆశిస్తున్నాను."

—కాశీపట్నపు కొండయ్య, నిడదవోలు

"మీ సభలు, హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్త్యుత్సవము జయప్రదముగ జరుగుగాకయని ప్రార్థిస్తున్నాను."

—ప్రభాకర్, సేవాగ్రామ్

"ఈ ఉత్సవములన్నీ జయప్రదముగా జరుగునని విశ్వసించు చున్నాను. శ్రీ హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్త్యుత్సవము జరుగు చుండుట మిగుల ఆనందకరమైన విషయము. ఆయన త్యాగ మూర్తి, నిరాడంబరజీవి; మకుటములేని చక్రవర్తి..."

—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

"సభ జయప్రదమగుగాక !"

—శివలెంక శంభుప్రసాద్
ఆంధ్రపత్రిక సంపాదకులు

"సభలు జయప్రదముగ ప్రస్తుత అంధకార, అయోమయా వస్థలో వెలుగునిచ్చు నిర్మాణ కార్యక్రమమును ప్రజలకు అందజేసి నడిపింతురుగాక యని భగవానుని ప్రార్థించుచున్నాను."

— మేళ్లచెర్వు వెంకటేశ్వర్లు,
సేవాశ్రమ వాణీమందిరము, పెదపాలెం

"నూర్యాపేటలో సభలు జయప్రదముగా జరుగునని ఆశించు చున్నాను."

— కే. జే. జి. సుందరం, డోర్నకల్లు

"సభ జయప్రదంగ జరుగగలందులకు యీశ్వరుని ప్రార్థించు చున్నాను."

— కొమరవెల్ల రామయ్య గుప్త, మంతెన

"సభ జయప్రదముగా జరిగి మన ఆంధ్రదేశములో వయోజన విద్య చాల ముందంజ వేయగలదని భగవంతుని ప్రార్థించుచున్నాను."

— పి. రామస్వామిరాజు, బొమ్మరాజుపాలెం

" *I wish every success to the conference and my best wishes to one and all there.*"

— *N. V. SubbaRao*

" గ్రంథాలయ మహాసభయు, వయోజన విద్యాశాఖా సమావేశమును, శ్రీ హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్త్యుత్సవమును జయప్రదముగా నెఱవేరుటకు భగవానుని ప్రార్థించుచున్నాను. శ్రీ వారికి షష్టిపూర్తి ఉత్సవముచేయుట ఆంధ్రదేశము తన్ను తాను గౌరవించుకొనుటకన్న వేరుగాదు."

— గుండిమెడ విశ్వనాథశాస్త్రి, గుంటూరు

" మీ సమావేశమునకు కార్యకలాపములకు నా శుభాకాంక్షలు. శ్రీ హరిసర్వోత్తమునికి శుభమస్తు."

— పరిగె వెంకటరమణరావు, ఒంగోలు

" శ్రీ గాడిచర్లవారి రెండవ షష్టిపూర్తి మన మందరము చూతుముగాక అని కోరితే దేవుడు ఇది చాలా లంబా చౌడా కోరిక అను కుంటాడేమో? శ్రీవారి దీర్ఘాయుష్మన్నకై మనమంతా ప్రార్థింతము.

ఇక గ్రంథాలయ మహాసభనుగూర్చి రెండుమాటలు వ్రాస్తున్నాను. గ్రంథాలయాలు జనసామాన్యాన్ని ఆకర్షించునటుల చేయండి. గ్రంథ చౌర్యము పంచ మహాపాతకములలో చేరినదనీ, ప్రజాపుస్తకాలయాలలో పుస్తకాలు చౌర్యము చేయువాడు ఆతతాయి అనీ, ప్రచారము చేయవలెను. ఈ రెండే నేను సూచించే విషయాలు. మన మహాసభకు జయము, అభివృద్ధిని సదాకోరుతూ వుంటాను."

—సురవరము ప్రతాపరెడ్డి

ఆం. దే. గ్రం. సంఘ ఉపాధ్యక్షులు




ప్రదర్శన దృశ్యములు (పుట 1)



శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు



శ్రీ యల్లాప్రగడ కృష్ణమూర్తిగారు

# 27 వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ

## సూర్యాపేట, నల్లగొండ జిల్లా

### సమీక్ష

26 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ 1946 మార్చి 1,2,3 తేదీలలో తెలంగాణలోని అలంపురం తాలూకా (రాయచూరు జిల్లా) క్యాతూరులో జరిగి నాలుగు సంవత్సరములు గడిచింది. ఈ నాల్గు సంవత్సరాల కాలంలో భారతదేశంలో బ్రహ్మాండమైన పరివర్తన కలిగింది. భారతదేశం సర్వ తంత్ర స్వతంత్రం కావటమూ, చెల్లా చెదురుగా దేశంలో మూడవ వంతు ఆక్రమించిన దేశీయ సంస్థానాలు భారతదేశంలో ఐక్యం కావటమటువంటి శుభ సన్నివేశాలూ, దేశవిభజనా, ఘోర హింసాకాండా, ఆర్థికక్లిష్టతా, అరాజక శక్తుల విజృంభణా, అన్నిటికన్న మించి భారత జాతి పిత మహాత్మాగాంధి హత్యకు గురికావటమటువంటి బాధాకర సన్నివేశాలు ఈ నాలుగు సంవత్సరాలలో జరిగినవి. తుపాను చెలరేగిన తరువాత కల్లోలం శాంతించటం ప్రారంభించిన తరుణంలో తిరిగి 27 వ మహాసభ సూర్యాపేటలో ఈ సంవత్సరం (1950) ఏప్రిల్ 7, 8, 9 తేదీలలో దిగ్విజయముగా జరిగింది.

ఇది హైదరాబాద్ తరతరాల బానిస సంకెళ్ళను త్రెంచుకొని మిగతా స్వతంత్ర భారతదేశంలో ఐక్యమైన తరువాత జరిగిన మొదటి మహాసభ. వివిధ రాష్ట్రీ పరిపాలనలలో వున్న తెలుగు ప్రాంతాన్నంతా ఏకీకరించి విశాలాంధ్ర నెలకొల్పటానికి కృషి ప్రారంభమై తెలంగాణాలోనే దానికి రూపకల్పన జరుగుతున్న ఈ తరుణంలో ఈ మహాసభ జరగటమూ, అందులో, నిజాం రాష్ట్రాంధ్రోద్యమానికి మూలస్థానమని పేరు పొందిన సూర్యాపేటలో జరగట మొక విశేషము.

### మహాసభ అంకురార్పణము

ఏప్రిల్ 7వ తేదీ శుక్రవారం ఉదయం గం 10 - 30 లకు జనతాకళామండలి సభ్యులు శ్రీ గంథం వరసయ్యగారు వందేమాతర స్తవము చేయగా నల్లగొండ జిల్లా సివిల్ అడ్మినిస్ట్రేటర్ శ్రీ పి. సి. జేమ్సు జాతీయపతాకా విష్కరణచేశారు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ నాయకులు శ్రీస్వామి రామానందతీర్థ లలవనితలంపుగా సర్వోదయ సమ్మేళనానికి వెళ్ళవలసి వచ్చినందున రాజాలక పోవడంతో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు, దక్షిణ భారత వయోజన విద్యాసంఘాధ్యక్షులు అయిన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు మహాసభకు నాంది ప్రస్తావనగా గ్రంథాలయ, వయోజనవిద్య ప్రదర్శన ప్రారంభోత్సవం చేశారు.

ఈ మహాసభలో జరిగిన ఈ ప్రదర్శనం ఇప్పటికి జరిగిన ప్రదర్శన లన్నింటికీ తలమానికంగా శోభించింది. యునైటెడ్ స్టేట్స్ సమాచార శాఖవారు, భారతదేశంలోని

వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు తమతమ ప్రాంతాలలో జరుగుచున్న గ్రంథాలయ వయో
జన విద్యలకు సంబంధించిన ఫోటోలను ప్రదర్శనకు పంపారు. యునైటెడ్ స్టేట్స్
వారి చిత్రరూపమైన ఫోటో ప్రదర్శనానికి శోభ తెచ్చింది. ఈ ప్రదర్శనం విశాల
మైన ఆవరణలో శాస్త్రీయ పద్ధతులపై ఆకర్షణీయంగా యేర్పాటు చేయబడింది. దీనికి
తోడుగా హైదరాబాద్ ప్రభుత్వ వయోజన విద్యాశాఖ ప్రదర్శనశాల, సమాచారశాఖ
ప్రదర్శనశాల, వ్యవసాయశాఖవారి అధికాహారోత్పత్తి ప్రదర్శనశాల యేర్పాటు
చేయడంవల్ల ప్రదర్శనకు మరింత శోభ తెచ్చినవి. మహాసభకు విచ్చేసిన ప్రజానీకమే
కాకుండా వూరిలోనివారంతా ఈ ప్రదర్శనశాలను చూచుటకు తిరుణాళ్లకువలె
వచ్చారు. దీనికి తోడు వయోజనవిద్యాబోధన ఆచరణక్రమము మహాసభలో
అవకాశమున్నప్పుడల్లా శ్రీ హరిసర్వోత్తమరావు గారు ప్రదర్శింప జేశారు.

## ఊరేగింపు

7 వ తేదీ సాయంత్రం గం 4-30 లకు మహాసభాధ్యక్షుల విడిదిలోనుండి
ఊరేగింపు మొదలైంది. 27 మహాసభలకు చిహ్నంగా 27 జతల ఎడ్లను పూన్చి
శోభాయమానంగా అలంకరింపబడ్డ బండిపై మహాసభాధ్యక్షులు శ్రీ ప్రతాపగిరి రామ
మూర్తిగారు, గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ కోదాటి వెంకటేశ్వరరావుగారు అధిరోహించగా
వూరేగింపు సాగింది. ప్రారంభకులు శ్రీ ఫజుల్ రహమాన్‌గారు బడలికగా
వుండడంవల్ల ఊరేగింపులో పాల్గొనలేక పోయారు. డప్పులు, బ్యాండు, సన్నాయి
మొదలైన వాద్యాలూ, సేవాదళపు ప్రబోధ గేయాలూ, ప్రజల నినాదాలూ మిన్ను
ముట్టగా సూర్యాపేట వీధుల్లో, క్రిక్కిరిసే జన సమూహాలు మధ్య మేడలమీది నుంచి
స్త్రీలు హర్ష సూచనగా పూలు చల్లుతూ వుండగా జరిగిన ఆ వూరేగింపు శ్రీ హరి
సర్వోత్తమరావు గారన్నట్లు "దేవతలకు కూడా చూడదగిందిగా" వున్నది. సూర్యా
పేట ముఖ్య వీధుల గుండా యీ వూరేగింపు సుమారు గం. 2-30లు జరిగింది.

## తొలి సమావేశము

ఊరేగింపు సభాస్థలియైన గాంధీ పార్కుకు చేరగానే సాయంత్రం గం6-30లకు
సభా కార్యక్రమం ప్రారంభం అయింది. జనతా కళామండలి బాలుర వైదికాంధ్ర
పాఠశాల బాలికలు జాతీయ గీతం పాడారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ కోదాటి
వెంకటేశ్వరరావు గారు, స్వాగతోపన్యాసము యిచ్చారు. వారు తమ వుపన్యాస
ములో నల్లగొండజిల్లా, ముఖ్యంగా సూర్యాపేట ప్రాంతం పురాతన కాలంలోను,
ఆధునికయుగంలోను వహించిన ప్రముఖపాత్రను వివరించారు. సమాజోన్నతికి గ్రంథా
లయోద్యమమే ప్రధాన భూమికను నిర్వహించగలదనే తమదృఢ విశ్వాసాన్ని
చాటారు



ఊరేగింపు దృశ్యము

ఆంధ్రదేశ గ్రంథాలయ వుద్యమంచేస్తూ వున్న సేవను వుగ్గడిస్తూ చివరకు "చెల్లాచెదురుగాపడియున్న ఆంధ్రులు ఏకమై భారతదేశ పురోగమనంలో సెబాసను పించుకోనులాగున భాగస్వాములగుదురుగా, అనతికాలంలో చూడగల్గుదుమ"ను తమ ఆశను వెలిబుచ్చారు.

సభాప్రారంభకులైన హైదరాబాద్ విద్యాశాఖాధ్యక్షులు శ్రీ ఫజుల్ రహమాన్ గారిని శ్రీ కోదాటి నారాయణరావుగారు పరిచయం చేశారు. ఫజుల్ రహమాన్ గారు నల్లగొండ జిల్లా చరిత్రను వివరించి, భారతదేశములో యిప్పుడిప్పుడే మొదలైన సామాజిక విద్యా కార్యక్రమములో యీ మహాసభ ప్రధానపాత్ర వహించగలదని ఆశించారు.

మహాసభాధ్యక్షులు శ్రీ పతాపగిరి రామమూర్తిగారిని శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు పరిచయం చేస్తూ, వారి దేశభక్తినీ, వైదుష్యాన్నీ ప్రశంసించారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు వారిని అధ్యక్షత వహించగోరారు. శ్రీ రామమూర్తిగారికి స్వాగతమిస్తూ జనతాకళామండలి బాలుడు, వైదికాంధ్ర బాలికా పాఠశాల బాలికలు, ఒక సుందర గేయాన్ని మధురంగా గానం చేశారు. రెండు శ్రేణులుగా ఏర్పడి ఒక బాలుడు – ఒక బాలిక ఒక్కొక్క జట్టుగా ఒక్కొక్క చరణాన్ని పాడి అధ్యక్షుల కొకమాల సమర్పించటమూ, బృందమంతా కలసి పల్లవి పాడటమూ ఎంతో మనోహరంగా కన్పట్టింది.

మహాసభాధ్యక్షులు తమ ప్రారంభోపన్యాసంలో ప్రాచీన కాలంలో గ్రంథాలయోద్యమానికి యిచ్చిన విశిష్టస్థానాన్ని సప్రమాణంగా ఉదహరించారు. యీకాలపు గ్రంథాలయోద్యమపు బాగోగులను చర్చించారు. ఉద్యమాభివృద్ధికి అనేకమైన క్రొత్త సూచనలను చేశారు.

శ్రీగుండావఝ్ఝుల కృష్ణమూర్తిగారు గ్రంథాలయ గీతాలను పాడారు. మహాసభకు రాజాలనందుకు విచారిస్తూ మహాసభ జయప్రదంగా జరుగవలెనని, శుభకాంక్షలను తెల్పుతూ పెద్దలు పంపిన సందేశాలను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ సహాయ కార్యదర్శి శ్రీ కోదాటి నారాయణరావుగారు చదివారు. శ్రీ గొబ్బూరి గోపాల కృష్ణమూర్తిగారు సభకువచ్చిన పెద్దలకు, సభికులకు స్వాగతమిస్తూ, తాము వ్రాసిన పద్యాలను వినిపించారు. సంఘవార్షిక నివేదికను కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు సభికులకు సమర్పించారు.

శ్రీమతి అయ్యదేవర బాలాత్రిపుర సుందరమ్మగారు, శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారూ యీ సభకుగల ప్రాముఖ్యతను నిర్వహించవలసిన పాత్రను గురించి వుపన్యసించారు. శ్రీయుతులు చిగురుపాటి, ఆకెళ్లసుబ్రహ్మణ్యకవులు వ్రాసిపంపిన "ఆంధ్ర సరస్వతీ" అన్న పద్యాలను శ్రీ యస్. లక్ష్మీనరసింహాచార్యులుగారు చదివి వినిపించారు. ఆహ్వానసంఘ కార్యదర్శి ముందు కార్యక్రమాన్ని వివరించారు. అంతటితో మహాసభ మొదటి సమావేశము రాత్రి 10 గం లకు ముగిసింది.

రాత్రి సూర్యాపేట జనతా కళామండలి వారు "గెలుపు నీదే" అనే నాటకాన్ని చక్కగా ప్రదర్శించారు. శ్రీయుతులు ప్రతాపగిరి రామమూర్తి, హరిసర్వోత్తమరావు గార్లుఆ నాటకాన్ని ఎంతో ప్రశంసించారు.

## మరురోజు

ఉదయం ఉపాహారానంతరం గం. 9. లకు వయోజన విద్యాశాఖా సమావేశం ప్రారంభమయినది. ఈ శాఖాసమావేశానికి దాదాపు నాల్గువందల మంది సభికులు విచ్చేశారు. జనతాకళామండలి సభ్యుడు శ్రీగంధం నర్సయ్యగారు జాతీయగీతం పాడడంతో సమావేశం ప్రారంభం అయింది. సమావేశ కార్యదర్శి శ్రీ కాశే నాగేశ్వరరావుగారి కోరికపై సంఘకార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు అధ్యక్షత వహించవలసిన శ్రీ రెవరెండు యం. జె. ప్రకాశంగారిని పరిచయంచేశారు. అధ్యక్షులు శ్రీ ప్రకాశం గారు తమ వుపన్యాసంలో వయోజనవిద్య వుద్యమం నిమిత్తం దక్షిణ భారతంలో ముఖ్యంగా ఆంధ్ర దేశంలో జరుగుతూవున్న కృషిని, వివిధ సంస్థలు నిర్వహిస్తూ వున్న పాత్రలను చక్కగా వివరించారు. వయోజనవిద్యా వ్యాప్తికి అనుభవ పూర్వకమైన సలహాలనిచ్చారు.

వయోజన విద్యను గురించి వచ్చిన వ్యాసాలలో కొన్నింటినిరచయితలు చదివారు. ఈ సమావేశంలో తెలుగు భాషలోని వివిధ వయోజన విద్యా బోధనాపద్ధతులను రాయలసీమ ప్రతినిధి శ్రీ ఎ. పి. వెంకటరెడ్డిగారు చక్కగా వివరించి చెప్పారు. శ్రీ కొట్టపాటి వెంకటసుబ్బారావుగారు తమ అనుభవాన్ని పురస్కరించుకొని కొన్ని నూతన సూచనలు చేశారు. సమావేశం పగలు గం. 1 వరకు సాగింది. ఇంకను చదువవలసిన వ్యాసాలు చాలా వుండటంవల్ల సమావేశం తిరిగి వాయిదాపడింది.

ఈ సమావేశంలోనే హాలువెలుపల యోగవ్యాయామ ప్రదర్శనం, సూర్యనమస్కారాలు ప్రకృతి వైద్యవిశారదులు శ్రీ కొలిపాక ఆదినారాయణశర్మగారు జరిపారు. అనేకమంది ప్రజలు వీటిని చూచి లాభంపొందారు.

మధ్యాహ్నం గం. 3 ల నుంచి గ్రంథాలయ నిర్వహణశాఖ సమావేశం జరిగింది. దాదాపు మూడువందలమంది సభికులు వచ్చారు. శ్రీ పాతూరి నాగభూషణం గారి గ్రంథాలయ గీతంతో సమావేశం ప్రారంభమైంది. ఈ సమావేశానికి అధ్యక్షత వహించవలసిన ఆంధ్ర విశ్వకళాపరిషత్తు గ్రంథభాండాగారి శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు ఆకస్మికంగా జబ్బుపడి రాజాలక పోయినందున ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు అధ్యక్షత వహించారు. వీరు తమ వుపన్యాసంలో గ్రంథాలయానికి అనువైన స్థలం మొదలు ఆచూకీ సేవవరకు గల అన్ని గ్రంథాలయ నిర్వహణ విషయాలను చక్కగా వివరించి చెప్పారు. స్త్రీల శాఖ, పిల్లలశాఖ, మొదలైన వివిధ గ్రంథాలయ శాఖలను నెలకొల్ప వలసిన అవసరాలను తెల్పుతూ విధానాలను సూచించారు. కార్యదర్శి నివేదిక తర్వాత, భారత



శ్రీ మాడపాటి హనుమంతరావుగారు (పుట 4)

దేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీ యస్. ఆర్. రంగనాథన్ గారు పంపిన "లైబ్రరీ కేటలాగింగ్" అనే ఇంగ్లీషు వ్యాసాన్ని శ్రీ పాతూరి నాగభూషణంగారు చదివి తెలుగులో సంక్షిప్తంగా అనువదించారు. శ్రీ టి. మల్లయ్యగారి "గ్రంథాలయాలు, వర్గీకరణం" అనే వ్యాసం చదివి వినిపించబడింది. తరువాత శ్రీ పాతూరి నాగభూషణంగారు తెలుగు గ్రంథాలయాల వర్గీకరణంపై తమ వ్యాసాన్ని చదివి వినిపించారు. శ్రీ తిరుపతి వెంకటేశ్వర ప్రాచ్య విద్యా పరిషత్తువారి వర్గీకరణ పద్ధతిని చెప్పి అది మన కెంతవర కుపయోగపడగలదో, ఏయే మార్పులు అవసరమో వివరించారు. వారు చెప్పిన విషయాలను యింకా ఆలోచించవలసిందని కార్యకర్తలు కోరారు. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు "తెనుగు నుడిదండలు" అనే తమ వ్యాసాన్ని చదివారు. అధ్యక్షుల సమీక్ష తర్వాత కార్యదర్శి వందన సమర్పణంతో ఈ శాఖా సమావేశం ముగిసింది.

తర్వాత వయోజన విద్యాశాఖా సమావేశం ప్రారంభమై మిగిలిన వ్యాసాలలో కొన్నిటిని రచయితలు చదివారు. శ్రీ కొలిపాక ఆదినారాయణశర్మగారు మరికొన్ని యోగాసనాలను ప్రదర్శించారు. తర్వాత శ్రీ ఎ. పి వెంకటరెడ్డిగారు ఏవిధంగా నిరక్ష రాస్యులకు అక్షరాలను నేర్పవలెనో బహిరంగంగా ప్రదర్శించుచు సుమారు గం $\frac{1}{4}$ కాలంలో శ్రీహరి సర్వోత్తమరావుగారి పద్ధతి ప్రకారం అయిదుగురు నిరక్షరాస్యులకు మూడక్షరాలను గుర్తించేటట్టు వాటిపై వచ్చేపదాలను చదివేటట్లు చేశారు. ఇది సభికులను యెంతో ఆకర్షించి అక్షరాస్యతపై వారికి శ్రద్ధను కలిగించింది.

## ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథనిలయ రజతోత్సవం

సూర్యాపేటలోని ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథనిలయం 1916 లో స్థాపించ బడింది. రజతోత్సవం జరపటానికి అక్కడవుండేఅవాంతర పరిస్థితులవల్ల వెంటనే చేయ లేకపొయ్యారు. గ్రంథాలయ మహాసభలు జరిగే ఈ సందర్భాన్ని పురస్కరించుకొని రజతోత్సవాన్ని చేయ సంకల్పించారు. పై విషయాలన్నింటినీ చెప్పుతూ గ్రంథనిల యాధ్యక్షులు శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు అధ్యక్షత వహించవల సిందిగాను, శ్రీ కోదాటి నారాయణరావుగారు పంతులుగారిని పరిచయం చేయవల సిందిగా కోరారు. శ్రీ నారాయణరావుగారు పంతులుగార్ని సభికులకు పరిచయం చేస్తూ వారు తెలంగాణాకేగాక యావదాంధ్ర దేశానికి యేవిధంగా సేవచేసిందీ విశదీకరించారు. శ్రీ పంతులుగారు అధ్యక్ష పీఠాన్ని అలంకరించటంతోనే గ్రంథనిలయ పక్షాన వారికి సన్మాన పత్రాన్ని నిలయాధ్యక్షులు శ్రీకోదాటి వెంకటేశ్వరరావుగారు సమర్పించారు. శ్రీ పంతులుగారు సన్మాన పత్రానికి జవాబు చెప్పుతూ తాముచేసిన సేవ ఏమంత గొప్పదికాదనీ, అయితే ఆరోజుల్లో యెవరూ లేకపోవటంవల్ల తమకు ప్రతిష్ఠ దక్కిందనీ దాన్ని ఏ రాజకీయ కక్షల్లోను దిగకుండా తాను కాపాడుకొంటున్నా నని ఛలోక్తిగా చెప్పుతూ తమకు సర్వకాల సర్వావస్థల్లోను సూర్యా పేట వెనుకండగా వుందన్నారు. తమ అక్షరాభ్యాసం సూర్యాపేటలోనే అయినదని

తమ బాల్యం ఇక్కడనే గడిచిందనీ తమకూ సూర్యాపేటకూ పరస్పర ప్రేమ యెంతో గాఢమైందనీ సెలవిస్తూ తమకు సన్మాన పత్రాన్ని యిచ్చినందుకు సూర్యాపేట పౌరులకు, నిలయ సభ్యులకు కృతజ్ఞతను వెల్లడించారు. గ్రంథాలయ మహాసభలను ఈ స్థాయిలో జరుపుతున్నందుకు సూర్యాపేట పౌరులను ఎంతో ప్రశంసించారు. తర్వాత తమ అధ్యక్షోపన్యాసంలో ఈ గ్రంథ నిలయం పౌర జీవితానికి సంపూర్ణ ప్రతి బింబం అనీ, ప్రభుత్వంవల్ల యే యే అవస్థల్లో ఏయేకష్టనష్టాలకు పాలైందీ వివరించారు. త్వరలో స్వర్ణోత్సవం యింతకంటే వైభవంగా జరుపుకోవలెనని ఆకాంక్షించారు.

నిలయ కార్యదర్శి శ్రీ చకిలం శ్రీనివాసరావుగారు నిలయపు ఇరువైఐదు సంవత్సరాల చరిత్రను సభికులకు నివేదించారు.

## గ్రంథాలయోద్యమపు పెద్దలకు సన్మానం

తమ జీవితంలో ప్రముఖ భాగాన్ని గ్రంథాలయోద్యమానికి అంకితంజేసిన వయోవృద్ధులైన పెద్దలు శ్రీయుతులు మారేపల్లి రామచంద్రశాస్త్రి, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, మాడపాటి హనుమంతరావు, అయ్యంకి వెంకటరమణయ్య, భూపతిరాజు తిరుపతిరాజు, నాళం కృష్ణారావు, కొమ్మూ సీతారామయ్యగార్లను నిలయపక్షాన సన్మానించారు. నిలయాధ్యక్షులు శ్రీ వెంకటేశ్వరరావుగారు వారందరికి సన్మాన పత్రాలను, శాలువలను బహూకరించారు. వారందరినీ శ్రీ కోదాటి నారాయణరావుగారు సభికులకు పరిచయంచేస్తూ వారు గ్రంథాలయోద్యమానికి చేసిన సేవను ఎరుక పరిచారు. సభకు రాజాలని పెద్దలు, శ్రీయుతులు భూపతిరాజు తిరుపతిరాజు, నాళం కృష్ణారావుగార్లు తప్పమిగతావారందరూ తమ గ్రంథాలయోద్యమ అనుభవాలను పేర్కొంటూ ప్రత్యుత్తరాలు జెప్పారు. గ్రంథనిలయానికి తమ ఆశీర్వాదాలనిచ్చారు. తర్వాత జనతాకళామండలి దర్శకులు శ్రీవారణాశి వెంకట నారాయణ శాస్త్రిగారు తాము గ్రంథాలయోద్యమముపై వ్రాసిన దివ్యజ్యోతి అనే బుర్రకథను మండలి అధ్యక్షులు శ్రీ శ్రీ సూర్యనారాయణశర్మ వ్యాసం చెన్నకృష్ణదాసుగార్ల సమాకారంతో చెప్పారు. కార్యదర్శి వందన సమర్పణంతో రాత్రి గం 12 లకు రజతోత్సవం ముగిసింది. అనంతరం స్థానిక వైదికాంధ్ర బాలికా పాఠశాల విద్యార్థినులు "అత్తాకోడళ్ళసంత" అనే నాటకాన్ని చక్కగా చాతుర్యంగా ప్రదర్శించారు.

## మూడవ రోజు

9వ తేదీ వుదయం గం 9 లకు ప్రచారశాఖా సమావేశం, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి అధ్యక్షతన ప్రారంభమైంది. అధ్యక్షులు మానవ జీవితంలో, గ్రంథాలయం యేవిధంగా ప్రధానోపయోగకారియో వివరిస్తూ "గ్రంథాలయం" ప్రజల విశ్వకళాపరిషత్తు అని నిరూపించారు. దాన్ని ప్రజల్లో ప్రాకించటానికి ఏయే ప్రచారపద్ధతులను, అవలంబించవలెనో తమ అనుభవాలను వుదహరిస్తూ పేర్కొన్నారు. యాత్రలు, ప్రదర్శనాలూ, ఏవిధంగా వుపకరించగలవో

వివరించారు. ఇతర దేశాల్లో పోస్టాఫీసుల్లో, దుకాణాల్లో యేవిధంగా, గ్రంథాలయా లను నెలకొల్పారో తెలిపారు. విద్యాశాఖవారి ఉదాసీనతను గర్హించారు.

ప్రభుత్వం, ప్రజలు తగిన సహకారం ఈయని, గ్రంథాలయోద్యమంలో, పని చెయ్యటం బూడిదలో నిప్పును పుట్టించటం అన్నారు. ప్రచారం చేయవలసిన విధము వాని శాఖలు, గ్రంథాలయంలో వుంచవలసిన శాఖలు వాటిని ప్రచుర పరచవలసిన విధము, ఇవన్నీ వివరంగా అధ్యక్షులు వుపన్యాసంలో విపులంగా సెలవిచ్చారు. తర్వాత శ్రీ శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరంగారి "గ్రంథాలయం నేటి దేవాలయం" అనే గీతాన్ని "పూజ్యులారా" అనే గీతాన్ని శ్రీ పాతూరి నాగభూషణంగారు చదివారు.

తర్వాత ప్రచార పద్ధతులపై వచ్చిన 14 వ్యాసాలను చదవటం సందేహాలకు సమాధానాలివ్వడం జరిగింది. ఇందులో పేర్కొనతగినవి ఇండియన్ లైబ్రరీ ఆసోసి యేషన్ అధ్యక్షులు శ్రీ యస్.ఆర్. రంగనాథన్‌గారు పంపిన మద్రాసు గ్రంథాలయ చట్టం విమర్శ, శ్రీ పాతూరి నాగభూషణంగారి వ్యాసం, శ్రీయం.జె. ప్రకాశంగారి "నేను గ్రహించిన కొన్ని సత్యాలు" అనే ప్రవచనం, శ్రీ పెరుంబుదూరు లక్ష్మీనరసింహా చార్యులుగారి వ్యాసం. మధ్యాహ్నం గం 1 కు ఈ సమావేశం ముగిసింది.

మధ్యాహ్నం గం 3 లకు విషయనిర్ణయ సభ సమావేశమై సభలో తీర్మా నించవలసిన ప్రస్తావనలపై చర్చించి వాటికి తుది స్వరూపం యిచ్చారు.

సాయంత్రం గం 5-30 లకు వయోజనవిద్యా శాఖా తుది సమావేశం ప్రారంభ మయింది. మిగిలిన వ్యాసాలు చదవటం, చర్చించటం జరిగింది.

## గాడిచర్లవారి షష్టిపూర్తి ఉత్సవం

సాయంత్రంసుమారు గం 7లకు శ్రీయుతులువారణాశి వెంకటనారాయణశాస్త్రి, వేదం కృష్ణమూర్తి (జనతా కళామండలి) గార్ల వేదోక్త ఆశీర్వాదంతో, సర్వోత్తముని షష్టి పూర్త్యుత్సవం ఆరంభం అయింది. సుప్రసిద్ధ పండిత వర్యులు శ్రీ మారేపల్లి రామ చంద్ర శాస్త్రిగారు యీ మహోత్సవానికి అధ్వర్యం వహించారు. శ్రీ శాస్త్రిగారు తమ తొలిపలుకుల్లో శ్రీహరి సర్వోత్తమరావుగారిసేవను గురించి విపులంగా ప్రస్తా విస్తూ, ఆంధ్ర దేశంలో శ్రీహరి సర్వోత్తమ రావుగారి వలె సేవజేసిన వారు దాదా పుగా లేరనె చెప్పవచ్చునన్నారు. ఇది వారి షష్టిపూర్తి. ఆయన కంటే వయస్సులో పెద్ద లైన తమకు వారిని, ఈ తరిని ఆశీర్వదించే భాగ్యం లభించినందుకు సంతసిస్తూ హరి సర్వోత్తమరావుగారికి ఆయురారోగ్యాలు లభించవలెనని ఈశ్వరుని ప్రార్థించారు.

శ్రీ ఆచార్య ప్రతాపగిరి రామమూర్తిగారు శ్రీ హరిసర్వోత్తమరావుగారి జీవిత రహస్యాలను విడమర్చి చెప్పుతూ వారు నాకు నిత్య స్మరణీయులైన ఆచా ర్యులన్నారు. శ్రీ వారు అనేకరంగాలలో ప్రవీణులు. కార్యరంగంలో నడుముగట్టి మాదిరిగా. విజ్ఞాన రంగంలో ప్రోడిమ, తెలుగులో ఆలోచించు ఆపుసని నెరవేరుస్తాడు.

వారు ఎంత కార్యశూరులో, అంతవేత్తలు. వేదాంతం అంటే, వృత్తి తర్కంగా పరిగణించక, వీరు నిత్యజీవితంలో అనుష్ఠిస్తారు. వారి జీవితంతో సన్నిహిత సంబంధం కల్గించుకొని, చూచేవారికి, వారి నిత్యజీవితం వేదాంతాన్ని బోధిస్తుంది. ఆంధ్రదేశంలో సాటిలేని విజ్ఞాన వేత్త. ఏ విషయంలోనైనా సరే వారికి తెలియని భాగం చాలా స్వల్పం. వారు వ్రాసిన వ్యాసాలను చూచి నేను చకితుణ్ణయ్యాను. వారి గ్రంథాలు నావద్ద చాలావున్నవి. జీవితంలో ఒక్కక్షణంకూడా వారు వృథాచేయరు. ఈ పెద్ద వయస్సులో నిరంతరం తిరుగుతూ వయోజనవిద్యా, గ్రంథాలయోద్యమాలే గాకుండా, ఇతర అనేక ఉద్యమాల్లో కృషిచేస్తూ అనేక విషయాలను గురించి పుస్తకాలు వ్రాస్తున్నారంటే ఆశ్చర్యం కల్గిస్తుంది. శ్రీ గొబ్బూరి గోపాలకృష్ణయ్యగారు వీరిని గురించి వ్రాసిన పద్యాలు చదివారు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు హరిసర్వోత్తమరావుగారిని, గురుతుల్యులని పేర్కొని నమస్కరిస్తూ శ్రీ సర్వోత్తముని జీవితంలోని, ముఖ్య సన్నివేశాలన్నిటినీ వివరించి చెప్పారు. అవి 1906 రోజులు పాశ్చాత్యప్రభ అజేయంగా వెల్గుతున్నది. బెంగాల్ విభజనోద్యమ సమయం. స్వాతంత్ర్యం వస్తుందని ఆశకూడా లేని రోజులు. ఆ రోజుల్లో వున్నత విద్యపూర్తిజేసి యల్.టి, చదివే పంతులుగారు, సరంగులనుచేరదీసి, ఆబ్రహాం లింకను చరిత్రను వారికి చెప్పి, స్వాతంత్ర్యం అంటే యేమిటో వారికి బోధించి వయోజనవిద్య నారంభించారు. వందేమాతరం వుద్యమం విజృంభించింది. ట్రెయినింగ్‌ను కాలదన్ని వుద్యమంలో కొదమసింగంవలె దూకారు. పత్రికల్లో శంఖారావంచేస్తూ వీరు వ్రాసిన వ్యాసాలకు ప్రభుత్వం అరెస్టు చేసింది. లోకమాన్య బాలగంగాధర్ తిలక్, వీరూ సరిగా వొకే రోజు అరెస్టయినారు. మూడేండ్ల శిక్ష అనుభవించారు. ఆంధ్ర దేశంలో మొట్టమొదట రాజకీయోద్యమంలో శిక్షపొందిన వారు వీరే. తర్వాత శ్రీయుతులు కొమర్రాజులక్ష్మణరావు, రావిచెట్టురంగారావుగార్లతోకలసి విజ్ఞాన చంద్రికా పరిషత్తు నెలకొల్పి పని చేశారు. తర్వాత ఆంధ్ర పత్రికా సంపాదకులుగా నున్నారు. వందేమాతరం రోజుల్లో వీరివెంట తోడు కూడా యెవరు లేకపొయ్యేవారు. సాయం వరదదాసుగారనే వారు మాత్రం వొక్కరుండేవారు. వారు జాతీయోద్యమ గేయాలు, భజనలు చేసేవారు. అప్పటినుంచిన్నీ విశ్రాంతి లేకుండా అన్నిరంగాల్లో పనిచేస్తూనే వున్నారు. రాయలసీమ తరఫున కొన్నాళ్ళు మద్రాసు శాసనసభలో సభ్యులై ఆదర్శ శాసనసభ్యుడు యెట్లావుంటాడో ప్రపంచానికి చాటారు.

గాంధీ తత్వంలో పరమ విశ్వాసంగల వీరికీ, గాంధీజీకి యెప్పుడూ వివాదమే. తాముగట్టిగా విశ్వసించిన దాన్ని మొహమాటానికి, వదలక గట్టిగా వాదిస్తారు. తమది తప్పని తెలిస్తే వొప్పుకుంటారు. అందువలననే వీరు పైకిరాలేక పొయ్యారు. దానికి వారికిగాని మాకుగాని విచారంలేదు.

నీతి, నియమం, కలిగలవారు ఈనాడు శ్రీ హరిసర్వోత్తమరావుగారు ఒక్కరే. వారు సర్కారు, తెలంగాణా, రాయలసీమ, ప్రజల్లో ఐక్యతచేకూర్చి, విశాలాంధ్రాన్ని సాధించాలి. అప్పుడే వీరు జీవితంలో కృతకృత్యు లౌతారు.

శ్రీ ఆకెళ్ళ సుబ్రహ్మణ్య కవిగారు పంతులుగారిని అభినందిస్తూ రచించిన పద్యాలు చదివారు. శ్రీమతి అయ్యదేవర బాలా త్రిపురసుందరమ్మగారు, పంతులుగారి జీవితంలో, తాము ఎరుగని ఎన్నో ఘట్టాలను వెలికి తీసిన శ్రీ వావిలాలగోపాలకృష్ణయ్యగారిని అభినందించారు. శ్రీ పంతులుగారి, పటాటోప మెరుగని నిరాడంబర జీవితాన్ని ప్రశంసించారు. వారికి గల స్త్రీ విద్యాభిమానం అపరిమితం అనీ, స్త్రీల ద్వారా ప్రజా వుద్యమం చాలా ముందరికి పోగలదనీ వారికి దృఢ విశ్వాసమనీ, వుద్యమానికి సర్వోత్తమరావుగారు చేసిన కృషిని వివరించారు. భగవంతుడు వారికి ఆయురారోగ్యాలు లభింపజేయవలెనని కోరారు.

గొబ్బూరి గోపాలకృష్ణకవిగారు తాము సర్వోత్తమరావుగారిని గురించి వ్రాసిన గీతాలు చదివారు.

శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు పంతులుగారి జీవిత విశేషాలను తమకు వారితోగల సాహచర్యాన్ని గురించి విపులంగా వుపన్యసించారు.

శ్రీ రెవరెండు యం. జె. ప్రకాశంగారు వయోజనవిద్యా వుద్యమానికి పంతులుగారు చేసిన మహోపకారాన్ని వివరించి, వారు ఆంధ్ర ప్రజలందరికీ "గురూజీ" అని స్తుతించారు. శ్రీ జె. ఆదినారాయణగుప్తగారు పంతులుగారి సేవను అభినందిస్తూ తెలంగాణా ప్రజల పక్షాన వారికి అభివందనలు సమర్పించారు. శ్రీ యల్లాప్రగడ కృష్ణమూర్తిగారు పంతులుగారి యెడ తమకుగల భక్తిని వెల్లడిస్తూ వారిభక్తికి చిహ్నంగా ఈ సంవత్సరం నెలకు ఒక్కరిని చొప్పున 12 మందిని అక్షరాస్యులను చేయగలనని శపథం చేశారు. శ్రీకొత్రపాటి వెంకటసుబ్బారావుగారు, తాము శ్రీ పంతులుగారిని గురించివ్రాసిన ఒక గేయాన్ని చదివారు. శ్రీమతి జానపాటి దుర్గమ్మగారు పంతులుగారిని అభినందిస్తూ వయోజన విద్యా విషయంలో జరుగవలసిన పనిని, ప్రస్తావిస్తూ ప్రశంసించారు. వయోజన విద్యా పత్రికా సంపాదకులు శ్రీ శ్రీకంఠంగా పంతులుగారి నాయకత్వంలో ఆంధ్రదేశంలో వయోజనవిద్యా వుద్యమం యేవిధంగా సాగిపోతున్నదీ వివరించి వారిని ప్రస్తుతించారు. శ్రీ వారణాశి వెంకటనారాయణశాస్త్రిగారు తాము వ్రాసిన "దివ్యజ్యోతి" అనే బుర్రకథను పంతులుగారికి అంకితం యిచ్చారు.

సూర్యాపేట పౌరుల పక్షం నుంచి శ్రీ కోదాటి వెంకటేశ్వరరావుగారు సన్మాన పత్రాన్ని, నూతన వస్త్రాలను, రు 316/- లను షష్టిపూర్తి కానుకగా సమర్పించారు.

శ్రీ హరిసర్వోత్తమరావుగారు సన్మానానికి ప్రత్యుత్తరమిస్తూ మార్కండేయునంత చిరంజీవిగా వుండకపోయినా ఇంకా కొంత కాలం జీవించి వుండాలనే సంక

ల్పంతో ఈ ప్రత్సవాలను చేస్తున్నామని చెప్పారు. ఈ షష్టిపూర్తి ఉత్సవాలను గురించి శ్రీ నాగభూషణంగారు ప్రస్తావించినప్పుడు, దీనివల్ల ప్రపంచానికి లాభంకలిగితే తన కభ్యంతరంలేదనీ, అట్లా కాకుంటే తన కభ్యంతరం గలదని అన్నామన్నారు. షష్టిపూర్తి ఉత్సవాలు జేసి అందువల్ల వచ్చిన నిధిని, గ్రంథాలయోద్యమానికి చెందింపజేసి కొంటామని శ్రీనాగభూషణంగారనగా, తామంగీకరించామన్నారు. అందుకని లక్షలు యిచ్చినా పుచ్చుకొంటామనీ, స్వంతానికి చిల్లిగవ్వ అక్కర్లేదని తెలిపారు. తర్వాత తమను గురించి చేసిన ప్రశంసల కన్నింటికీ ప్రత్యుత్తరమిస్తూ పీఠలో వాత్సల్య చిహ్నాలన్నారు. భగవద్గీతలో చెప్పినట్లుగా ఫలితాన్ని గురించి ఆలోచించక కర్మచేయటమే తమధ్యేయమన్నారు. తమ జీవిత కాలంలో తాము చూచిన అభివృద్ధిని చూచి నిరాశకు జీవితంలో తావివ్వరాదన్నారు. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య చెప్పినట్లు సర్కారు తెలంగాణా రాయలసీమ ఆంధ్రులను ఒక త్రాటికి తీసుకొని రావటమే తమ ప్రస్తుత ఆశయమనీ, దానిలో సఫలత చెందితే తమ జీవితము కృతకృత్యమైనట్లేననీ వారు సెలవిచ్చారు. శ్రీ పంతులుగారు తమ జీవితంలోని వివిధ ఘట్టాలను ప్రస్తావిస్తూ గంభీరమైన ప్రసంగం చేశారు. చివరకు సూర్యాపేట వాస్తవ్యులకు వారు తమయెడ జూపిన ఆదరాభిమానాలకు కృతజ్ఞత తెలిపారు.

శ్రీరావుగారి షష్టిపూర్తి కానుకగా మిరియాలగూడెంలో ప్రజాసేవాతత్పరులైన శ్రీ జె.ఆదినారాయణగుప్తగారు నూతనవస్త్రాలను, శ్రీఅమరవాదివెంకటనరసయ్యగారు రు 20 లు హారీలను, సూర్యాపేట కుట్టుపని సంఘంవారు రు 2 లును సమర్పించారు. శ్రీ పాతూరి నాగభూషణంగారి వందన సమర్పణతో సభముగిసింది.

## మహాసభ తుదిసమావేశము

షష్టి పూర్త్యుత్సవము ముగియగానే మహాసభ తుది సమావేశము శ్రీ ప్రతాపగిరి రామమూర్తిగారి అధ్యక్షతన ప్రారంభమైంది. తాము రాజాలనందరకు విచారిస్తూ సభలు జయప్రదంగా జరగాలని పెద్దలు వ్రాసిన శుభాకాంక్షలను శ్రీ కోదాటి నారాయణరావుగారు చదివారు. శ్రీ రెడ్డి చిన వెంకటరెడ్డిగారు పద్యాలు చదివారు. రజాకార్ల చేత నాశనం చేయబడ్డ గ్రంథాలయాలకు సహాయం నిమిత్తం ఆయా గ్రంథాలయాల వారు పంపిన వినతులను శ్రీ కోదాటి నారాయణరావుగారు సభికులకు చదివి వినిపించారు.

ప్రదర్శనకు వచ్చిన గ్రంథాలలో ఉత్తమ గ్రంథాలకు బహుమాన ప్రదానం మహాసభాధ్యక్షులచేత జరిగింది. ఉత్తమ గ్రంథ నిర్ణయం శ్రీ రామమూర్తిగారు, శ్రీ హరిసర్వోత్తమరావుగారు చేసి ఈ దిగువ గ్రంథాలను బహుమాన యోగ్యములుగా నిర్ణయించారు.

## శాస్త్రేతర గ్రంథములు

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర — సురవరము ప్రతాపరెడ్డి
2. ఆదిమవాసులు — చిరావూరి నాగభూషణాచార్యులు

## శాస్త్రగ్రంథములు

1. క్రొత్త చేనేతపద్ధతి — వ. వెంకటశెట్టి
2. (1) తేనెటీగలు — పాలమూరు శేషాచలార్యులు
   (2) పాడిపరిశ్రమ — మైనం శ్రీరాములు

## అచ్చు ముచ్చటలు వగైరా

1. గ్రంథాలయశాస్త్ర ప్రథమపాఠములు (ప్ర.కా.) సేవాశ్రమము, పెదపాలెము
2. శ్రీ వీరేశలింగ గ్రంథావళి 8 సంపుటములు (ప్రకా.) గ్రంథాలయ పుస్తకశాల

ఆ తర్వాత విషయనిర్ణయసభచే నిర్ణయించబడిన ప్రస్తావనలు సభలో ప్రవేశ పెట్టగా ఏకగ్రీవముగా ఆమోదింపబడి తీర్మానరూపం దాల్చినవి. శ్రీపాతూరి నాగ భూషణంగారు 'అందరికీ పుస్తకాలు' అనే గేయాన్ని శ్రావ్యంగా పాడారు. మహా సభాధ్యక్షులు జరిగిన కార్యక్రమాన్నంతటినీ సమీక్షించి తమ అభిప్రాయాలను వెలి బుచ్చారు. మహాసభను యింత జయప్రదంగా నిర్వహించిన ఆహ్వాన సంఘాన్ని అభినందించారు. మహాసభకు వచ్చిన ప్రతినిధుల పక్షాన శ్రీ నాగినేని వెంకయ్యగారు ఆహ్వానసంఘాన్ని అభినందిస్తూ కృతజ్ఞతా వందనాలు సమర్పించారు. ఆహ్వాన సంఘ కార్యదర్శి శ్రీ నరేంద్రుల మాణిక్యంగారు మహాసభాధ్యక్షులకు, గ్రంథాలయ సంఘా ధ్యక్షులకు, ఇతర పెద్దలకు, కార్యకర్తలకు, దాతలకు, ఉపన్యాసకులకు, వివిధ ప్రభుత్వ శాఖలకు, ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ, తోడ్పడిన అందరికీ, వేరువేరు వరుసల కృతజ్ఞతలు తెలిపారు.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘపక్షాన కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణం గారు ఆహ్వాన సంఘానికీ, ప్రతినిధులకూ, రచయితలకూ ప్రదర్శనానికీ మహాసభకూ తోడ్పడిన తదితరులకూ వందన సమర్పణం గావించారు.

శ్రీ గొబ్బూరి గోపాలకృష్ణశర్మగారి మంగళగేయ గానంతో సభముగిసింది. రాత్రి ప్రభుత్వ ఆరోగ్య శాఖవారు సినిమా ప్రదర్శనం చేశారు.

## పిల్లలమర్రి యాత్ర

10 వ తేదీ ఉదయం ఉపాహారానంతరం ఆహ్వాన సంఘంవారేర్పాటు చేసిన రెండు లారీలు, రెండు మోటారు కారులలో మహాసభకు వచ్చినపెద్దలూ, ప్రతినిధులూ పిల్లలమర్రి ప్రాచీన దేవాలయాన్ని చూచుటకు వెళ్లారు: పిల్లలమర్రి సూర్యాపేట ఫిర్కా

పమున గల నొక ప్రాచీన గ్రామము. అక్కడ కాకతి గణపతిదేవుని కాలమున ఆమన గల్లును రాజధానిగా చేసుకొని ఆ ప్రాంతాన్ని పరిపాలించిన రాజ ప్రతినిధులు, రేచర్ల వారు కట్టించిన దేవాలయాలు వున్నవి. జైమినీ భారత కర్త పిల్లలమర్రి పిన వీరభద్ర కవికి అది జన్మస్థానము.

ఊరి బయట గల ఆలయాన్ని, వూరులోపల గల రెండు ఆలయాలను పిల్లలమర్రివారి గృహస్థలాన్ని ప్రతినిధులు పరిశీలించారు. ఆ దేవాలయాల శిల్పంలోనూ వాస్తులోనూ గల ప్రత్యేకతను శ్రీ ప్రతాపగిరి రామమూర్తిగారు ప్రతి నిధులకు వివరించి చెప్పారు. ఊరిలోపల దేవాలయము మొదట జైన దేవాలయముగా వుండి తరువాత శివాలయంగా మార్చబడిన వైనమును శ్రీ రామమూర్తిగారు నిదర్శన పూర్వకంగా ప్రతినిధులకు చూపారు. వివిధ శిల్పఖండాల ఛాయా చిత్రాలు తీసుకోబడినవి. శ్రీ రామమూర్తిగారు ప్రాచీన ఆలయ శిల్ప విశేషాల పరి రక్షణకై తీసుకోవలసిన జాగ్రత్తను గురించి శ్రీ వెంపటి బుచ్చయ్యగారికి అనేక సూచన లిచ్చారు. స్థానిక విష్ణాలయాన్ని చూచి మధ్యాహ్నం గం 12 లకు తిరిగి సూర్యాపేటకు చేరుకున్నారు.

## కవిసమ్మేళనము

పిల్లలమర్రి నుండి రాగానే గాంధీపార్కులో కవి సమ్మేళనం ప్రారంభమైంది. శ్రీ శ్రీరామకవచం అనంతశాస్త్రిగారి ప్రతిపాదనపై శ్రీ జాస్తి వెంకట నరసయ్యగారు సమ్మేళనానికి అధ్యక్షత వహించారు. శ్రీ పాతూరి నాగభూషణం గారు అధ్యక్షులను సభికులకు పరిచయం చేశారు. అధ్యక్షులు కవి లోకానికి చేయ గలిగిన సేవను గురించీ కవిధర్మాన్ని గురించీ వివరిస్తూ ఉపన్యసించారు. అనంతరం ఇరవై యిద్దరు కవులు తమ రచనలను చదివి వినిపించారు. శ్రీ ఆకెళ్ళ సుబ్రహ్మణ్యకవి పిల్లలమర్రి దేవాలయాలపై రచించిన పద్యాలూ, గొబ్బూరి గోపాలకృష్ణశర్మగారు నైజాంను గద్దె దిగమని ప్రబోధించిన పద్యాలూ సభికులకు ఉత్తేజ మిచ్చినవి. చివరను కీ॥ శే॥ డాక్టరు గవ్వా మురహరిరెడ్డిగారి రచనలలోని కొన్ని పద్యాలను శ్రీ బండారు వీరమల్లు ప్రసాదరావుగారు వినిపించారు.

సమ్మేళనాధ్యక్షులు తమ ఉపసంహారోపన్యాసంలో కవులలోగల ఆవేశాన్ని, వారి రచనలలోని ప్రత్యేకతలనూ వేరువేరుగా పేర్కొని ప్రశంసించారు. ఈ ప్రాంతాలలో కొన్ని కుటుంబాల కుటుంబాలే కవులుగా వుండటం ఆశ్చర్య మన్నారు. ఆహ్వాన సంఘ కార్యదర్శి శ్రీ చక్కిలం శ్రీనివాసరావుగారి వందన సమర్పణంతో సమ్మేళనం ముగిసింది.



శ్రీ జాస్తి వెంకటనరసయ్యగారు (పుట 12)

ఆహ్వానసంఘం వారు ప్రతినిధులకు, కవులకు విందుచేశారు. భోజనానంతరం అధ్యక్షులకు, తదితర పెద్దలకు గౌరవ పురస్కారంగా వీడ్కోలు జరిగింది. రాత్రి సమాచారశాఖ వారి సినిమా ప్రదర్శనం, స్థానిక జనతాకళామండలి వారి నాటక ప్రదర్శనం జరిగినవి.

ఈ విధంగా 27 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ మహోన్నత స్థాయిలో వైభవోపేతంగానూ విజయవంతంగానూ నాల్గు రోజులు జరిగింది.

— రవి

# స్వాగత పద్యములు

## శ్రీ గొబ్బూరి గోపాలకృష్ణశర్మ

స్వాగత మాంధ్రకోశ శరణాలయ దిగ్విజయోత్సవార్హ బో
ధాగత నాయకావళి, కహర్నిశ లార్థిక సామ్యవాద చిం
తా గురుకార్య నిర్వహణదక్షుల, కర్థపుపేరిమ స్వార్థతా
త్యాగులుగాని విశ్వవిజయాభ్యుదయైక విలక్షణాళికిన్.

జయమగు నాంధ్రదేశము విశాలముగా నొనరించి దుష్టతా
భయమును బాపి న్యాయసువిభాగఫలంబు సమైక్యతా విధిన్
ప్రియమున నిచ్చు వారికి విభేదమనోరుజచే సదా పరా
జయమును లేనివారి కతిశాంత సమాహిత బోధనాళికిన్.

దేశాభ్యున్నతిగోరి స్వార్థరహితోద్దేశంబుతో నీ సమా
వేశంబందు నుపన్యసింప నెవరేన్ వేంచేసిరో వారి సం
దేశాలెల్ల ప్రజావళీ హృదయవీధిన్ జొచ్చి చైతన్య సం
కాశంబున్ గలిగించు స్వాగతమొసంగన్ లెందు మీరందరున్.

అయ్యా! స్వాగతమిచ్చి మిమ్మునిట కాహ్వానం బొనర్పంగ మీ
నెయ్యంబందుటగాదు గ్రంథనిలయ స్నేహార్థమైకాదు సా
హాయ్యంబున్గొని కుట్రబన్నుటకుగా దాజన్మ దౌర్భాగ్యులన్
కుయ్యాలించి సముద్ధరింతురని మ్రొక్కుల్ సేతు మెల్లప్పుడున్.

# స్వాగతోపన్యాసము

## శ్రీ కోదాటి వెంకటేశ్వరరావు బి. ఏ.

(ఆహ్వాన సంఘాధ్యక్షులు)

విభిన్న పరిపాలిత ప్రాంతములలోనున్న ఆంధ్రులందరము ఈ నాడు ఇక్కడ సమకూడుట, ఎంతో కాలము తర్వాత ఏదో సందర్భమున దవ్వుదవ్వులనుండి ఆప్తబంధువులు కలసినప్పటివలె నున్నది. ఈ సమ కూర్చిన భాగ్యము మాకు కల్గుట మాఅందరి మనస్సులను ఉత్సాహ ముతో ఉక్కూతలూగించుచున్నది. సూర్యకాంతివలె, నీటివలె, వాయు వువలె విజ్ఞాన వికాసములను లోకమంతటకేని లభింపజేయ దీక్షాకంకణ మును ధరించు లోకకల్యాణకారులను, ఇందరిని, ఒక్క వేదికపై దర్శించ గల్గుట సూర్యాపేటవాసుల మహద్భాగ్యమే యనవచ్చును. మండు వేసవిలో, ప్రయాణసౌకర్యములు లేని మారుమూలనగల ఈ చిన్న బస్తీకి, వ్యయప్రయాసలను లక్ష్యపెట్టక విచ్చేసిన తమ అందరికి మా హృదయపూర్వక స్వాగతము.

జాగీర్దారీవిధానము ప్రాతిపదిక గాగల మధ్యయుగపు నిరంకుశ ప్రభుత్వముచే తరతరములనుండి అణగద్రొక్కబడి అభివృద్ధి కెట్టి అవ కాశములు లేక పౌరస్వత్వముల పేరైనను ఎరుగకవిద్యావైజ్ఞానికోద్యమము లకుగూడ అనుమతింపబడక కటిక చీకటిలో నిన్న మొన్నటివరకు కొట్టు కొనుచుంటిమి. మతదురావేశము, దురహంకారము ఆ ప్రభుత్వమును ఆవేశించగా మేము ఇంకను దురవస్థపాలైతిమి. స్టేటు కాంగ్రెస్ యాజ మాన్యమున రాష్ట్రప్రజలు జరిపిన పోరాటఫలితముగా నైజాం ప్రభుత్వ అధ్వర్యమున పోలీసుచర్య జరిగి రజాకార్ల క్రూరమైన దోపిడుల హత్య లనుండి బయటపడితిమి. ప్రజాస్వామ్య భారత పౌరులమని తల ఎత్తు కొని చెప్పజాలు స్వచ్ఛంద వాతావరణము ఇప్పుడిప్పుడే యేర్పడు చున్నది.

ఇంతటితోనైనను శాంతియుత జీవనమునకు నోచుకొనకుండ, అరాచకశక్తుల ఘోర హింసాకాండ ప్రజలను నానాబాధలకు గురిచేయు

చున్నది. ఈ విపరీత పరిస్థితులలో మిమ్ములనాహ్వానించు సాహసము నకు మేము పూనుకున్నాము. మా పరిచర్యలు మిమ్ముల నే మాత్రము తృప్తిపరచ లేవని మాకు తెలియును. అయినను మీకు మాయెడగల ప్రేమ వీటన్నిటిని క్షమింపజేయగలదను దృఢ విశ్వాసమే మమ్మీ సాహ సమునకు పురిగొల్పినది.

కాల వైపరీత్యమువలన విభిన్న శకలములుగానైన ఆంధ్రజాతి, ఆంధ్రభూభాగము తిరిగి ఏకమై ఆశాలతలు చిగురించుచుండగా ఇచట మనము కలుసుకొనుచున్నాము. అధికార వాంఛలచేతను, వక్రమార్గ ములచేతను, కలుషితముగాని స్వచ్ఛమైన వైజ్ఞానిక, సాంస్కృతిక ప్రేరితమైన ఈ మహాసభ మన హృదయములను ప్రేమ సూత్రములచే బంధింపగలదనియు, అట్టి సూత్రములు త్రెంచుట ఎవరికిని శక్యముగాద నియు నా విశ్వాసము.

ఆంధ్రజాతి కంతకును గర్వకారణమైన అత్యంత ప్రాచీన మైన ఉజ్జ్వల చరిత్రను తెలంగాణాయందలి ప్రతి శిల చాటి చెప్పుచున్నది. మనమిప్పుడు సమావేశమైన ఈ నల్లగొండ జిల్లా ఆంధ్రజాతి యశోగానమునందు దేనికిని తీసిపోదు. ఫణిగిరి యందు ఇటీవలనే బయల్పడిన బౌద్ధ ఆరామములు, కొలనుపాక యందలి జాళుక్యావశేషములు, కాకతీయుల శిల్ప ప్రాభవమును చాటు నాగులపాడు పిల్లలమఱ్ఱి పానగల్లు గుళ్లు, పండిత పామరులకు తరణో పాయముగా పరమశివుని భక్తిమార్గమును మనస్సున పట్టించిన పాల కురికి సోమనాథుని నిలయమగు పాలకుర్తియును, తెలుగు తన ముట్టే పడునట్లు చిన్నికృష్ణు నలంకరించిన పరమభాగవతుడు పోతన జన్మస్థాన మైన బమ్మెరయును, కాకతీయ సామంతులగు రేచర్ల రెడ్లకును, తర్వాత చోళులకును రాజధానీనగరమైన ఆమనగల్లును, వెలమవీరుల పరాక్రమాతిశయముల చాటు రేచర్ల సింగమ, అనపోతనాయనుల దేవరకొండ రాచకొండ దుర్గములును, రెడ్డి రాజుల కాలమునాటి ఉర్లు గొండ, ఉండ్రుగొండ దుర్గములును అన్నిదశలయందును ఆంధ్రులు అనుభవించిన ప్రాచీన ఔన్నత్యమును ఎలుగెత్తి చెప్పుచున్నవి.

పాశ్చాత్య నాగరికతచే అంతగా ఇంకను ప్రభావితము కాకుండుటచే కాబోలు తెలంగాణాయందలి భాషా సాంప్రదాయములందు కోస్తాజిల్లాలలో వాడుక తప్పిన ప్రాచీన పదజాలము అపారముగా కన్పించును. భాషాశాస్త్ర పరిశోధకులు ఈఅవశేషముల నైనను సేకరింతురుగాక.

మనమిపుడుసమావేశమయినఈప్రదేశమునకు దక్షిణమునఒక మైలు దూరములో రాపోలు గుళ్లు అని వ్యవహరింపబడు శిథిలాలయములు గలవు. ఆ భూభాగము ఇప్పటికిని రాపోలుపాడు అని పిల్వబడుచున్నది. ఇచ్చట రాపోలు అను ప్రాచీన పట్టణముండి యుండును. సూర్యాపేట అంతప్రాచీనమైన గ్రామముగా కన్పట్టదు. ఇక్కడికి ఆ రేడు మైళ్ళ దూరములో పాత సూర్యాపేట అను గ్రామమున్నది. బహుశా అది దీనికి మాతృక అయియుండును. ప్రస్తుత మీా గ్రామమునకు హైదరాబాదునుండి బందరుకుగల అత్యంత ప్రాచీనమగు దండుబాటయను పేరు బొందిన రోడ్డును "మీార్ ఆలం" కాలంనాటి మసీదును మాత్రమే ప్రాచీన చిహ్నములు. ఇక్కడకు మూడుమైళ్ళ దూరమున ఇప్పటికిని దూరదూరము నుండి రెండు సంవత్సరముల కొకసారి గొల్లలు యాత్రకువచ్చు లింగమంతునిగుడి ప్రాచీన జానపద సాంప్రదాయమునకొక చిహ్నము.

పురాతన వైభవముమాటఎట్లున్నను తెలంగాణా ఆంధ్రుల నవశకోదయమున సూర్యాపేట అత్యంత ప్రముఖపాత్ర వహించినది. ఆంధ్ర పితామహులైన శ్రీహనుమంతరావుగారి మేలుకొలుపును విని మొదట తెలివినందినది సూర్యాపేటయే యనవచ్చును. అంతేకాదు పంతులు గారి మేలుకొలుపు పాంచజన్యమువలె విన్పింపగా కాబోలు ఆ నాటి నుండియే నిరంకుశత్వమునకు వ్యతిరేకముగా సూర్యాపేట పౌరులు సంఘటితపడి ప్రభుత్వముతో తలపడ ప్రారంభించిరి. సూర్యాపేట సార్వజనిక జీవనము ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథ నిలయముతో ప్రారంభమై అనేక ముఖములుగా విజృంభించినది. 1925 సంవత్సరమున సూర్యాపేటయందు సభలు జరుప సంకల్పించగా ప్రభుత్వము వాటిని నిరోధించెను. అప్పుడు ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ప్రజలు న్యాయస్థానమున అభియోగముదెచ్చి గెల్చిరి. ఇది నల్లగొండజిల్లా

సభలను పేరుతో ఆంధ్రోద్యమచరిత్రలో పేరుపొందినది. 1927 లో ఆ సభలను తిరిగి ఇచట సమావేశపరచినాము. ఆంధ్రజన కేంద్ర సంఘ సమావేశము, నిజాంరాష్ట్ర ఆంధ్ర గ్రంథాలయ మహాసభ, యువజన మహాసభ, సంఘ సంస్కార మహాసభ, వర్తకమహాసభ, వైశ్యమహాసభ, స్థానిక గ్రంథాలయ భజనసమాజ, వర్తకసంఘ వార్షికోత్సవములు ఆనాడు జరిగినవి. నాటి స్వాగతోపన్యాసమును సభాచర్యలు పరిశీలించిన, ఆనాడే సూర్యాపేట యెంతటి విశాల ఆశయముల ముందిడుకొని నడచినదో తేటబడగలదు. అది మొదలుగా తెలంగాణా యందు బహుముఖములుగా జాగృతి విజృంభించినది. రైతుసంఘోద్యమము, అస్పృశ్యతా నివారణ, వితంతు వివాహ ఉద్యమములు ఇచ్చట తర్వాత బాగా వర్ధిల్లినవి. ఈ విధంగా తెలంగాణా నవయుగ చరిత్రలో సూర్యాపేట ఒక విశిష్టస్థానమును గడించుకొన్నది. ఈ నాటికిని సూర్యాపేటలో గ్రంథాలయము, వర్తకసంఘము, భజనసమాజము మొదలగు ఆనాటి సంస్థలు దినదినాభివృద్ధి నొందుచున్నవి. అంతేకాక తర్వాత వెలసిన ఆర్యసమాజము, వైదికాంధ్ర బాలికాపాఠశాల, చేనేత సహకార సంఘము మొదలయినవి ఎంతో ప్రజాసేవ చేయుచున్నవి. మహాసభజరుగు స్థలపరిచయమును ముగించుటకు ముందు ఈనాడు మనమధ్యలేని దివంగతులగు శ్రీ పువ్వాడ వెంకటప్పయ్య, కోదాటి రామకృష్ణారావు, లాభిశెట్టి లింగన్నగుప్త, కన్నెకంటి వీరయ్యాచారి, కోదాటి లక్ష్మీనరసింహారావు, కొమగిరి నర్సింహం, గవ్వా మురహరిరెడ్డిగార్లను ఒకమారు స్మరించుట ధర్మము. వారి అవిరళకృషియే సూర్యాపేటకు తద్వారా అఖిలాంధ్ర శ్రేయస్సుకు ఎంతో తోడ్పడినది.

ఆంధ్రోద్యమము రాజకీయోద్యమముగా పూర్తిగా రూపొందిన తర్వాతగూడ సూర్యాపేట అన్నిదశలలోను ప్రముఖపాత్ర వహించుచునేయున్నది. ఆంధ్రమహాసభ రెండుగా చీలగానే రెండును సూర్యాపేటలో స్థానమును గడించుకొన్నవి. అవి స్పష్టంగా కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీల రూపములు దాల్చగానే ఉభయసంస్థల పోరాట

ములును ఈ ప్రాంతమున ముందుకుసాగినవి. స్టేటుకాంగ్రెసు పతాకము క్రింద జరిగిన పోరాటములో నల్లగొండజిల్లా, ముఖ్యంగా సూర్యాపేట తాలూకాలోని ప్రజలు చేసిన బలిదానములపారమైనది. సత్యాగ్రహముచేసి జైళ్ళ కేగుటలోను ప్రజలను సాయుధముగా ఆత్మరక్షణకు ఆయత్త పరచుటలోను యువకులు చూపించిన సాహసము, పరాక్రమము ప్రశంసనీయములు. అఖిలభారత ప్రశస్తి నొందిన శ్రీ కీలుకాని వెంకటనారాయణగారివలె అభిమన్యు మరణమును పొందిన యువకులెందరో ఉన్నారు. వారందరు మనకు చిరస్మరణీయులు. అభ్యుదయ మార్గమును అవలంబించుటలో వలెనే క్షేమ విరుద్ధములగు పనులను త్రోసిపుచ్చుటలోను సూర్యాపేట ముందంజ వైచినది. ఈనాడు నల్లగొండజిల్లా అంతటిలో సూర్యాపేట తాలూకాయే శాంతియుద్యమమునకు ముందున్నదని చెప్పవచ్చును. ఇప్పటికే స్థలపురాణము అధికమైనదేమో.

ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ 25 వ సమావేశము ఇల్లెందులో జరుగుటతో ముడిబడిన ఆంధ్రుల ప్రేమానుబంధములు నానాటికి దృఢపడుచున్నవని అవి ఈనాటికి విశాలాంధ్ర సంపాదనా దీక్షకు త్రోవ చూపించగలిగినవని నా దృఢవిశ్వాసము. ఈ మహాసభ మనను చక్కని మార్గములో పురోగమింప జేయునని ఆశగలుగు చున్నది. భారతదేశము దాస్య విముక్తియగుట చూచినాము. హైదరాబాదు నిరంకుశ ప్రభుత్వమును కూలద్రోసి స్వతంత్ర ప్రజా స్వామ్య భారతదేశములో భాగస్వామియగుట చూచుచున్నాము. రెండు ప్రపంచమహాయుద్ధములను, బ్రహ్మాండమయిన విప్లవములను చూడగలిగినాము. ఇంతటి మహాపరివర్తనములనుచూడగలిగిన ఈకాలముననున్న మనము చెల్లాచెదురుగా బడియున్న ఆంధ్రులు ఏకమై భారతదేశ పురోగమనములో సెబాసనిపించుకొనులాగున భాగస్వాములగు చుండగా అనతికాలములో చూడగలుగుదుమని ఆశించుట భ్రమకానేరదు.

ఇక్కడ ఉపనివిష్టులయిన మీరందరును ఆరితేరిన అనుభవజ్ఞులు. మన సభాపతి గొప్ప విజ్ఞానవేత్త. వారి నాయకత్వమున మన ఈ సభలు జయప్రదముగా జరిగి ఉద్యమమునకు ఉత్తమ పథకములు నిర్ణయించుననుటలో సందేహము లేదు. మా తెలంగాణా సోదరసేవకులు, ముఖ్యంగా కల్లోలిత ప్రాంతములయిన వరంగల్లు, నల్లగొండ జిల్లాలలోని యువక కార్యకర్తలు, ఇచట నిర్ణయించు మార్గములననుసరించి ప్రజల అజ్ఞానాంధకారమును దూరముజేసి ప్రస్తుతము జరుగు అరాచక శక్తుల ఘోరహింసాకాండకు ప్రజలను విముఖులనుగాజేసి శాంతి నెలకొల్ప గలుగుదురని ఆశించుచున్నాను. అవకాశములును అనుభవమును తక్కువగానుండుటచే మా వలనగలుగు అనేక అసౌకర్యములను, మా లోటుపాట్లను మీరందరు వాత్సల్యముతో మన్నించవలసినదిగా ప్రార్థించుచు ఆహ్వాన సంఘపక్షమున మీ యందరికి మరొకసారి ప్రేమపూరితమయిన స్వాగత మిచ్చుచున్నాను.

# ప్రారంభోపన్యాసము

## శ్రీ ఫజల్ రహమాన్, ఎం. ఏ., ఎల్. ఎల్. బి.

(హైదరాబాదు విద్యాశాఖ డైరెక్టరు)

నల్లగొండ జిల్లాలో సూర్యాపేట పెద్ద పట్టణమేగాక ప్రాచీనకాలమునుండీ ప్రాధాన్యత వహించిన స్థలము. నల్లగొండ జిల్లా ప్రాచీన శిల్పసౌందర్యానికునికిపట్టు. పానగల్లు, పిల్లలమర్రి, సూర్యాపేటకు చాల దగ్గరగానున్న నాగలాపహాడ్ దీనికి నిదర్శనములు. సూర్యాపేటలో ఒకానొక ఫ్రెంచిసేనాని స్మారక చిహ్నముగలదు. ఓరుగల్లు రాజాస్థానమున ప్రసిద్ధికెక్కిన ఒకానొక కవి జన్మస్థలము సూర్యాపేట తాలూకాలోనున్నది. ప్రాచ్యవస్తు పరిశోధనాశాఖవారి పరిశోధనల ఫలితంగా యిటీవల బయలుపడ్డ శిలాలు, నాణెములు ఈ పరిసరములకు చెందినవి. ఇన్ని విధాల ప్రాముఖ్యముగల సూర్యాపేటలో ఈ మహాసభ జరుగుట ఆదర్శప్రాయముగ నున్నది.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము 1914 లో ప్రారంభమైనది. ఇది భారత గ్రంథాలయ సంఘమున కనుబంధముగా నున్నది. మొదటినుండీ విస్తృతమైనట్టియు, తీవ్రమైనట్టియు ప్రచారంద్వారా ఈ సంఘము గ్రామ సీమలలో గ్రంథాలయోద్యమ వ్యాప్తికి చాల తోడుపడినది. దీనిద్వారా తెలుగు ప్రాంతాలలో ఊరూర గ్రంథాలయాలు బయలు దేరినవి. ఈ కార్యక్రమ విజయానికి యీ సంఘం ప్రచురిస్తూ వచ్చిన గ్రంథాలయ సర్వస్వము కూడ తోడుపడినది. 1934 వ సంవత్సరంనుండి ఈ సంఘ కార్యక్రమం క్రమపద్ధతులపై నడచినది. గ్రంథాలయ సేవకుల శిక్షణకు యేర్పాటు లప్పటినుండి ప్రారంభమైనవి. 1940 నుండి వయోజన విద్యావ్యాప్తి సంఘ కార్యక్రమములో ప్రధాన స్థానమాక్రమించినది. ఇప్పుడే కార్యక్రమానికి దేశవ్యాప్తమైన ప్రాముఖ్యము వచ్చినది. ఈ సంఘము, ఈ కార్యక్రమం దక్షిణ భారతంలో వ్యాప్తం కావడానికి కారణభూతమైనవి. ఈ సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావు గారు దక్షిణ భారత వయోజన విద్యా సంఘాని కధ్యక్షులుగా వున్నారు. వయోజన బోధకుల శిక్షణ తరగతుల నిర్వహణము, పత్రికా ప్రచురణము, వయోజన విద్యా వ్యాప్తికి పాఠ్య పుస్తకాలు, మహాసభల యేర్పాటు ఈ సంఘ కార్యక్రమములోని ముఖ్యాంశములు.

శ్రీయుతులు హరిసర్వోత్తమరావు, ప్రొఫెసర్ పి. రామమూర్తి, రివరెండ్. యం. జె. ప్రకాశం, శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగార్లవంటి ఉత్సాహపరులగు విద్యావేత్తలు నిర్వహించనున్న ఈ మహాసభ ఆశయాలను గూర్చి వివరింప పనిలేదు. ఈ మహాసభ సత్ఫలితముల నివ్వగలుగు వనడంలో నా కేమియు సందేహము లేదు.

ఈ మహాసభ వయోజన విద్యకు హెచ్చు ప్రాధాన్యత నిచ్చుట సమంజసముగ నున్నది. త్వరలో అమలునకు రానున్న వయోజన వోటింగు యొక్క సక్రమ వినియోగానికి వయోజనవిద్య అత్యంతావశ్యక మైనది. ఇండియా ప్రభుత్వమువారు నేడు సాంఘిక విద్యకు మొదటి స్థానాన్ని యిచ్చినారు. మన హైదరాబాదు రాజ్యంలో కూడ దీని ప్రాముఖ్యత గమనింపబడినది. సాంఘిక విద్య విషయమై తీవ్రమైన ప్రచారం దేశమంతటా ప్రారంభమైనది. ప్రజలు విద్యావంతులు గాకుండా ఆర్థికంగాగాని, రాజకీయంగాగాని ప్రజారాజ్యం సాగడం సాధ్యంకాదు. ఇండియాలోని నిరక్షరాస్యులైన కోట్లకొలది ప్రజలు విద్యావంతులు కావడానికి సాంఘిక విద్యావిధానమే మార్గము.

మైసూరులో ఇటీవల యేర్పాటు చేయబడిన వయోజన విద్యాగోష్ఠి (Seminar) లో ప్రపంచంలోని వివిధదేశాల విద్యావేత్తలు సమావేశమై అంతర్జాతీయ జీవనము సంస్కృతులకు సంబంధించి అనితరమైనట్టియు, ఉపయుక్తమైనట్టియు అనుభూతిని పొందినారు. వీరి చర్చలలో నిరక్షరాస్యతా నిర్మూలన విషయానికి హెచ్చు ప్రాధాన్యమీయబడినది. అయినను వట్టి అక్షరాస్యతతో పనిపూర్తి కాదని ఈ గోష్ఠివా రంగీకరించినారు. గ్రామసీమలలో ప్రజానీకంయొక్క ఆరోగ్య, ఆర్థిక, సాంఘికాభివృద్ధులకు కావలసిన ప్రణాళికలు, తదితర సమస్యల విచారణ జరుగవలసియున్నదని వారు నిర్ణయించినారు.

నేనిప్పుడు చెప్పబోవు విషయాన్ని మీరంతా అంగీకరిస్తారని తలుస్తాను. వయోజన విద్యాప్రణాళికలో గ్రంథాలయాలు తప్పనిసరిగా యేర్పడాలి. అయితే గ్రంథాలయాలు కేవలం పుస్తకాలరాసులుగాగాని, పుస్తకాలను పంచే యేజన్సీలుగాగాని వుంటే ప్రయోజనంలేదు. ఏవోకొన్ని మంచి పుస్తకాలను అడిగే వారికి వాని నందించడంతో గ్రంథాలయాల పని తీరినట్లెంచరాదు. గ్రంథభాండాగారి పుస్తకాలను జాగ్రత్త చేయడంతో తనపని ముగిసినట్లు భావించరాదు. సరియైన పుస్తకం సరియైన చదువరి చేతిలో వుండేటట్లు అతడు చూడాలి.

ముఖ్య విషయాలను గూర్చి మీకు నేను సంగ్రహంగా తెలిపినాను. ఇచ్చట జరుగనున్న వివిధశాఖా సమావేశములలో యీ విషయాలకు సంబంధించి సమగ్రమైన చర్చలు సాగగలవు.

ఈ విషయంలో మీకు దారిచూపగల ప్రముఖ విద్యావేత్తలు మీతోనున్నారు. కనుక యీ మహాసభ ఫలవంతముగ ముగియగలదని నా విశ్వాసము.

మరల నొకసారి మీరు నాకిచ్చిన హృదయపూర్వక స్వాగతమునకు నా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాను. మహాసభ ప్రారంభమైనట్లు నేను ప్రకటించుచున్నాను.

# అధ్యక్షోపన్యాసము

శ్రీ ప్రతాపగిరి రామమూర్తి, ఎం. ఏ.

ఆహ్వాన సంఘాధ్యక్షా,

సోదరప్రతినిధులారా, సోదర సోదరీమణులారా!

గ్రంథాలయోద్యమము మనదేశములో ఇంకను శైశవదశలోనే ఉన్నది. దీనికి ప్రతిబంధకములు చాలగలవు.

ఈ ప్రతిబంధకములలో ఎక్కువ ముఖ్యమైనది ఆర్థికలోపము. సంఘ నిర్మాణమునకు గ్రంథాలయోద్యమము అతిముఖ్యమైన సాధనమే. అయినప్పటికి దానికి తగిన ఉపాధి లభించుటలేదు. అందుచేత ప్రజల ఉత్సాహమును ఇనుమడింపజేసి వారి తోడ్పాటును మనము పూర్తిగా పొందవలసియున్నది. జీవిత సౌకర్యవ్యవస్థలో గ్రంథాలయములు ఒక అపరిహార్యమైన స్థానమును ఆక్రమించునట్లు చేయవలసియున్నది. అట్లు చేసినయెడల ప్రజలసహాయము నిస్సందేహముగా లభ్యముకాగలదని నానమ్మకము.

గ్రంథాలయోద్యమమునకు ప్రజల నిరక్షరాస్యత యెక్కువ తీవ్రమైన ప్రతిబంధకము. ప్రజలు విద్యా విహీనులై ఉన్నంత కాలము వారి సహాయము అపేక్షించుట వలన ప్రయోజనములేదు.

గ్రంథాలయములు వైజ్ఞానికాభివృద్ధికి అతి ముఖ్యమైన ప్రాథమిక సాధనములు; సంస్కృతి ప్రసారమునకు కేంద్రములు; విజ్ఞాన, వికాసాభివృద్ధికి గీటురాళ్ళ వంటివి.

పూర్వ కాలములో గ్రంథాలయమనగా గ్రంథరచన సాగించే స్థలమన్న అభిప్రాయముండెను. అప్పుడు గ్రంథాలయము పేరుకు తగినట్లుగా గ్రంథములు నిలువజేసే ఆలయమన్న అర్థమే స్ఫురించుచుండెను. ఆ పిమ్మట గ్రంథాలయమనగా చదువరులు తమ ఉపయోగము కొరకు కోరినప్పుడు వారికి కావలసిన గ్రంథమును అందజేయు సంస్థగా పరిణమించినది. ఆ పిమ్మట ఆధునిక నాగరికతతోపాటు గ్రంథాలయ భావము కూడ వడివడిగ మారుతూ వచ్చినది.

కొంతకాలము విద్యార్థులకు మాత్రమే కావలసిన పుస్తకముల నిలయముగా గ్రంథాలయము పరిగణింపబడెను. ఇప్పుడు, పండితులకేకాక జనసామాన్యమునకు అంతటికి ముఖ్యమైన సంస్థగా గ్రంథాలయమును నెలకొల్ప వలెనన్న ఆశయము ప్రబలమైనది. సాంఘికాభివృద్ధికి ప్రాణము వంటిదిగా నుండగల సంస్థగా గ్రంథాలయము ప్రాముఖ్యమును వహించినది. పూర్వకాల మందు ప్రబలియుండిన ఒక దురభిప్రాయము మాత్రము మనల నింకను విడువకున్నది. ప్రాచీన కాలమునుండి నేటి వరకు మానవుడు ఆర్జించిన విజ్ఞానకోశము మాత్రముగనే మనము యింకను గ్రంథాలయములను చూచుకొనుచున్నాము.

గ్రంథాలయమనగా చదువరులకు గ్రంథములను అందజేయు ఒక నిలయము అని మాత్రము భావించుచున్నాము. అయితే యీ అభిప్రాయముతో పాటు నవీనాభిప్రాయములు కూడా పుట్టి గ్రంథాలయము యెడల మనకుగల దృష్టిని మార్చకపోలేదు. సాంఘికాభివృద్ధికి తగిన సాధనముగా గ్రంథాలయమును నెలకొల్పి ఉపయోగించు కొనవలెనన్న ఆశయము ఇప్పుడిప్పుడు యెక్కువగా ప్రబలుచున్నది.

జనసామాన్యములో చదువుకొన వలెనన్న ఆశయము, ఉత్సాహము కలిగించి వృద్ధిచేసే వైజ్ఞానిక సాధనముగా ఉపయోగించుట గ్రంథాలయమునకు ముఖ్యలక్షణమని నా అభిప్రాయము.

దేశములో బహు సంఖ్యాకులకు విజ్ఞానము అలవడజేయుటకు గ్రంథాలయము ప్రాథమిక సోపానము. నేటి ప్రజలలో అక్షరాస్యులకు ఈ గ్రంథాలయమే వారి వైజ్ఞానిక జీవితమునకు మొదటి సాధనము. దీని సహాయముతో వారు విద్యను అలవడచేసుకొన వలసియున్నది.

మానవుడు విద్య నేర్చుకొనుటలో యితరుల వద్దనుండి నేర్చుకొనిన విద్యకంటె తనంత తాను స్వయముగ కృషిచేసి అలవరచుకొనిన విద్యయే ఎక్కువ మేలైనదని విజ్ఞుల అభిప్రాయము. ఈఅభిప్రాయము వాస్తవమైనదే. ఎందుచేతననగా బడిలో ఉపాధ్యాయుడు తన ఆధిక్యమును కనబరచి శిష్యులపై తన ప్రాభవమును చూపించును. గ్రంథాలయములలో శిష్యుడే ప్రాముఖ్యము వహించి తన అధికారమునకే తాను లోబడి యుండును. తనకు తానె గురువు. గురువుగా విద్యను అందజేసి కొనుచుండును. విద్యా శిక్షణ విధానము తనకు తానె విధించుకొని విజ్ఞాన వంతుడగును.

నిరక్షరాస్యులైన వయోజనులకు వైజ్ఞానిక సాధనముగ గ్రంథాలయము ఉపచరించును. అంతేకాక వయోజనులందరకు గ్రంథాలయము విశ్వ విద్యాలయము వంటిది. ఈ మహా విద్యాలయములో ప్రవేశించుటకు అందరకును అవకాశము కలదు.

గ్రంథాలయము యిట్టిది కనుక వయోజన విద్యకు ఇది అపరిహార్యమైనసాధకము. అందుచేత గ్రంథాలయము అనుకూలమైన నిలయముగా నిర్మింపబడు కావలెను. అంతేకాక ఇది యొక సంస్థగా పరిణమించి సర్వాంగ సంపన్నముగా పీర్పడవలెను. అందుకు కావలసిన పరివారము పూర్తిగా నుండవలెను. ఇంతకు పూర్వము గ్రంథాలయమునకు ఎవ్వరైనను అధ్యక్షులుగా నుండవచ్చునని, కొలదిపాటి విద్యగల వారిని సైతము నియమించుచుండిరి. ఆ పదవిలో నుండుటకు తగిన శిక్షణము ఉండవలెనన్న తలంపైనను లేకుండెను. కాని పైన చెప్పినట్లు గ్రంథాలయము సంస్కృతి ప్రసారమునకు కేంద్రముగానుండవలెనన్న యెడల, జనసామాన్యమునకు గ్రంథాలయము ఉపచరించునట్లు గ్రంథాలయాధ్యక్షుడు మార్గదర్శిగా సహాయపడవలయునన్న యెడల ఆ పదవిని నున్న వాడు తన సంఘమును, సంఘములోని వారి చిత్త ప్రవృత్తులను, వైజ్ఞానిక దశలను గుర్తించి వారికి తోడ్పడగల సమర్థుడై యుండక తప్పదు. అతనికి తన గ్రంథాలయము

నను వచ్చు జనుల సాంఘిక, వైజ్ఞానిక, రాజకీయాది పరిజ్ఞానము లెస్సగా తెలుసు కొన్నవాడు కావలెను. అంతేకాక పౌరధర్మము నెరిగి గ్రంథాలయ మందలి ఏతరగతి గ్రంథములు ఏ జనులకు ఉపచరించునో తెలుసుకొన గలిగిన విజ్ఞానము గలవాడై యుండవలెను.

గ్రంథాలయము కేవలము గ్రంథములను సేకరించిన నిలయము మాత్రము కాదనియు, కేవలము విశ్రాంతికి ఆశ్రయము కలిగించెడు స్థలము మాత్రమే కాదనియు గుర్తించవలసియున్నది. వైజ్ఞానిక మండలమందు కేంద్రస్థలముగ అది సూర్యునివలె వైజ్ఞానిక కిరణములను ప్రసరింపజేసి దానిచుట్టునుగల పామరలోకమందు అజ్ఞానాంధకారమును పూర్తిగ తొలగించునట్లు ఏర్పడవలసియున్నది. మానవజీవిత మందు గ్రంథాలయము ఉద్దీపింపజేయు శక్తిగ పరిణమించవలెను.

ఈ ఆశయములు ఫలించుటకు గ్రంథాలయ కార్యకలాపము ఇప్పుడున్న దానికంటె అత్యధికముగా వ్యాప్తిచెందవలసియున్నది. గ్రంథాలయములో చదువరుల వైజ్ఞానిక శ్రేణులను ఏర్పరచి ఒక విధానమును అనుసరించి గ్రంథపఠనము కావించ వలసియున్నది. ఒకేవిషయమును గూర్చి గ్రంథములు చదివినవారిని సమావేశపరచి చర్చలు జరిపించుటవలన ప్రయోజన మెక్కువగా నుండును. అవినీతి బోధకములును, సంఘవిధాన విచ్ఛేదకములును కాగల గ్రంథములనుకాక, సద్గ్రంథములను చదువు కొనుటకు తగిన పరికరములను గ్రంథాలయములు యేర్పరచవలెను. అన్నిటికన్నను మిక్కిలి ముఖ్యమైన విషయ మేమనగా గ్రంథాలయమందలి పుస్తకములు కేవలము విద్యాధికుల కుపకరించునవేకాక సామాన్య జనుల బుద్ధివికాసమున కుపకరించు గ్రంథములు కూడ ఉండవలెను.

ప్రస్తుత పరిస్థితులలో ప్రతి గ్రామమునకు ఒక్కొక్క గ్రంథాలయము నెల కొల్పుట సాధ్యము కాకపోవచ్చును. కనుక కొన్ని గ్రామములకు కేంద్రస్థల ముగా నున్న పెద్ద గ్రామములో గ్రంథాలయమును నెలకొల్పి అందలి గ్రంథములు చుట్టుముట్టు గ్రామములవారి కందజేయుటకు తగిన విధానము ఏర్పరచవలెను. ఈ కోర్కె నెరవేరుటకు సంచార గ్రంథాలయోద్యమము తగిన సాధనము కాగలదు. ఇది గ్రామములందు అత్యావశ్యకముగా జరుగవలసిన మొదటి కార్యము. ప్రతి జిల్లాలోను, ఒక్కొక్క ఫిర్కాకు ఒక్కొక్క సంచార గ్రంథాలయము నెలకొల్పి ప్రతి దినము పరి సరములందు గల గ్రామముల వారికి గ్రంథముల నందజేయుచుండ వలెను. అంతేకాక కేంద్రగ్రంథాలయములో నున్న గ్రంథము లందు ఏబదేసి గ్రంథములు చొప్పున ప్రతి గ్రామమునకు పంచిపెట్టి అవి గ్రామస్థులు చదివినపిదప వాటిని తీసికొని మరి యేబదేసి చొప్పున గ్రామములకు అందజేయు చుండవలెను. ప్రతి గ్రామ మందును ఒక్కొక్క గ్రంథాలయ శాఖ యేర్పడి అందొక సమర్థుడైన అధ్యక్షుడు నియమితుడై ఆగ్రామస్థులు ఆ యేబది పుస్తకములను తగినరీతిని ఉపయోగించునట్లు చేయుచుండవలెను.

చిత్తూరు జిల్లా కుప్పంగ్రామములో ఒక సంచార గ్రంథాలయము, తెనాలి తాలూకా పెదపాలెంలో 1935 లో ఒక బోటు గ్రంథాలయము నెలకొల్పబడినవని తెలుసుకొని సంతసించితిని. ఇది వాస్తవముగా ప్రస్తుత పరిస్థితులలో కాదగిన నూతన ఉద్యమము.

గ్రంథాలయోద్యమము సార్థకమగుటకు మరియొక ఉపాయము కూడకలదు. గ్రంథములను పంపి పుచ్చుకొనే విధానము యింగ్లండులో 200 సంవత్సరములయి యున్నది. అది లాభసాటి విధానముగాకూడ యేర్పడినది. ఈ విధానమును అవలంబించిన గ్రంథాలయములకు సభ్యులు కాగోరు వారు మాసమునకు కొంత చందా చెల్లించుచుందురు. వారు ఎంత దూరస్థలమందున్నను వారికి వారు కోరే పుస్తకములను పంపుదురు. తపాలాఖర్చులు మాత్రము గ్రంథములు పుచ్చుకొనేవారు భరించెదరు. ఇట్లు స్వల్పమైన తపాలా ఖర్చులతో ఎంతవిలువగల గ్రంథమైనను సభ్యులు తెప్పించుకొని తిరిగి పంపవచ్చును. ఇట్టి విధానమును మనదేశములో విరివిగా వ్యాప్తిలోనికి తీసుకొని రావలసియున్నది. ఈ పైరెండువిధానములకంటెను ఎక్కువమేర వ్యాపింపగల ఉపాయముమరియొకటికలదు. దేశమందంతటికిని పెద్దగ్రంథాలయము నొకటి నెలకొల్పి దానికి అనుబంధముగా ఆయాస్థలములలో తగినట్లు ప్రతినగరమందును ఒక చిన్నగ్రంథాలయము ప్రతిపల్లెయందును అంతకంటె ఒకచిన్నగ్రంథాలయము చొప్పున దేశమందంతటను ఒకే సంస్థకుచెందిన విధానమేర్పరచి గ్రంథాలయోద్యమము వ్యాపింపజేయవలెను. దేశమందలి నగరగ్రంథాలయములను పురపాలక సంస్థల వారున్ను, పల్లెలగ్రంథాలయములను స్థానిక పరిపాలనా సంస్థలవారున్ను, కేంద్ర గ్రంథాలయమును ప్రభుత్వమువారున్ను నెలకొల్పి పోషించవలెను. అన్ని గ్రంథాలయములున్ను వితరణ విధానమును పూర్తిగ అవలంబించవలెను. అప్పుడే దేశమందంతటను గ్రంథాలయోద్యమము సర్వాంగసంపన్నమైన సంస్థగా పరిణమించగలదు.

ఇంతేకాక మరియొక పని కూడ కావలసియున్నది. సంవత్సరమున కొకసారి సకల గ్రంథాలయ సభ్య మహాసమావేశము జరుగవలెను. ఆ సమావేశములో ఏయే గ్రంథములు నూతనముగా ప్రకటితములైనవో, ఏయే గ్రంథములు గ్రంథాలయములకు చేర్చవలెనో ఏయే గ్రంథములకు యెన్నెన్ని ప్రతులు అవసరమో చర్చించి, గ్రంథాలయముల నభివృద్ధి చేయుచుండవలెను. కొన్ని గ్రంథములు ఎంతో విలువగల విషయములు, ప్రశస్తి గలవే ఐనను వాటికి తగినంత ప్రకటన ప్రచారములు లేక పోవుటచే వాటి విషయము యితరులకు తెలియక పోవచ్చును. అట్టి గ్రంథములకు తగిన ప్రచారము కలుగుటకు ఈ మహాసమావేశములు చక్కగా ఉపకరించ గలవు.

గ్రంథాలయములు ఆకర్షనీయముగా ఉండుటకు ఒక ఉపాయము గలదు. గ్రంథాలయములున్నచోట్ల పురావస్తు, చిత్రవస్తు ప్రదర్శన ఆలయములుకూడ ఉండవలెను. అట్లున్న యెడల రెండు ప్రయోజనములు సిద్ధించును. ఆయాస్థలములందలి

చిత్రకారులకు తగినంత ప్రోత్సాహము కలుగును. వారు తమ చిత్రములను ఆయా చిత్ర వస్తు ప్రదర్శనాలయములలో ప్రదర్శించుకొనుటకు యత్నించి సహజముగా తమకు గల కళాభిజ్ఞతను వృద్ధిచేసుకొన గలుగుదురు. అంతేకాక ఆయా ప్రదర్శనాలయము లందు అక్కడి చిత్ర విచిత్ర వస్తువులను సేకరించి ప్రదర్శించుటకు గూడ అక్కడివారు ప్రయత్నింతురు. ఇట్టి ప్రదర్శనాలయములు జన సామాన్యమునకు ఎక్కువ ఆకర్షణీయకముగా నుండగలవు. ఇవి విజ్ఞాన వ్యాప్తికి సాధనములు. వస్తువులను చూచి ఆనందించుటతో పాటు వాటినిగూర్చి గ్రంథములు చదివి తెలుసుకొనవలెనను ఉత్సాహముకూడ జనించి జనులు గ్రంథాలయములను తమ విజ్ఞానాభివృద్ధికి ఎక్కువగా ఉపయోగించుకోగలరు.

మరియొకవిషయము. పిల్లలకు తగిన గ్రంథాలయములనుకూడ నెలకొల్పవలెనని ప్రార్థించుచున్నాను. ఇంతకాలమున్నను గ్రంథాలయములు వయోజనుల కొరకే అను అభిప్రాయముతో నెలకొల్పబడినవి. ఇప్పుడిప్పుడు క్రొత్తగా బాలబాలికలకు కూడ ఉపచరించు గ్రంథాలయములు నెలకొల్పవలెనను సంకల్పము జనించినది. బాల విద్యాశిక్షణము వయోజన విద్యాశిక్షణమునకు భిన్నమయినది. బాలబాలికలను ఆకర్షించగల గ్రంథముల తీరువేరు. బొమ్మలతోను, వినోదప్రకటనలతోను గ్రంథములు ఆకర్షణీయముగానుండి క్రమక్రమముగా విజ్ఞానమందజేయవలయును. ఈ బాలగ్రంథాలయములను అనుబంధముగా చిత్రవస్తు ప్రదర్శనములు, కొయ్యబొమ్మల ప్రదర్శనములు, తోలుబొమ్మల ప్రదర్శనములు, సినీమా ప్రదర్శనము లుండవలెను. వీటిని చూచి ఆనందించు పిల్లలకు వీటిని గూర్చి ఇంకను తెలుసుకోవలెనను ఆసక్తి పుట్టించి గ్రంథములందు అభిరుచి ఎక్కువచేసి వాటిని ఉపయోగించు విధానము అలవర్చవలెను. అందుకు తగిన శిక్షణ కూడ అటువంటి విధాన మేర్పరచి అందజేయవలెను.

ఈ విధముగా పరిణమించవలసిన ఉద్యమమునకు ధనము అధికముగా కావలసియున్నదని నేను గుర్తించలేకపోలేదు. కాని ప్రజలు, ప్రభుత్వమువారు దీనిని గుర్తించి పూనుకొన్న యెడల ధనము సేకరించుట ఒక గొప్ప కష్టముకాదు. ఇంగ్లండులో గ్రంథాలయోద్యమమునకు సంవత్సరమునకు 20 లక్షల పౌనులు అనగా సుమారు 8 కోట్ల రూపాయలు వెచ్చించుచున్నారు. ఇదిగాక విశ్వవిద్యాలయములు, కళాశాలలు బడులు, ప్రజల గ్రంథాలయములు ఎంతో ధనము ఖర్చుపెట్టుచున్నవి. ఇంగ్లండు, అమెరికా మొదలయిన దేశములందు గ్రంథాలయోద్యమము సంస్థావ్యవస్థగలది. అచ్చట ప్రభుత్వచట్టములు గ్రంథాలయోద్యమముగూర్చి యేర్పడియున్నవి. గ్రంథాలయముల తనిఖీ సక్రమముగాజరుగుచున్నది. గ్రంథాలయములకు ప్రభుత్వవిరాళములున్నవి. గ్రంథాలయ సంస్థ అంతా విద్యాశాఖామంత్రి సమీక్షణకులోబడి సాగుచున్నది. ప్రభుత్వమువారు దేశమందంతటను గ్రంథాలయములను, సకలవస్తు ప్రదర్శనాలయములు, చిత్రకళాప్రదర్శనములను నెలకొల్పుచున్నారు. ఇందుకు కావలసినధనము పన్నులమూలమున సేకరించుచున్నారు. మన భారతదేశమున మదరాసు రాష్ట్రములో ఇట్టి చట్టము 1-4-50 నుండి అమలు లోనికి వచ్చియున్నది.

చాలకాలము క్రిందటనే జరుగవలసిన కార్యము ఇప్పటికైనను చెన్నప్రభుత్వము వారు నెరవేర్చినందుకు సంతోషించవలెను. కాని యింతటితో తృప్తి పొంది ఊరుకొనరాదు. ఇప్పుడు జరిగినపనివలన గ్రంథాలయసంస్థకు ప్రతిమాకారముమాత్రము ఏర్పడినది. సర్వాంగ సంపన్నమైన ఒక గ్రంథాలయ సంస్థ రాష్ట్రమందేర్పడవలెనన్న మహా విషయము ఇంతకాలమునకైనను ప్రభుత్వము గుర్తించినది.

మనము అసలు విషయము కంటె పైమెరుగులకు హెచ్చు ప్రాధాన్యమునిచ్చుచుందుము. గ్రంథాలయములను స్థాపించుటలో భవనముల కొరకు హెచ్చు ధనమును వినియోగించి దీని అనుదిన కార్యక్రమమునకు డబ్బులేక బాధపడుదుము. భవన నిర్మాణ సందర్భమున చూపు శ్రద్ధలో సగమైనా గ్రంథాలయ నిర్వహణములో మన కుండుటలేదు. ప్రజానీకమునకై నెలకొల్పిన గ్రంథాలయములు నేనిదివరకు చెప్పినట్లు సరస్వతీ నిలయములుగ ఎన్నవలెను. ఈ సరస్వతీ నిలయమునకు విద్యారాధన అనుదినము జరుగుచుండవలెను. ఇందలి గ్రంథములు పురుగులనోటపడి పాడుకాకుండ చదవరుల జ్ఞానాభివృద్ధికి ఉపచరించునట్లు చూడవలయును.

మన ప్రాచీనులు విద్యా ప్రచారము కావించుటకు అవలంబించిన విధానము మనకు మార్గదర్శకముగా పెట్టుకోవలెను. మన ప్రాచీన ఋషులు ఒక్కొక్కరు ఒక్కొక్క గ్రంథాలయముగా దేశమందు సంచరించి జనుల విద్యావ్యాప్తికి, విజ్ఞాన సంపత్తికి, ఆధ్యాత్మిక తత్త్వబోధకు తోడ్పడియుండిరి. వారి ఆశ్రమములు గురుకుల నివేశనములు, గ్రంథాలయములుగానే శోభిల్లినవి. మరి కొంతకాలమునకు బౌద్ధ విహారములు గ్రంథాలయములై యుండెను. బౌద్ధ యుగములో వేలకొలది గ్రంథములు గల గ్రంథాలయములు పెక్కు వెలసియుండెను. వాటికి రాజులు, ధనవంతులు అమితముగా ధన సహాయము చేసి యుండిరి. పాటలీపుత్రమందు ఒక గ్రంథాలయము వెలసినది. నలందాలో వెలసిన గ్రంథాలయము తొమ్మిది అంతస్థులుగల మహాలయమునందు వేలకొలది పుస్తకములతో నిండియుండెను; ప్రపంచమందలి పెక్కుతావులనుండి ఈనలందా విద్యాపీఠమునకు విద్యార్థులనేకులువచ్చి ఈ గ్రంథాలయమందలి గ్రంథముల ప్రతులను వ్రాసుకొని వెళ్ళుచుండిరి.

“ఐత్సింగ్” చెప్పినట్లు జంబూద్వీపమందు ఈ నలందా విద్యాపీఠము మహోన్నతమైన సరస్వతీ నిలయముగా ప్రకాశించుచుండెను.” ఓదంతపురము, విక్రమశిల మొదలైన స్థలములందు సైతము గొప్ప గ్రంథాలయములుగల విద్యాపీఠములు వెలసియుండెను.

ప్రాచీనకాలమందలి గ్రంథాలయములు, విద్యాపీఠములు ఎట్లు మహోన్నత దశయందుండెనో తెలుసుకొనుటకు ఇక్కడివారు దూరదేశములకు పోనక్కరలేదు. మీకు అత్యంతప్రియమైన ఈ తెలంగాణా మండలమునందే విశిష్టమైన విఖ్యాతిగల విద్యాపీఠము వెలసియుండెను. చాళుక్యరాజగు ‘రాయనారాయణరాజు’ కొలువులో సేనానాయకుడుగానుండిన మధుసూదనుడు వాడికి సమీపమునగల నాగయోనగరమున

కొన్ని సంస్థలను స్థాపించెను. అందులో ఒకటి ఘటికాశాల. ఇది భోజనవసతులుగల యొక ఉన్నత విద్యాలయము. దీని బోధకులలో ముగ్గురు వేదపండితులు, ముగ్గురు శాస్త్రవేత్తలు, ఆరుగురు సరస్వతీ భాండారికులు అనగా గ్రంథాలయ పఠనాధ్యాపకులుగా ఉండిరి. ఈ వృత్తాంతముగల 1058 వ సం. నాటి 60 స్తంభముల గుడికి చెందిన శాసనములో ఆ విద్యాలయమందున్న పండితుల వేతనములు దిగువవిధముగ లిఖింపబడియున్నది.

| | | |
|---|---|---|
| ప్రభాకర పండితులకు | 48 | వృత్తుల భూమి. |
| భట్టు దర్శన పండితులకు | 35 | ,, |
| న్యాయదర్శన పండితులకు | 20 | ,, |
| వేదాంగపండితులకు | 20 | ,, |
| సరస్వతీభాండారికులకు | 30 | ,, |

దీనినిబట్టి పైవిద్యాలయమున గ్రంథములతో కూడిన గొప్ప గ్రంథాలయముండి యుండుననియు, దాని భాండారికులు వేదాంగ, శాస్త్రపండితులతో సమమైన దర్జా, వేతనముల ననుభవించుచుండిరని, కనుక భాండారికులు గూడ మంచి పండితులై యుండురని మనమూహింపవచ్చును.

ఇటీవల దక్షిణ దేశమందు వికసించిన గ్రంథాలయోద్యమము గురించి కూడ కొన్ని నిదర్శనములు చారిత్రకమైనవని తెలియ జేయుచున్నాను. 'కుతుబ్‌సాహి' పరిపాలకులు పెక్కండ్రు విద్యాధికులు, విద్యా పోషకులు, పెద్ద గ్రంథాలయములను నెలకొల్పియుండిరి. అంతేకాక ఉరుదు, అరబి, పార్శి మొదలైన భాషలలో గ్రంథాలయమును సైతము మద్రసాలు, ఖంకాలు అను పేరుతో నెలకొల్పిరి. ఈ విషయములో తంజాపుర 'నాయక' రాజులు కావించిన ఘన కార్యము కూడ ప్రశంసనీయమైనది. పిమ్మట తంజాపురము నేలిన మహారాష్ట్రరాజుల కాలములో గ్రంథాలయము సర్వాంగ సంపన్నముగ వికసించినది. అందు వేలకొలది గ్రంథములు అనేక భాషలలో గలవు. ఈ విధముగ గ్రంథాలయమును పోషించి విద్యావ్యాప్తికి తోడుపడిన రాజపోషకులకు మన మెంతయు కృతజ్ఞులమై యుండవలెను.

ఇంతవరకు వివరించి పేర్కొనిన గ్రంథాలయములను బట్టి గ్రంథాలయోద్యమము మనదేశములో ప్రాచీన కాలమందే వెలసియుండెను. కాని నేడు క్రొత్తగా పుట్టిన ఉద్యమము కాదని మనము తెలుసుకొనుటకు అవకాశము కలదు. మన ప్రాచీనులవలంబించిన మార్గమునే అందును మన ఆంధ్రదేశమందు వెలసిన పద్ధతులనే మనము నేటికాలమునకు అనుకూలమగునట్లు అనుసరించి ఈ ఉద్యమమును నడుపవలసియున్నది. ప్రజా ప్రభుత్వము వెలసిన ఈ రోజులలో అనగా ప్రజలనుండే నాయకులు విరియవలసిన ఈ కాలమున ప్రజలలో విద్యవ్యాపించ వలసియున్నది. నాయకత్వము

వహించుటకు ప్రజలు విజ్ఞానవంతులై యుండవలెనుకదా! పౌరధర్మము, రాజనీతి, నాగరికత, సంస్కృతి లెస్సగా వ్యాపించవలెను.

ఒక విషయములో ప్రాచీన పరిస్థితులకును, ఆధునిక పరిస్థితులకును గొప్పతారతమ్యముకలదు. ప్రాచీనకాలములో మహాపురుషులు వారు స్థాపించిన సంస్థలను వెదకుకుంటూ యెక్కడెక్కడివారు వచ్చి ప్రయోజనమును పొందుచుండిరి. నేడట్లుగాక ప్రకటనముద్వారా నలుగురికీ రాబట్టుకొనవలసిన పరిస్థితి లోకంలో అమలు జరుగుతూ వుంది.

కనుక గ్రంథాలయోద్యమము కూడ ప్రకటనల మీదనే ఆధారపడవలసి యున్నది. కాబట్టి పల్లె పల్లెకుపోయి, ఇంటింట తిరిగి జనుల అభిరుచి గ్రంథాలయోద్యమము వైపుకు మరలునట్లు చేయుదము. పత్రికలవారిని, రేడియోవారిని మన ఉద్యమమున తోడ్పడ వలెనని ప్రార్థింతము. పుస్తకముల మహిమలు, గ్రంథకర్తల ఘనతలు, ప్రదర్శనములు, ప్రసంగముల ద్వారా ప్రకటింతము.

అన్నిటి కంటెను ఎక్కువ పరస్పర సహాయముతో సహకార విధానమేర్పరచి రాష్ట్రమంతటను వ్యాపింపగల గ్రంథాలయోద్యమమును నెలకొల్పవలసియున్నది. దాని కందరును తోడ్పడవలెను. ఎవరికివారుగా ఎంతగొప్పపని చేసినను తెగినహారము నుండి జారిపడిన ముత్యములవలె చెదరిపోవునేగాని సంస్థారూపమైన వ్యవస్థ యేర్పడదు. కనుక మనమందరము ఏకముఖమున ఈ ఉద్యమము సాగించి కృతార్థుల మగుదుముగాక! మన గ్రంథాలయోద్యమము విజయవంతమై ఈ భారతదేశమందలి ఇతర రాష్ట్రముల వారికి మార్గదర్శకమగునుగాక!

# తీర్మానములు

౧. 26 వ మహాసభ క్యాతూరులో జరిగిన తర్వాత ప్రపంచమంతటికి అత్యంత విషాదకరమైన మహాత్మాగాంధీ హత్యసంభవించినది. విశ్వానికంతటికి శాంతి ప్రవక్తయైన ఆయన మరణమువలన మానవ ప్రపంచం ప్రగతిమార్గంలో నడిపే మహానాయకుని పోగొట్టుకొని తీరని నష్టము పొందినది. అత్యంతక్లిష్టమైన యీ తరుణంలో ఆయనలేకపోవడం ప్రపంచానికి, ముఖ్యంగా భారతదేశానికి ఎంతో దౌర్భాగ్యం. ఆయన హత్య భారతజాతిలో యింకా అణగియున్న ఘోరహింసా ప్రవృత్తికి నిదర్శనము.

భారతజాతి మహాత్మాగాంధీ అహింసా సిద్ధాంతాన్ని అనుసరించి లోకకళ్యాణానికి పాటుబడటంవల్ల మాత్రమే ఆయనయెడ తమకుగల భక్తి అనురాగాలు వెల్లడించుకోగలుగుతుంది. ఈ మహోద్యమంలో గ్రంథాలయోద్యమ

సేవకులు తమ పాత్రను చక్కగా నిర్వహించగలరని యీ మహాసభ గాఢముగా విశ్వసిస్తున్నది.

౨. ఆంధ్రకవితారంగంలో నూతనయుగ నిర్మాతలైన కళాప్రపూర్ణ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు స్వర్గస్థులైనందుకు యీ మహాసభ తమ సంతాపాన్ని ప్రకటిస్తున్నది. ఆయన సేవవల్ల ఆంధ్ర వాఙ్మయానికి కలిగిన మహోపకారాన్ని స్మరిస్తూ ఆయనకు యీ మహాసభ తన శ్రద్ధాంజలిని సమర్పిస్తున్నది.

3. 26 వ. మహాసభ తర్వాత యీదిగువ ఆంధ్రసాహితీ సేవకులు దివంగతులైనందుకు యీ మహాసభ తన విచారాన్ని వెలిబుచ్చుచు, వారికి తమ శ్రంద్ధాంజలి సమర్పిస్తున్నది.

వేటుకూరి వెంకటనరసయ్యగారు
మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు
కొత్తపల్లి సుందరరామకవిగారు
చిదిరెమఠం వీరభద్రేశ్వరశర్మగారు
బొడ్డపాటి సీతాబాయమ్మగారు
డాక్టరు గవ్వా మురహరిరెడ్డిగారు

౪. 26 వ మహాసభ తర్వాత యీ దిగువ నుదహరించిన ప్రముఖులు దివగంతులైనందుకు యీ మహాసభ తన విచారాన్ని వెలిబుచ్చుచు వారిపట్ల శ్రద్ధాంజలి సమర్పిస్తున్నది.

శ్రీమతి సరోజినీదేవి
కొండా వెంకటప్పయ్య పంతులు
కే. యఫ్. నారిమన్, శరశ్చంద్రబోస్
డాక్టరు సచ్చిదానంద సిన్హా

౫. 26 వ మహాసభ క్యాతూరులో జరిగిన తరువాత ప్రపంచములో మహత్తరమైన పరివర్తన చాలా జరిగింది. సామ్రాజ్యవాద దేశాల గుప్పిటనుంచి భారత, బర్మా, సింహళ, ఇండొనేషియా మొదలైన దేశాలు బయటపడినవి. పీడిత ప్రజానీకం స్వేచ్ఛాస్వాతంత్ర్యములకై సాగిస్తున్న ఉద్యమాలు నానాటికి బలిష్ఠమై సఫలత నొందుచున్నవి. ఆసియాలో నవచైతన్యం సంఘటితపడి ప్రపంచ సమస్యల పరిష్కరించడంలో అగ్రస్థానం వహిస్తున్నది. అనేక తప్పటడుగులు వేస్తున్నప్పటికి ఐక్యరాజ్యసమితి ప్రపంచశాంతికి తమకు తోచిన విధంగా కృషిచేస్తున్నది.

ఈ విధంగా మంచికి కొంతకృషి జరుగుతున్నప్పటికి శోచనీయమైన సందర్భాలు కూడ జరుగకపోవడంలేదు. అహంకారము, హింసాప్రవృత్తి, దురాశ మానవజాతిలో యింకా తాండవమాడుచునే యున్నవి. మూడవ ప్రపంచ యుద్ధం తప్పదనే భయం ప్రపంచ ప్రజానీకాన్ని పీడిస్తున్నది. ప్రపంచశాం

జానికి ఉపయోగపడవలసిన విజ్ఞానం లోకాన్నే సర్వనాశనం చేయగల అటం, హైడ్రోజన్ బాంబుల నిమిత్తమై ఉపయోగపడుతూనే యున్నది.

ఈ మహావిపత్కర పరిస్థితులలోను, నిస్పృహావాతావరణంలోను, ఆశా రేఖలు లేకపోలేదు. గతానికన్న అనేకరెట్లు శాంతిప్రయత్నాలు జరుగుచునే యున్నవి. మహాత్మాగాంధీ అడుగుజాడలలో కృషిచేయడానికి పూనుకొన్న ప్రపంచశాంతి మహాసభ ప్రయత్నాలను యీ మహాసభ హర్షిస్తూ, అభినందిస్తున్నది. ఇటీవల మైసూరులో యునెస్కో సెమినార్ అన్ని వైజ్ఞానిక, సాంస్కృతిక ఉద్యమాలు ప్రపంచశాంతినే ఆదర్శంగా పెట్టుకొని కృషి చేయాలని చూపిన మార్గదర్శకత్వాన్ని అభినందిస్తున్నది.

స్వతంత్ర ప్రజాస్వామ్య భారత ప్రజలు ఉత్తమదేశ పౌరులనిపించుకొనుటకును ప్రజా స్వామ్యాన్ని దేశములో సుస్థాపితంచేసి పురోగమించడానికి భారత పౌరులపైన అనేక గురుతర బాధ్యతలున్నవి. ఇంకా వెనుకబడియున్న ప్రజానీకం తమ పౌరసత్వ బాధ్యతలను, హక్కులను గుర్తించేటట్లు చేయడం ప్రతి చదువుకొన్న వ్యక్తి విధి. అందుకై వయోజనవిద్య, గ్రంథాలయోద్యమాలు అత్యంతావశ్యకాలు. ఈ ఉద్యమాల ప్రాముఖ్యతను గమనించి ఆంధ్రదేశములోని పౌరులెల్లరు యీ ఉద్యమాలకు శక్తివంచనలేకుండా సహాయపడవలెనని యీ సభవారు కోరుతున్నారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తమ బాధ్యతలను గమనించి యీ ఉద్యమాలకు కొంతలో కొంత ప్రోత్సహించటానికి సంతసిస్తూ యింకా విస్తారమైన సహాయం చేయడం అత్యవసరమని యీ సభ వారు హెచ్చరిస్తున్నారు.

హైదరాబాదు రాష్ట్రములో జరిగిన ప్రజాస్వాతంత్ర్యోద్యమంలో పూర్వపు నైజాము ప్రభుత్వ అధికారుల చేతను, రజాకార్లచేతను అనేక గ్రంథాలయాలు దగ్ధపరచడం, ఇతర విధాల నష్టపరచబడడం జరిగింది. ఇట్టి గ్రంథాలయాలన్ని పునరుద్ధరించబడడానికి ప్రభుత్వం ఉదారంగా సహాయం చేయాలని యీ మహాసభవారు కోరుచున్నారు. ఈ గ్రంథాలయాల స్థితిగతులను విచారించి ప్రభుత్వానికి నివేదించడానికి యీ దిగువ సభ్యులుగల ఉపసంఘాన్ని నియమిస్తూ వారి నివేదికను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి పంపవలసిందిగా కోరడమైనది.

౧. నాగులపల్లి కోదండరామారావుగారు
౨. కోదాటి నారాయణరావుగారు
3. పాతూరి నాగభూషణంగారు

హైదరాబాదు రాష్ట్రములో సార్వజనిక గ్రంథాలయాలకు ప్రభుత్వము చేస్తున్న సహాయం అత్యల్పంగా ఉన్నది. పరిసర రాష్ట్రాలలో జరుగుచున్న కృషిని, ప్రభుత్వాం చేస్తున్న తోడ్పాటును, హైదరాబాదు ప్రభుత్వం గమ

నించి విద్యాశాఖద్వారా యిచ్చుటి గ్రంథాలయాలకు విరివిగా సహాయము చేయించ వలెనని యీ మహాసభ హైదరాబాదు ప్రభుత్వమును కోరుచున్నది.

౯. హైదరాబాదు రాష్ట్రింలో ప్రజా సంస్థల రిజిస్ట్రేషన్ చట్టం ప్రకారం నిర్ణయించియున్న రుసుము రూ 50/- లు గ్రంథాలయాల రిజిస్ట్రేషన్ విషయంలో చాలా కష్టం కలిగిస్తున్నది. ఈ రుసుమును గ్రంథాలయాలు, వయోజనవిద్యా సంస్థల విషయములో రద్దుచేయ వలెనని యీ మహాసభ ప్రభుత్వమును కోరుచున్నది.

౧౦. మద్రాసు ప్రభుత్వం, ప్రజలు కలసి తెలుగు విజ్ఞాన సర్వస్వమునకై చేస్తున్న కృషిని యీ మహాసభ అభినందిస్తూ వీరికి అన్ని విధాలా సహాయపడవలసిందిగా ఉత్తమ రచయితలను, ప్రజలను, ముఖ్యంగా శ్రీమంతులను యీ మహాసభ కోరుచున్నది.

౧౧. హైదరాబాద్ స్టేటు లైబ్రరీలో దేశభాషలకు, ముఖ్యంగా తెలుగుకు అనాదరణ చూపబడుతున్నది. స్టేట్ లైబ్రరీలో తెలుగు గ్రంథాలను అధికంగాచేర్చాలనీ, ఒరంగల్లులో ఆంధ్ర ప్రాంతానికి ఒక ప్రత్యేక కేంద్ర గ్రంథాలయాన్ని నెలకొల్ప వలెననీ ఈ మహాసభవారు హైదరాబాదు ప్రభుత్వమును కోరుచున్నారు.

౧౨. గ్రంథాలయ శాస్త్రమునకు సంబంధించిన డిప్లొమా కోర్సును ఏర్పాటుచేసి ఈ సంవత్సరం కూడా శిక్షణ తరగతులను నడుపుతున్నందుకు ఆంధ్ర విశ్వకళాపరిషత్తును యీ మహాసభ ప్రశంసిస్తున్నది. ఈ తరగతులలో బోధన తెలుగులోనే యుండవలెననీ, తరగతులు ప్రతి సంవత్సరం నడపబడవలెననీ ఈ మహాసభ ఆంధ్ర విశ్వకళా పరిషత్తును కోరుచున్నది. ఉస్మానియా విశ్వకళాపరిషత్తు కూడ యీ కోర్సును ప్రాంతీయ భాషలలో యేర్పాటుచేసి ప్రతి సంవత్సరము నడుపవలెనని ఈ మహాసభ ఉస్మానియా విశ్వకళాపరిషత్తును కోరుచున్నది.

౧౩. సాధారణంగా ప్రతి గ్రామంలోనూ పాఠశాలల నిర్వహించు ఉపాధ్యాయుల ద్వారా గ్రంథాలయోద్యమ ప్రచారం చేయవచ్చును. అందుకై బోధనాభ్యసన పాఠశాలలలోను, కళాశాలలలోను, వయోజన విద్య గ్రంథాలయ, నిర్వహణ శాస్త్రములను కూడా చేర్పించి బోధించేయేర్పాటు చేయవలెనని వివిధ ప్రభుత్వ విద్యా శాఖలను, ముఖ్యంగా మద్రాసు హైదరాబాదు ప్రభుత్వాలను ఈమహాసభ కోరుతున్నది.

౧౪. భారత దేశంలో కళాశాల విద్యను కూడా ప్రజల మాతృభాషలలో నడుపవలెనని ఇదివరకే అనేక విశ్వకళా పరిషత్తులు అంగీకరించి అప్పుడే తమతమ ఆధీనములలో నున్న కళాశాలలో ప్రవేశపెట్టినవి. ఉస్మానియా విశ్వకళా పరిషత్తు ఈ విషయంలో పూర్వస్థ నిరాదరణనే యింకనూ చూపిస్తున్నది.

హైదరాబాద్ రాష్ట్రంలో అత్యధిక సంఖ్యాకులైన ఆంధ్రుల భాషపట్ల తగిన ఆదరణను చూపించగలందులకున్నూ, వెంటనే తెలుగు ద్వారా కళాశాలలలో బోధన యేర్పాటు చేయుటకున్నూ, ఉస్మానియా విశ్వకళా పరిషత్తును, హైదరాబాదు ప్రభుత్వాన్ని యీ మహాసభ కోరుతున్నది.

౧౫. సమిష్టి రేడియో కేంద్రముల స్థాపన, నిర్వహణ విషయంలో గ్రంథాలయములు, గ్రామసేవక సంఘములు, సహకార సంస్థలను కూడా పంచాయతీలు, బోర్డు పాఠశాలలవలెనే యెంచి నిర్వహణ ఖర్చుల క్రింద సాలీనా రూ॥100/-లు మాత్రమే తీసుకొని పేదదశలోనున్న ప్రజా సంస్థలకు సహాయపడవలసిందిగా మద్రాస్ రాష్ట్రీయ బ్రాడ్ కాస్టింగు శాఖ వారిని ఈ మహాసభ వారు కోరుతున్నారు.

౧౬. 'పాడిపంటలు' పత్రిక చందాల వసూలు విషయమై మద్రాస్ వ్యవసాయశాఖ వారు ప్రస్తుతం అవలంబిస్తున్న విధానం చందాదారులకు చాలా యిబ్బందిగా వుండడమేగాక అది పత్రిక ప్రచారమునకు గూడ దోహదముగా వుండడము లేదు. కనుక పత్రిక చందాలను స్వీకరించుట, సంచికల బట్వాడా వగైరా బాధ్యతలను వ్యవసాయ శాఖ డైరెక్టరుగాని, గవర్నమెంటు ప్రెస్ సూపరింటెండెంటుగాని నిర్వహించవలసినదిగ మదరాసు వ్యవసాయ శాఖామంత్రిగారిని యీ మహాసభవారు కోరుచున్నారు.

౧౭. ప్రభుత్వమువారి విరాళాల కొరకు గ్రంథాలయాలవారు తిరుగనవసరము లేకుండా మనియార్డరు ద్వారా సకాలములో వీటిని వారికి అందజేయుటకు ఏర్పాటు చేయవలసినదిగా మద్రాసు ప్రభుత్వము వారిని యీ సభవారు కోరుచున్నారు.

౧౮. ఆంధ్రదేశములోని వివిధ ప్రాంతాలలో పనిచేస్తున్న గ్రంథాలయాలు విధిగా స్త్రీ, బాల, వయోజన శాఖల నిర్వహించుటకు పూనుకొన వలసినదిగా యీ మహాసభవారు హెచ్చరించుచున్నారు.

౧౯ గ్రంథాలయ నిర్వహణములో భాండాగారికి గల ప్రాధాన్యతను గమనించి, సమర్థులైన వారిని యీ పనిలో నియమించి, వారికి తగిన వేతనాలను నిర్ణయించి నూతన పద్ధతులపై గ్రంథాలయములను నడుపవలసిన అవసరమును గుర్తించి, ఆచూకీ ప్రచారాది కార్యక్రమములను ఎమలు పరచు, గ్రంథాలయాలను పూర్ణంగా ఉపయోగించే సంస్థలుగా దిద్దవలసినదిగా యీ మహాసభవారు ఆంధ్రదేశంలోని గ్రంథాలయాలను కోరుచున్నారు.

౨౦.(అ) మదరాసు ప్రభుత్వంవారు 1948 సంవత్సరాంతంలో తయారు చేసిన మదరాసు పౌర గ్రంథాలయ చట్టం లోపభూయిష్ఠంగా వున్నా దీనిని 1950

5

ఏప్రిల్ 1 తేదీ నుండి అమలు చేయ [illegible]నిందుకు యీ మహాసభవారు తమ హర్షమును వెలిబుచ్చుచున్నారు.

(ఆ) ఈ చట్టంలోను, దీనిని అమలు జరపడానికి ప్రభుత్వంవారు తయారు చేసిన నియమావళిలోనూ, గ్రంథాలయాభివృద్ధికి ఆటంకములుగానున్న విషయాలను ప్రభుత్వానికి నివేదించి వీలైనంత త్వరలో సవరించునట్లు ప్రయత్నం చేయ వలసిందిగా ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం వారికి యీ మహాసభవారు కోరుచున్నారు.

౨౧. వయోజన విద్యావ్యాప్తికై వారమున కొకసర్యాయము మదరాసు, హైదరాబాదు, విజయవాడ కేంద్రములనుండి తెలుగులో రేడియో ప్రసంగములు చేయించు వసతులను కల్పించవలెనని ప్రభుత్వమువారి నీ మహాసభవారు కోరుచున్నారు.

౨౨. వయోజన విద్యాకేంద్రములను ప్రారంభించుటకు బోధకులు పంపిన దరఖాస్తులను అంగీకరించడములోనూ, రికగ్నిషను, గ్రాంటులు యిచ్చుటలోనూ, విపరీతమైన కాలయాపన జరుగుచున్నది. తత్ఫలితముగా బోధకులలో నిరుత్సాహము కలిగి కేంద్రములు సక్రమముగా నడచుటలేదు. కావున్ కేంద్రము ప్రారంభించిన మాసములోపల పర్మిషను, సాధ్యమైనంత త్వరలో రికగ్నిషను, గ్రాంటు యిప్పించుటకు జిల్లా విద్యాధికారులు తగు యేర్పాటులు చేయవలసినదిగా కోరడమైనది.

౨౩. మిల్లు యజమానులు, రైల్వే డిపార్టుమెంటువారు, పుగాకు వగైరా కంపెనీల యజమానులు తమవద్ద పనిచేయుచున్న కార్మికుల విద్యాభివృద్ధికి తప్పనిసరిగా కేంద్రములు నెలకొల్పి, తర్ఫీదు పొందిన ఉపాధ్యాయులద్వారా వాటిని నడపించునట్లు ప్రభుత్వమువారు పైన పేర్కొనిన యజమానులను ఒత్తిడి చేయవలసినదిగా యీ మహాసభవారు కోరుచున్నారు.

౨౪. స్కూలు ఫైనలు, అంతకంటె పైదర్జా సర్టిఫికెట్టులను పొందుటకు ఒక్కొక్క విద్యార్థి కనీసము క్రమముగా 10, 25 మందిని అక్షరాస్యులుగా చేసియుండవలెనను నియమమును విధించవలసినదిగ యీ మహాసభవారు మదరాసు, హైదరాబాదు ప్రభుత్వములను; ఉస్మానియా, ఆంధ్రవిశ్వకళాపరిషత్తుల వారినీ కోరుచున్నారు.

౨౫. మదరాసు రాష్ట్రంలో వయోజనవిద్యాకేంద్రములలో చదివిన పెద్దలకు యోగ్యతా పత్రముల నిచ్చు యేర్పాటులున్నవి. 3 సంవత్సరములు చదివిన తర్వాత యిచ్చే యోగ్యతా పత్రములను 8 వ తరగతి సర్టిఫికేటు సమానముగా అంగీకరించవలసినదిగ ప్రభుత్వమువారి నీ మహాసభవారు కోరుచున్నారు.

౨౬. ప్రజాసేవ చేయువారు అక్షరాస్యులను తయారు చేయునప్పుడు రకములవారికిగా యోగ్యతా పత్రములనిచ్చి, అట్టి యోగ్యతా పత్రములు పొందినవారు కొన్ని ప్రత్యేక సౌకర్యములు పొందుటకు ఏర్పాటు చేయవలసినదిగను, యిదేమాదిరి ప్రభుత్వ ఉద్యోగులకు కూడా యింక్రిమెంట్లకు, ప్రమోషనులకు దీనినొక ప్రత్యేక యోగ్యతగా లెక్కించవలసినదిగను యీ మహాసభవారు ప్రభుత్వం వారిని కోరుచున్నారు.

౨౭. వయోజనవిద్యా బోధకులకు యిచ్చు సహాయవేతనము చాలా తక్కువగా నున్నందువల్ల యిది కనీసంకంటె తక్కువగా యున్నది కాబట్టి జీవిత శాఖలనుండి ఆకర్షించజాల కున్నది. కనుక యీ మొత్తమును మాసము 1 కి కనీసము రు 20-0-0 లైనా పెంచవలసినదిగా ప్రభుత్వమువారిని యీ సభవారు కోరుచున్నారు.

౨౮. ప్రభుత్వేతర సంస్థలిచ్చుచున్న వయోజన ఉపాధ్యాయ శిక్షణను గుర్తించుచూ అట్టి శిక్షణను పొందినవారికి ప్రత్యేక గ్రాంటు సదుపాయములు చేయవలసినదిగా ప్రభుత్వమువారిని యీ మహాసభవారు కోరుచున్నారు.

౨౯. ప్రభుత్వములు యింతవరకు వయోజన విద్యావ్యాప్తికై యిచ్చిన దోహదం ఏమాత్రం చాలలేదు. కనుక అధికారేతరుల సహాయమును విరివిగా సంపాదించి వారిద్వారా కార్యనిర్వహణ జరపడమును గురించి తగిన చర్య తీసుకోవలసినదిగా మదరాసు, హైదరాబాదు ప్రభుత్వములను యీసభవారు కోరుచున్నారు.

౩౦.(అ) తెలంగాణాలోని ఆంధ్రసారస్వత పరిషత్తు తెలుగు భాషలో పరీక్షలు నిర్వహించుచూ ఆనాటి విజ్ఞాన చంద్రికా పరిషత్తు ప్రారంభించిన సాంప్రదాయమును పునరుద్ధరించి అభివృద్ధికరంగా సాగించుచున్నందుకు యీ మహాసభవారు సంతసించుచు పరిషత్తువారిని అభినందించుచున్నారు.

(ఆ) ఈ పరీక్షలను తెలంగాణాలోనేగాక విశాలాంధ్ర ప్రాంతములోను కేంద్రము లేర్పాటుచేసి ఆంధ్రుల కందరికీ గృహవిద్యావిధానంలో అవకాశం కల్పించవలెనని ఆంధ్రసారస్వత పరిషత్తును కోరుచు, విరివిగా యీ పరీక్షలలో పాల్గొనవలసినదిగా ఆంధ్రప్రజానీకాన్ని యీ మహాసభవారు కోరుచున్నారు.

౩౧. 30 సంవత్సరాల ఆంధ్రాభ్యుదయ ఫలితంగా సారస్వతాభివృద్ధి వినూత్న రూపాలు చెందడం ప్రశంసింప తగినదే. అయితే యీ పలుముఖాల విస్తరణలో తప్పుడు మార్గాలు కూడా పట్టడం విషాదకరం. నూతన రచనలలో సాంస్కృతిక పాటవం తగ్గడంతో బూతుసారస్వతం యీనాడు సాహిత్యరంగాన్ని క్రమ్మివేసి సంఘజీవితాన్ని పెడమార్గాలు పట్టిస్తున్నవి. నేడు తెలుగు భాషలో అవినీతికరమైన బూతుకథలను, నూతన విజ్ఞానం పేరిట

అజ్ఞానాన్ని, అవినీతిని పత్రికల ద్వారా, పుస్తకాల ద్వారా విరివిగా ప్రచారం చేస్తున్నారు. సంస్కృతీరీతుల అభ్యున్నతిని ఆశించే ప్రజానీకమున్నూ, ప్రభుత్వములున్నూ, వీటిని అరికట్టవలెను. అందుకు వెంటనే తగుచర్యలు తీసికోవలెనని ప్రభుత్వాన్ని తగు విజ్ఞాన ప్రబోధం చేయవలసిందని ప్రజానీకాన్ని ఈ మహాసభవారు కోరుచున్నారు.

3౨. ఆంధ్రభాష జనసామాన్యానికి ఇంకా అందుబాటులో వుండాలంటే ప్రభుత్వము, వ్యాపారులు, ప్రజానీకం వాడుకలోకి తేలికగా దీనిని అలవరచుకోవలెనంటే తెలుగులిపి సంస్కరణ జరిగి ముద్రాలేఖిని, లినోటైపు యేర్పడడం అవసరం. అందువలన యీ విషయమై పూర్తికృషి చేయవలసియున్నది. కనుక దీనికి సంబంధించినవారి పరస్పర సంప్రదింపులు జరిపించవలెనని, యీ విషయంలో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం చొరవతీసుకోవలెనని యీ మహాసభవారు కోరుచున్నారు.

33. ప్రాథమిక విద్య, విజ్ఞానము పెంపొంది అన్నివిధముల ప్రజలు ఉపయుక్త జీవితములు గడుపవలెనంటే గ్రామ ప్రజలందరకూ అందుబాటులో గ్రంథాలయములుండవలెను. ఆంధ్రదేశంలో ప్రతి పదిమైళ్లకు ఒక కేంద్ర గ్రంథాలయము, ప్రతిగ్రామమునకు వారానికి ఒకదినము పుస్తకములు యిచ్చి తీసుకొను ఏర్పాటుతో స్థాపించవలయుననియు, స్థాపించియున్న అభివృద్ధిచేయుటకు తగిన ధనసహాయము చేయవలయునని జిల్లాబోర్డులను యీ మహాసభవారు కోరుచున్నారు.

3౪. గ్రంథాలయ సేవకులు, వయోజన విద్యాప్రచారకులు ఉత్సాహవంతులగుటకు ఎక్కువమంది యీ ఉద్యోగాల వైపుకు మరలుటకు 8 వ తరగతి లేదా 8 వ ఫారము పరీక్షలో ఉత్తీర్ణులై యీ సేవలలో ఏ ఒకదానిలోనైనా అధమపక్షము రెండు సంవత్సరములు పనిచేసిన ప్రజాసేవకులకు ప్రైవేటుగా స్కూలుఫైనలు పరీక్షకు పోవుటకు అవకాశమును కల్పించవలసినదిగా మదరాసు, హైదరాబాదు ప్రభుత్వములవారిని కోరడమైనది.

3౫. గ్రామగ్రంథాలయములు అభివృద్ధిదాయకంగా పనిచేయాలంటే ఆయాప్రాంతములలో దాపు-దాపులలోగల పదేసి గ్రామములొక గ్రూపుగా యేర్పడి 15 దినముల కొకసారిగాని, కనీసము నెలకొకపర్యాయముగాని, ఒక్కొక్క గ్రూపుకు చెందిన గ్రంథాలయాల కార్యకర్తలు ఒక్కొక్క గ్రామములో కలసి పరస్పరము తమ అనుభవాలను చర్చించుకొంటూ చర్చలలో తేలిన అనుభవాలతోనూ, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారి సలహాలతోనూ గ్రంథాలయములు నడపుకొనుట ఉత్తమ మార్గమని యీ మహాసభవారు తీర్మానిస్తున్నారు.

3౬. (అ) బ్రిటనులో 1950 వ సం. సెప్టెంబరు నెలలో జరుగనున్న ప్రథమ గ్రంథాలయ శాసనపు శతవార్షికోత్సవమునకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘప్రతినిధులుగ వెడలుచున్న అధ్యక్ష కార్యదర్శుల ప్రయాణాది సౌకర్యములకు కావలసిన ధనసహాయమునుచేసి మన గ్రంథాలయ ఉద్యమపు విశిష్టతను లోకానికి చాటుటకు అవకాశమును కల్పించుటకై కేంద్ర రాష్ట్రీయ ప్రభుత్వములను, గ్రంథాలయాభిమానులను, ఆంధ్రోద్యమాభిమానులను యీ మహాసభవారు కోరుచున్నారు.

(ఆ) గ్రంథాలయ నిర్వాహకులు, వయోజన విద్యాప్రచారకులు ఈ కార్యక్రమంలో తగు శ్రద్ధవహించవలసినదిగ యీ మహాసభవారు కోరుచున్నారు.

3౭. ౨౭ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ వృత్తాంతాలకు తగిన ప్రకటనము నిచ్చిన వివిధపత్రికలవారికి, వితరణ బుద్ధితో సభా నిర్వహణమునకుగాను విరాళముల నొసగిన దాతలకు, పలుప్రాంతములనుండి ప్రదర్శనము నిమిత్తము పుస్తకములను, పత్రికలను, యితర పరికరములను పంపిన వివిధసంస్థలకు, వ్యక్తులకు, మూడుదినములుగా మహాసభ కరుదెంచిన ప్రతినిధులకు పలువిధములగు సౌకర్యములను చేకూర్చుటలో భాగస్వాములైన ఆహ్వానసంఘ కార్యకర్తలకు, సేవాదళ సభ్యులకు, వివిధసభల కార్యకలాపాల విజయానికి తోడ్పడిన పెద్దలకు, గ్రంథాలయ, వయోజన విద్యల ఉద్యమ సేవకులకు, మహాసభ సమావేశములకు తమ గాంధి పార్కు నొసగి అన్నివిధముల మహాసభ నిర్వహణమునకు సాయపడిన సూర్యాపేట వర్తకసంఘమువారికి యీ మహాసభవారు హృదయ పూర్వకమైన కృతజ్ఞతను తెలుపుకొనుచున్నారు.

ఈ సమయమున సూర్యాపేట ప్రజలను, ముఖ్యముగ ఆంధ్రవిజ్ఞాన ప్రకాశినీ గ్రంథనిలయ పాలకులను యీ సభవారత్యంతము అభినందించుచున్నారు.

# పుస్తకాల స్వయంవరం

శ్రీ శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం

స్వయంవరం – చాటించారోయ్
త్వర త్వరగా – పయనం కావోయ్
పుస్తకాల – బాలకుమారితో
నేస్తానికి – పోదాం పదవోయ్

నినువలచిన చదువుల చానతో
మనసిచ్చి – మాట్లాడాలోయ్
నీ నచ్చిన – మాటల రాణికి
కానుక కట్నాలియ్యాలోయ్
స్వయంవరం చాటించారోయ్
త్వరత్వరగా పయనం గావోయ్

నిలచిన యీ – కన్నెలలో నిను
వలచీ వల – పించిన దేదో
అందాల – అణువు కణాలా ?
ముందు వెనుక – మూడు గుణాలా ?
అందని ఆకాశం సొబగా ?
అందందూ – ఆరని వెలుగా ?
భూగోళం – పున్నెము పంటా ?
బాగోగుల – పాయని జంటా ?
సంగీతం – సాహిత్యాలా ?
శాస్త్రాలూ – చారిత్రాలా ?
వేదాలూ – వేదాంతాలా ?
పలుమతముల – భాగవతాలా ?

పల్లెటూరి - చల్లనిగాలా ?
చేతిపనుల - చైతన్యాలా ?
మితిమించిన - మత పిచ్చులలో
బ్రతికించే - పరమప్రేమా ?
చితికిన యీ - మానవ హృదయం
అతికించే - సత్యాహింసా ?
నిలచిన యీ - కన్నెలలో నిను
వలచీ వల - పించిన దేదో !

ప్రతిచదువరి - తన చదువేదో
ప్రతిచదువుకు - చదువరి యెవరో
ఏ పుస్తక - మెవ్వరి వంతో
యేరుకొనే - రంగస్థలమోయ్
అందరికీ - అన్ని చదువులూ
అందుబాటులో ఉన్నాయోయ్
వందల కందని విజ్ఞానం
చందాతో - సాధించామోయ్

అందాల - చదువుల కన్నెల
గ్రంథాలయ - సీమకు రావోయ్ !
స్వయంవరం - చాటించారోయ్ !
త్వర త్వరగా - పయనం కావోయ్ !

# గ్రంథ నిలయార్చకుడు

గ్రంథ నిలయార్చకుడు సరస్వతీ దేవాలయములోని పూజారివలె ననుదినము భక్తుల నాకర్షించు శక్తిగలవాడై యుండవలెను. మన స్తత్వమును తెలిసినవాడై సమస్త కళాభిరుచులను చవిచూచి నిత్యము చదువరులకు వారివారి యభిరుచుల ననుసరించి పుస్తకముల నిచ్చి, అవసరమైనప్పుడు సందేహాత్పన్నను నివారించి సంతృప్తి పరచవలెను. ఈవిధముగ దినదినము చదువరుల నెక్కుడుగా నాకర్షింప గలిగి సూదంటురాయివలె వ్యవహరించవలెను. ఎంతమంది వచ్చినను సణుగుకోనక, సహనము, సౌజన్యము, శాంతము, కలిగివుండి వారు అడిగిన గ్రంథముల నిచ్చుటయేగాక సద్గ్రంథముల సూచించు వృత్తి గలవాడై యుండవలయును. ఉద్రేకపూరితులు, నిమిషోన్మాదమునకు కారణములగు గ్రంథముల నడిగినచో నివ్వక నుత్సాహభంగము కాకుండ అట్టి గ్రంథములవల్ల కలుగు నష్టములెల్ల తెలియజెప్పి సద్గ్రంథములోని సారాంశమును బోధించి సదా యట్టి గ్రంథములనే పాఠకులకు యిచ్చుచుండవలెను. ఒక ముక్కలో చెప్పవలెననిన "సరస్వతీ రాజ్యమున రాచకార్య నిర్వాహకుడగు ప్రెగ్గడయై గ్రంథాలయ కార్యదర్శి మెలగవలయునన్న మాట.

ఈ సందర్భములో ఒక విపరీతవిషయ మీవిధంగా చెప్పబడుచున్నది. కొంత కాలం క్రింతం ఒక పట్టణాధికారి యొక గ్రంథాలయోద్యోగి కాతిథ్యమియ్యవలసి వలసివచ్చినదట. ఆ వుద్యోగి అవిద్యావంతుడని యతని నాహ్వానించుట యవమానకరమని తలచి విచారించు చుండగా యీయధికారి గుమాస్తా "తా నాతిథ్యమిస్తా"నని యొప్పుకున్న తరువాత అతని చికాకు కొంత తగ్గిందట - యీ విషయం తెలియని గ్రంథాలయోద్యోగి పట్టణాధికారియింటికిపోయి యొక చీటీపై తనపేరు వ్రాసి లోనికి పంపించాడట. ఆ చీటీపై యాతనిపేరు ప్రక్కనవున్న యం. ఏ. అను రెండక్షరాలను పట్టణాధికారిచూచి విస్తుపోయి, అప్పుడతనికి తాను స్వయంగా నాతిథ్యమిచ్చినాడట. తాంబూల సమయములో యింతగా చదువుకున్నవానికి యీ నీచోద్యోగము దాపరించినందులకు విచారించ నా యుద్యోగి తన జీతమును తెలియ చేయ, పట్టణాధికారి వెరగుపడి తనజీతముకన్న యెక్కువగా నున్నందులకు దేశాదాయములోని యింతసొమ్మును వ్యర్థంగా పాడుచేయుచున్నారని దూషించినాడట. ఇంకను యిటువంటివారు కొందరున్నారనడం నిస్సంశయము. గ్రంథనిలయము నెప్పుడుచూడక దాని లాభములను పొందక అమాయకులుగా తిరుగువారు యీ యుద్యోగి భావములు కలవారుగా నుండవచ్చును. కాని తఱచు గ్రంథాలయములకు రాకపోకలు గలిగి తమ జీవితకాలములో యేదైన యొక విషయాన్ని గూర్చి పరిశోధన జేసినవారుమాత్రం గ్రంథాలయోద్యోగులను విద్యావంతులుగా నుండవలెనని, తాను పరిశోధించుచున్న విషయానికి కొంతసహాయము చేయగలిగినవారుగా నుండవలెనని యాశించుచూ



శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు (పుట 40)

వుంటారు. ఒకానొక పాశ్చాత్య విశ్వవిద్యాలయ అధ్యక్షుడన్నాడు. "గ్రంథాలయ కార్యదర్శి బోధకుడుగా నుండవలెను. ఆతనికి కార్యనిర్వాహణ సామర్థ్యముండవలసినదేకాని ఆతడు నిరక్షరాస్యుడైతే అదికేవలము వ్యర్థమే." గ్రేటుబ్రిటను పబ్లిక్ లైబ్రరీ కమిటీవారు యీ విధంగా నిర్ణయించారు ? లైబ్రరీ వుద్యోగులు వివిధసారస్వతాలయందు ప్రవేశము, ఆదరముగలవారుగాను, యేయేసారస్వతములో యేయే గ్రంథాలు మంచివో తెలిసికోగలవారుగాను పాఠకుల కవసరమగు సహాయంచేయగలవారుగాను, పాఠకులు తెలుసుకోగోరే విషయమే గ్రంథంలో వుంటుందో వెంటనే తెలుపగలవారుగాను ఉండవలెను. వారు లైబ్రరీలోని పుస్తకాలు మొదలైనవాటిని కేవలం జ్ఞానం వ్యాపింపజేయటానికి మాత్రమేగాక, దానిని విస్తరింపజేయడానికి వుపయోగించు సమర్థులై యుండవలెను. దీనివలన పాశ్చాత్య దేశములలో విశ్వవిద్యాలయ సామాన్యపట్టములు (University degrees) గ్రంథాలయ పాఠశాలలో ప్రవేశించుట కర్హత కల్పించుచున్నవని మాత్రమే తెలియుచున్నది. గ్రంథనికేతనములలో గొప్ప యుద్యోగములు కావలయుననినవారికి పెద్దపట్టములు కావలయును. దీనిని బట్టే ఆర్నాల్డు బెన్నెట్టు యీ విధముగా సూచించినారు. "పుస్తకభాండాగారాలు, పుస్తకాలకు తక్కువగను, విద్యావంతులగు సుద్యోగులకు యెక్కువగను సొమ్మును వెచ్చిస్తే లాభం చాలా కలుగుతుంది. భాండాగారాలలో పుస్తకాలకు యేకొరత యుండదు. కాని వాటిని చక్కగా యుపయోగించడము తెలియకపోవడమే కొరత. విద్య, వ్యక్తిత్వముగల యుద్యోగులుంటె యీకొరత తీరుతుంది."

—శ్రీ పేరుంబూదూరు లక్ష్మీనరసింహాచార్యులు

# గ్రంథాలయములు : విశ్వకవి సుభాషితములు

గ్రంథాలయోన్నతిని గూర్చి కీ. శే. రవీంద్రనాథ టాగూరుగారు యీ క్రింది విధముగా సెలవిచ్చియున్నారు.

1. ఒక లక్షాధికారి యేదేని సమావేశమునకు వచ్చెనేని యందరును ఒకరిని మించి యొక రాతనిని గౌరవింప జూతురు. ఆగౌరవ మత డొసంగవలసిన దానిపైగాక కేవలమతని కున్నదానిపైననే నిలుచును. చాలవరకీ విధమున గ్రంథాలయముల గొప్ప దనమును గ్రంథ సంఖ్యల వలన నిర్ణయింపబడు చున్నది. పుస్తకము లుపయోగించుటకుగల సౌలభ్యములే గ్రంథాలయములకు ప్రతిష్ఠ కూర్పవలసియుండ, అట్టి సౌలభ్యములు గ్రంథాలయములచే పరిగణింపబడకున్నవి.

2. గ్రంథాలయమునకు మహోత్తమోప యోగము చేకూర్పవలసిన యెడల యచటి గ్రంథముల విషయము లందరికిని స్పష్టముగా తెలిపిడి చేయవలెను. లేకున్న

జనసామాన్యమున కవి యందుబాటు కావు. గ్రంథాలయ మప్పుడు యెక్కువ వసతి కలిగియు, రాకపోకలకు సౌకర్యములేని నగరమువలె నుండి పోవును. గ్రంథములున్న యందుకు వాని నందరచేత చదివించ వలయును. అప్పుడే గ్రంథాలయమునకు సార్థకత. కేవలము జనులను పుస్తకములను చూచిపోవుటకు రానిచ్చుట మాత్రము చాలదు. దాని యాహ్వానమెంతయు చురుకుగానుండవలెను. చదువబడని గ్రంథములు వ్యర్థమైనవన్న మాట.

3. పాఠకుల నాహ్వానించుటకు యే గ్రంథాలయము యెక్కువ యుత్సాహించునో, యదియే యాతిథ్య పరత్వము కలది. ఇట్టి యాతిథ్యము మాత్రమే గ్రంథాలయమును పెద్దజేయునది. కాని గ్రంథముల సంఖ్య కాదు. పాఠకులు గ్రంథాలయమును పుట్టింతు రనుట సత్యము కాదు. గ్రంథాలయము కూడ పాఠకులను సృష్టించును.

4. గ్రంథాలయాధికారి ఉన్న గ్రంథములన్నింటిని సరిగా అర్థము చేసుకొని యుండవలెను. గ్రంథాలయము మిగుల పెద్దదైన యెడల యాస్థిర మొనర్చుకొనుట కతని కశక్యమగును. అందువలన నాయూహాయందు పెద్ద గ్రంథాలయము గ్రామము వంటిది. చిన్నది మాత్రమే భోజనశాలవలె దినదినము ఆహారమును ఆనందమును సమకూర్చునది.

5. చిన్న గ్రంథాలయమున అతిథుల యానందమునకు సరిగా సరిపోవు సామగ్రి యుండవలెను. దాని యధికారికి గృహమేధి గుణములుండవలెను. కాని పుగ్రాణపు కావలివాని గుణములుండ గూడదు.

ఈ విధముగా పై యమూల్య సూచనలను పాటించుచూ, జనసామాన్యమునకు హితమును గూర్చుచూ "మానవసేవ కొరకై నే నిచట యున్నాన"ని గ్రంథ నిలయము వేనోళ్ళ చాటుచుండవలెను. గ్రంథ భవనములలో సమావేశముల జరుపుచూ, భాషా కోవిదుల, సాహిత్య విశారదుల శ్రీ సూక్తులు జనసామాన్యమున కందజేయుచు వైజ్ఞానిక, సామాజిక, రాసాయనిక, రాజకీయార్థిక ఘట్టములలో నారితేరుతూ గ్రంథాలయము దినక్రమముగా పురోగమించి, యాంధ్ర దేశాభ్యుదయమును సాధించి జాతీయోత్కృష్టతను గడించు గాతయని యాశించుచున్నాను.

—శ్రీ పేరుంబూదూరు లక్ష్మీనరసింహాచార్యులు

# గ్రంథాలయాల కార్యక్రమం నూతన రూపం దాల్చాలి

శ్రీ బ ం డి నా గే శ్వ ర రా వు

ప్రస్తుత గ్రంథాలయ పరిస్థితులు చూస్తుంటే ఎన్నాళ్లు చూచినా గొర్రెతోక బెత్తెడే అన్న సామెత జ్ఞప్తికి వస్తోంది. మిగతా రంగాలలో కానవస్తున్న ఆంధ్రుల ఆరంభశూరత్వమే యిందులో కూడ కానవస్తున్నది. ఉత్తమ గ్రంథం ఒక్కటి లేక పోయినా అమిత వ్యయంతో ముందుగానే భవనాన్ని నిర్మించటం, తదుపరి గ్రంథాలను గాని, పత్రికలనుగాని కొనటానికి పైకంలేక కాళ్లు ఆరబాపి కూర్చోవటం లేదా గ్రంథాలయ పనుల ప్రాకులాటలో తగవులాడి ఉన్న భవనాన్ని పాడు బెట్టించటం యివన్నీ నిత్యదృశ్యాలే. ఒకవేళ గ్రంథాలు తెప్పించినా అవి గ్రామంలోని ఎక్కువ మందికి ఉపయోగించక పోవటం, తద్వారా ప్రజలకు గ్రంథాలయానికి సంబంధం లేక పోవటం, గ్రంథాలయం శిథిలావస్థను పొందటం యిది పరిపాటయిపోయింది.

మరి గ్రంథాలయ కార్యక్రమం సక్రమంగా సాగాలంటే మనం చేయవలసిం దేమిటి ?

ఆరంభ శూరత్వంతో వచ్చిన పైకంతో ముందుగానే ఒక్కసారే పుస్తకాలు కొనివేయడం మనం చూస్తున్నాం. దీనివల్ల చాలనష్టం ఉంది. ఒక్కసారే పుస్తకాలుకొనాలంటే మన అవసరాలకు తగిన పుస్తకాలు దొరకటంలేదు. మరిచేతిలో ఉన్న పైకాన్ని ఖర్చుచేయటానికి త్రోవలేక ఏకొద్దిమందికో ఉపయోగపడే ఎక్కువ విలువగల గ్రంథాలను కొనడం వానిని సంవత్సరానికి ఒక సారయినా తెరిచేవారు లేకపోవడం జరుగుతోంది. అదీగాక యీ క్రొత్త పుస్తకాలు తెచ్చినకొలదికాలంలోనే మరల క్రొత్త పుస్తకాలు కావాలంటే చేతపైకం లేకపోవటం, చదువరులకు నూతన గ్రంథాలు దొరకకపోయేసరికి నిరుత్సాహపడటం మున్నగు ఘటనలు జరుగుతున్నాయి. చదువరులను నిత్యం గ్రంథాలయానికి ఆకర్షించాలంటే పుస్తకాలకన్న పత్రికలు ఎక్కువగా పనిచేస్తాయి. అదీగాక పత్రికలు చదువరులకు సమాజంలోని తాజావార్తలను అందిస్తాయి. మనం చదువరులకు ఎక్కువగా పత్రికలను అందిస్తూ వుండాలి. మనకు చేతికి వచ్చిన పైకంలో ఎక్కువభాగాన్ని పత్రికలకును, తక్కువ భాగాన్ని పుస్తకాలకు వెచ్చించి చదువరులకు గ్రంథాలయంయెడ అభిరుచి కల్పించాలి.

మన గ్రంథాలయానికి ఎక్కువగా చదువరులు చేరకపోవటం గ్రంథాలయ కార్యక్రమం సక్రమంగా సాగకపోవడానికి ముఖ్యకారణం పరిజ్ఞానానికి కావలసిన వస్తుసామగ్రి గ్రంథాలయంలో లేక పోవటమే. ఉన్న నాలుగు పుస్తకాలు చదువుకున్న ఏకొద్దిమందికేగాని మిగతా వారికి గ్రంథాలయం ఏవిధంగాను ఉపయోగపడటం

లేదు. మనదేశంలో ఉన్న అక్షరాస్యత మనకు తెలిసినదేగదా! అందుచే ప్రతిగ్రంథాలయం తరఫున ఒక వయోజన విద్యాకేంద్రాన్ని ఏర్పాటుచేసి, ఒక ప్రణాళిక ప్రకారం గ్రామంలోని నిరక్షరాస్యులగు వయోజను లందరిని అక్షరాస్యులనుగా చేసే ప్రయత్నం ముందుచెయ్యాలి. ఇందుకు అవసరమయితే గ్రామంలోని విద్యాధికుల, బడిపంతుళ్ళ సాయం తీసుకోవచ్చు. వయోజనులను ఉత్సాహపరచు నిమిత్తం నిర్ణీతకాలమైన తదుపరి పరీక్షలు జరిపి యోగ్యతా పత్రములిచ్చియో, లేదా మరో విధంగానో చేయవచ్చును. అయితే ఏదో విధంగా తంటాలుపడి గ్రామంలోని వారిని అక్షరాస్యులను చేశాం. బాగానే వుంది. కాని వీరు చదివిన చదువును మరచి పోకుండాను, తదుపరి చదువు అభివృద్ధి చేసుకోటానికి గ్రంథాలయం ఎంతో కృషి చెయాల్సివుంది. వారికి తగు పుస్తకాలను, పత్రికలను సప్లయిచేయాలి. కాని యిందుకు సంబంధించిన వాఙ్మయము బొత్తిగా లేదనే చెప్పవచ్చు. అసలు వయోజనులు విద్యనేర్చు కోటానికి అనువగు వాచకాలే లేనపుడు మిగతా వాఙ్మయం ఎక్కడనుంచి వస్తుంది? అందుచే ముందు వయోజన సాహిత్య సృష్టికి ఎక్కువగా కృషిచేయాలి. అప్పుడే మన గ్రంథాలయానికి చదువరులను ఎక్కువగా ఆకర్షింప గలుగుతాము. గ్రంథాలయం అభివృద్ధికి రావటానికి అవకాశముంది.

జనాభాలో సగభాగమైన స్త్రీల విషయంలో గ్రంథాలయం ఏమీ చేయలేక పోతున్నదని గట్టిగా చెప్పవచ్చు. స్త్రీ సమస్యలకు సంబంధించిన గ్రంథాలుకూడ చాలా తక్కువ. ఉన్నవాటి వినియోగమైనా సక్రమంగా జరుగుచున్నదా అంటే అదీ శూన్యమే. ఏ విధమైన ఆకర్షణాలేని నేటి మన గ్రంథాలయాన్ని పురుష చదువరులే అంతంత మాత్రంగా ఉపయోగించు కుంటూంటే యిక స్త్రీ చదువరులను గురించి వేరేచెప్పాలా! నేటి సమాజంలో స్త్రీ స్థానం సర్వ విదితమే. ఇలాంటి వారికి నిత్యముగాని లేదా ప్రత్యేక దినాలలోగాని ఎవరి ద్వారానైనా యిండ్లకు పుస్తకాలు పంపించి స్త్రీ చదువరుల కందజేయడం చాలాఅత్యవసరం.

ఇండ్లకు పుస్తకాలు పంపించే విషయంలో స్త్రీ చదువరులకే కాదు, పురుష చదువరులకు కూడ అందించవచ్చు. గ్రంథాలయం కేవలం ఒకచోట ఉండక సంచారం చేస్తూవుంటేనే ఎక్కువ ఉపయోగంలోకి వస్తుంది. సాధారణంగా గ్రామప్రజలు తమ తమ వృత్తులలో మునిగియుండి గ్రామంలో ఒకచోట స్థావరంగావున్న గ్రంథాలయానికి వెళ్ళి పుస్తకాలు తెచ్చుకోవడమనేది కష్ట సాధ్యమైన విషయం. అలాంటివారికి యీ సంచార గ్రంథాలయం ఎంతగానో ఉపకరిస్తుంది.

ఇంక అన్నిటికంటె ముఖ్యమైనది పిల్లల సమస్య. నేటి పిల్లలే రేపటి పౌరులని, పిల్లల బాగోగులపైనే దేశం బాగోగులు ఆధార పడియున్నవని ఉపన్యాసాలు చెప్పే మనం వీరి విషయమై అశ్రద్ధ వహించుట చాల శోచనీయం. నేటి మన కవికుమారులు, సాహితీ వేత్తలు తెలిసిన విషయాలపైనే, ఉన్న విషయాలపైనే తమ తమ భాషా చాతుర్యం చూపనిమగ్నులై యున్నవారేగాని, నూతన పంథాతో నూతన రచనలు

గావించి మన వాఙ్మయంలోగల లోటుపాట్లను సవరిస్తే ఎంతబాగుండునోకదా! వయోజన వాఙ్మయానికి గలదుర్దశే యీ బాలవాఙ్మయానికీ పట్టింది. క్లాసుపుస్తకాలతో విసుగెత్తుబాలలు వినూత్న విషయాలు తెలుసుకోటానికి గ్రంథాలయంవైపు అర్రులుసాచటం సహజమేకదా ? కాని వారి యాశల నడియాశలను జేయు మన గ్రంథాలయాల పరిస్థితి అభివృద్ధి చేయవలసిన ఆవశ్యకత ఎంతగలదో మనకు ద్యోతక మవుతోంది.

పైన చెప్పినట్లుగా అన్ని వర్గాలవారికి కేవలం పుస్తకాలు, పత్రికలు సమకూర్చినంతమాత్రానే పనిజరుగదు. మనం సమకూర్చినవి చదువరులు ఎంతవరకుఉపయోగించుకుంటున్నారు అనేవిషయం మనం గమనిస్తూ వుండాలి. ఇందుకుగాను వివిధ వర్గాలవారికి వారివారి అభిరుచులను బట్టి మన గ్రంథాలయంద్వారా వారునేర్చుకున్న విషయాలపై అప్పుడప్పుడు పరీక్షలు జరపడం ఉచితం యివి లిఖితం కావచ్చు. మౌఖికం కావచ్చు.

మన గ్రంథాలయానికి అనేకపత్రికలు వస్తూవుంటాయి. కేవలం వాటిని వినోదానికి, కాలక్షేపానికికాక దేశంలోని పరిస్థితులేమిటో తెలుసుకొని అందు తమ కర్తవ్యమేమిటో గుర్తించే దృష్టితో చదివేటట్లుగా చూడాలి. అందుకుగాను అప్పుడప్పుడు పత్రికాజ్ఞానం పరీక్ష (Paper knowledge test) జరపడం మంచిది. ఇది సం॥నకు ఒకపర్యాయంగాని లేదా వీలునుబట్టి ఎక్కువసార్లుగాని జరిపి, గెలుపొందిన వారికి బహుమతులిస్తుంటే చదువరులు ఉత్సాహంగా పాల్గొంటారు. శ్రద్ధగా చదవనూ చదువుతారు. ఇంతేగాక చదువరుల సంఘాన్నొకదాన్ని ఏర్పాటు చేసి, వారానికో, పక్షానికో సమావేశాలు జరిపించి ఏదో ఒక విషయంపై చర్చనడిపించుటో లేదా గతవారం లేదాపక్షంరోజుల పరిస్థితుల సమీక్ష చేయించడం మంచిది. ఇలా జరుపుతుంటే చదువరి తన కర్తవ్య నిర్వహణకుగాను విభిన్న గ్రంథాలతో సంబంధం పెట్టుకోవడం, మన గ్రంథాలయంలో గ్రంథాలు ఎక్కువగా ఉపయోగ పడటం జరుగుతుంది.

ప్రతి కార్యక్రమానికి సింహావలోకనం అవసరం. ఇందుకు వార్షికోత్సవాలు చాలా ఉపయోగపడతాయి. ఈ వార్షికోత్సవాలు కేవలం వినోదం కోసంకాక గతంలో మనం చేసిన కార్యక్రమాన్ని పునరాలోచించుకొని, ముందు చేయవలసిన దానిని నిర్ణయించుకోవడం, అందుకు తగిన కృషి చేయడం అవసరం. ఈ సందర్భాలలోనే పైన పేర్కొన్న పెద్దలకు పిల్లలకు ఆటపాటల్లోగాని, విజ్ఞాన విషయాల్లోగాని పోటీలు జరిపి బహుమతు లివ్వటం మంచిది. అయితే యీ సందర్భాలలో గొప్పగొప్ప వారిని ఆహ్వానిస్తామేగాని, ఎక్కువ మంది ప్రజానీకాన్ని ఆకర్షింపజేసి ఆ గొప్పవారి సదుపదేశాలను వినే అవకాశాలు కలుగజేయటం చాలా అరుదుగావుంది. ఇంకా పల్లెటూరి ప్రజలు పెద్దల సుభాషితాలను ఓపికగా కూర్చొని వినేస్థితికి రాలేదు. పగలెల్లా శారీరకశ్రమ చేసియుండు వీరికి వినోదం అవుసరమై యుంటుంది. వినోదం లేని కార్యక్రమానికి హాజరుకావటం అరుదు. అందుకుగాను సభాంతమున హరికథో, బుర్రకథో, నాటికో, ప్రహసనమో, విచిత్రవేషాలో ఉండటం శ్రేయస్కరం. ఇవి

కేవలం వినోదాన్ని మాత్రమేగాక వినోదంద్వారా విజ్ఞానాన్ని యిచ్చేవిగా కూడా ఉండాలి.

సరే బాగానే ఉన్నాయి. అన్ని ఏర్పాట్లు చేశామే అనుకుందాం. కాని వీటన్నిటిని నడపడానికి మూలాధారం గ్రంథభాండాగారి. ఇతడే యీ సంస్థకు మూలవ్యక్తి. ఈ గ్రంథాలయం అనే రైలుబండికి ఇతడే డ్రయివరు వంటి వాడు. ఈతని జాగ్రత్త, తెలివితేటలు, నడవడిక మీదనే యీ సంస్థ బాగోగులు నిలబడి వుంటాయి. ఇతని కెంతో నేర్పు, ఓర్పు, ఉత్సాహం, సేవాభిలాష, పట్టు దల మున్నగు సద్గుణాలుండాలి. అందరి మన్ననలకు పాత్రుడు కావాలి. చదువరులను ఆకర్షించే కలుపు గోలుతనము, వారికి తగిన గ్రంథాలందించే వివేచనాశక్తి, గ్రంథాల యాన్ని సక్రమంగా నడిపే కార్యచతురత, పరిశీలనా దక్షత, విభిన్న చదువరుల రుచు లను కనుగొని వారి సందేహాలను స్వయం ప్రతిభవల్లగాని, గ్రంథసాయమునగాని తీర్చ గల వివిధ విషయ పరిజ్ఞాన సంపన్నుడుగాను ఉండాలి. అన్నింటికంటె ముందు తాను జీతపు మనిషి నని భావించక ప్రజోపయోగకరమగు సత్కార్య మొనరించు దేశహి తైషిననే దృష్టి కలిగి ఉండాలి. ఇలాంటి వ్యక్తులు దొరకటం చాలా అరుదు. నిజమే మరి. ఆర్థిక అసమానత ప్రబలియున్న యీ రోజుల్లో సంఘసేవకోసం బలి అవటానికి ఎవరుసాహసిస్తారు? అసలు సాహసించమని కోరటం కూడ తప్పే. పొట్టనిండా తిండి వుంటేగదా కష్టించి పనిచేసేది. మనం బొర్రలు నిమురుకుంటూ "అబ్బాయీ! యిది సత్కార్యం, ప్రజాసేవచేసి దేశభక్తుడవనిపించుకో" అని మనం చెప్పటం ఎంతతెలివి తక్కువ.

అందుచే నేటి చాలా భాండాగారులలో సరియగు వారు లేకపోవటం. కొన్ని చోట్ల కొంతమంది ప్రజాసేవ అనే పదమహాత్మ్యానికి లొంగిపడి కొంతకాలం పనిచెయ్య డం, తరువాత ఆర్థికంగా యిబ్బంది పడి దానినుండి తప్పుకోవడం, మరికొంత మంది తగు శిక్షణలేక, చాలీ చాలని జీతంతో జీవితం గడపటం దుర్భరమై యీ రంగాన్నుంచి నిష్క్రమించటం జరుగుతుంది.

సంవత్సరంలో సగం రోజులు పనిచేసి, సంవత్సర జీతం పొందుతూ విద్యా సంస్థలయెడ బాధ్యతా రహితంగా ప్రవర్తించు ఉపాధ్యాయులవలెకాక మాపుశ్రేష్ఠ, విద్యాలయాలకన్నా, సర్వప్రజానీకానికి ఎక్కువ ఉపయోగకారియైన యీ గ్రంథాల యాన్ని నడిపే గ్రంథభాండాగారియెడ చూపకపోవడం చాలా శోచనీయం. ఇక పైనా యిట్టి అలసత్వాన్ని పోగొట్టి ప్రభుత్వం వారు, ప్రజలు యిట్టి గ్రంథభాండా గారులకు తగుశిక్షణ, పోషణ యిచ్చిన గ్రంథాలయం ఎంతో అభివృద్ధికి రావటానికి అవకాశముంది. గ్రంథభాండాగారులుకూడా తమకర్తవ్యాన్ని గుర్తెరిగి నడచుకోవటం మేలు.

# ఆంధ్ర సరస్వతీ

౧

ఉ॥ ఆంధ్రసరస్వతీ గొను మ
హామతి స్వాగతమిచ్చినాము మా
ఆంధ్రుల గ్రంథశాలల వి
హారము చేయుము అక్షరాస్యతన్
ఆంధ్రుల నొక్కడేని మిగు
లాడక నిమ్ము పయోజనాళికిన్
ఆంధ్ర కవీంద్ర లేఖినుల
నాడుము సుందర నాట్యభంగిమన్.

౨

గీ॥ అమ్మ ! ఆంధ్రదేశ గ్రంథహారములను
ఈ మహాసభలోన కుసుమవిశాల
గంధగంధివై అంది సుగంధ సరస
సార సారస్వతాల మందార మిడుము.

౩

గీ॥ ఈ తెలంగాణ దాస్యనిశాతరీతి
మూతవడి వెలుతురుపాకి మొగ్గదొడిగి
పూలుపూచిన స్వాతంత్ర్యమాలతులకు
రసరసాల పికమ్మవై రాగమిడుము.

—చిగురుపాటి, ఆళ్ల సుబ్రహ్మణ్యము.

# గ్రంథాలయ ప్రచారము : ఉపాధ్యాయులు

శ్రీ సూరపరాజు కోటయ్య

ఉపాధ్యాయ వృత్తికిని, గ్రంథాలయ ప్రచారమునకును మంచి సంబంధ బాంధవ్య మమరును. ఇంత సన్నిహిత సంబంధము మరెవ్వరికి కలుగుటకు వలనుండదు. గ్రంథాలయముల వలని ఉపయోగమెట్టిదో యితరుల కంటె యితనికి బాగుగా తెలియుటయేగాక, గ్రంథాలయ మితని వృత్తికి తగిన సహాయకారి యగును. నిజమైన ఉపాధ్యాయుడు ఎప్పటి సంగతుల నప్పుడు తెలుసుకొని, కాలమునకు తగినట్లుగ తన విద్యార్థులకు బోధించవలయునన్న, తాను గ్రంథాలయ సహాయ మపేక్షింపక తప్పదు. కాన గ్రంథాలయ కార్యనిర్వాహకుడుగ ఉపాధ్యాయు డమరుట పొసగెనేని పరస్పరము రాణింపుకెక్కి ఉభయతారకమగు ననుట నిస్సంశము.

సాధారణముగా పల్లెటూళ్ళలోని ఉపాధ్యాయుడే లోకమెరిగిన చదువరిగా నుండును. గ్రంథాలయమును గురించి గ్రామ ప్రజలలో ప్రచారము గావించి, అది వారి కెట్లుపకరించునో వారికి తెలియునట్లుచేసి, వారిని దానివైపున కాకర్షింపచేయు అవకాశ మొక గ్రామోపాధ్యాయునికే కలదనుటలో నతిశయోక్తి లేదనుకొందును. ప్రస్తుతము దేశములో నూటికి తొంబదియైదు గ్రామములలో ప్రాథమికోపాధ్యాయులు పిల్లల విద్యావ్యాప్తికై పాటుపడుచున్నారు. ఇట్టి ప్రతి పల్లెలో, గ్రంథాలయమును స్థాపించి సాగించుట పొసగనిపని. అయినను అట్టి గ్రామోపాధ్యాయుడు ఆ సమీపములోని గ్రంథాలయములో తాను సభ్యుడుగచేరి, అందలి పుస్తకములు పత్రికలు తెచ్చి తన గ్రామస్తులకు చదివి వినిపించి, తగిన వారిని సభ్యులుగ చేర్పించి గ్రంథాలయము ఉపయోగమును వారు పొందునట్లు చేయగలడు. గ్రంథాలయ నిర్వాహకులును ఉపాధ్యాయులకు గ్రంథాలయములో సులువుగా ప్రవేశము కలుగునట్లుచేసి, తద్వారా లాభమును పొందవలెను. పిల్లలకు అక్షరములు చెప్పుకొనే ఉపాధ్యాయుడు మనకేమి తోడ్పడగలడులే" యని గ్రంథాలయోద్యమ వ్యాపకులాతని ఉపేక్షింపజనదు. అతనిచే సంస్కరింపబడిన పిల్లలే మన ఉద్యమమునకు మూలకారణమగు గ్రంథాలయ పాఠకలోకము. విశేషించి మన మందరము (గ్రంథాలయ ప్రచారకులు) ఒకప్పుడు ప్రాథమికోపాధ్యాయుని శిష్యులమే. తల్లిపాలు త్రాగని ప్రాణిని ప్రాథమికోపాధ్యాయునిచే శిక్షబడయని విద్యావంతుని లోకమున గానము. కావ గ్రంథాలయ నిర్వాహకులు, ప్రచారకులు, ఉద్యమనాయకులు, ఉపాధ్యాయులను తమకు చేదోడు వాదోడుగా నాహ్వానింప వలసియున్నది. ఇప్పటికే అనేక గ్రంథాలయముల అభివృద్ధికి ఉపాధ్యాయులు తోడ్పడి, ఉద్యమమునకు పరోక్షముగా సేవ చేయుచున్నారనుట సత్యము.

గ్రంథాలయమున్న గ్రామములోని ఉపాధ్యాయులను గ్రంథాలయ నిర్వాహకులు తమలోనికి చేర్చుకొనవలెను. ఉపాధ్యాయుడును ఎటులైనను తానందు ప్రవేశము కల్పించు కొనవలెను. తన తీరిక సమయమును గ్రంథాలయసేవ కుపయోగింపవలెను. సామాన్యముగా పాఠశాల సాయంకాల నైదుగంటలకు మూసివేయుదురుగాన అప్పటినుండి గ్రంథాలయములోని పనిని కొంత కాలము నెరవేర్చుటకు తగియుండును. గ్రంథాలయము పాఠశాలకు సమీపములో నుండినచో మిక్కిలి అనుకూలముగా నుండును. ఉపాధ్యాయుడు గ్రంథాలయ కార్యనిర్వాహకుడుగ నుండుటకు పాఠశాల మేనేజరువల్ల పర్మిషన్ పొందవలయునని ప్రత్యేకముగ నిబంధన లేకపోయినను, ప్రభుత్వాధికారులట్టి అనుమతిని కోరుచున్నారు. కాన ఇట్టి ఆటంకమును ప్రభుత్వము రద్దుచేయవలసి యున్నది. సాధారణ సేవావిధానముల ననుసరించి, ఇట్టి అంగీకారమవసరమే అయినను గ్రంథాలయ సేవచేయుట కిట్టి యాటంకముండుట విద్యావ్యాప్తికి భంగకరము. ఉపాధ్యాయులు గ్రంథాలయోద్యమమున కన్నివిధముల సహాయపడుట తమ విధియనియు, తాముచేయు పాఠశాలలోని విద్యా ప్రచారమునకిది అత్యంత సహాయకారి యనియు గుర్తింపవలెను. ఉపాధ్యాయుడు ప్రయోజన విద్యా శిక్షకుడుగా గూడ నున్నచో గ్రంథాలయోపయోగమును తాను, తన శిష్యులు పొందుట తప్పని సరియగును. ఉపాధ్యాయులకు తరిఫీదు నిచ్చు ట్రైనింగు పాఠశాలల యొక్క పాఠ్య ప్రణాళికయందు, గ్రంథాలయ శాస్త్ర ప్రాథమిక విషయములను చేర్చి, ఉపాధ్యాయ విద్యార్థుల హృదయ క్షేత్రములందీ బీజమప్పుడే నాటుట మేలు.

ఇక తన పాఠశాలలో ఈ యుద్యమమున నుపాధ్యాయులు చేయుగల సహాయము మిక్కిలి గొప్పది. వీరు పాఠశాలలలో భావికాలపు పౌరులను తయారు చేయుచున్నారు. గ్రంథాలయము వలని ఉపయోగము, ఉపయోగించుకొను విధములు మున్నగు ముఖ్య విషయములు విద్యార్థులకు బోధించుటయే గాక పాఠశాలలో పిల్లలకు పనికివచ్చు పాఠ వాచకములు, చిన్న చిన్న కథల పుస్తకములు సంపాదించి ఒక చిన్న గ్రంథాలయము నేర్పరచి పిల్లలచే దానిని నిర్వహింప జేయుచుండవలెను. పిల్లలు దీని నొక ఆటగా భావించి ఉత్సాహముతో నెరవేర్తురు. ఇట్టి బోధనయందు గ్రంథాలయములోని పుస్తకముల పట్టికలు తయారుచేయుట, ఎరువిచ్చి తీసికొనుట, పుస్తకముల సరిచూచుకొనుట, బీరువాలలో నమర్చుట మొదలగు ముఖ్య విషయములు విద్యార్థులు తెలిసికొన[illegible] చేయవలెను. ప్రాథమిక పాఠశాలల నిర్బంధ పాఠ్య విషయముల యందిది చేర్చబడి యుండలేదుగాని, పాఠశాల నిర్వహణ విధులలో పాఠ్యేతర విషయముల క్రింద పిల్లల గ్రంథాలయ నిర్వహణమును గురించి స్వల్పముగా ప్రస్తావింపబడియున్నది. ఇంత మాత్రము చాలదు. పాఠశాలల నిర్బంధ పాఠ్య ప్రణాళికలో సివిక్సు పాఠముల క్రింద పిల్లల గ్రంథాలయ నిర్వహణము, ఈ శాస్త్ర ప్రాథమిక విషయ బోధన పాఠములు చేర్చుట మిక్కిలి వాంఛనీయము. పాఠశాలలో పిల్లలచే చిన్న గ్రంథాలయములు నడిపింపజేసిన, ఉపాధ్యాయులు దేశమునకు మహోపకారము చేసిన వారగుదురు.

లోకల్ బోర్డులచే నిర్వహింపబడు పాఠశాలలకప్పుడప్పుడు కొన్ని పుస్తకములు సరఫరా చేయబడుచుండును. మరికొన్ని యితర పాఠశాలలలోను ఉపాధ్యాయుల ఉపయోగము నకై కొన్ని వాచక పుస్తకము లుండును. ఉపాధ్యాయులీ పుస్తకములను పాఠశాల గ్రంథాలయముగా నమర్చి పిల్లలచే నుపయోగింపజేయవలెను. కాని పిల్లలు పాగొట్టె దరేమోనను భయముచే పెట్టెలలో భద్రపరచి వీనిని నిరుపయోగ మొనర్చుట మంచి ఉపాధ్యాయుని లక్షణముగాదు. గ్రంథాలయ పరిచారకులు పాఠశాలలలో పిల్లల గ్రంథాలయములు నిర్వహింపబడు నట్లుగా ప్రోత్సహించుచుండవలెను.

ఈ విధముగా గ్రంథాలయోద్యమమునకు ఉపాధ్యాయులు తోడ్పడినచో, వారుచేయు విద్యా వ్యాపనకిది దోహదమై తద్వారా లోక కల్యాణము చేకూరునని మనవి చేయుచున్నాను.



వయోజనులకు పాఠములు చెప్పుట (పుట 50)



శ్రీ కాశీ నాగేశ్వరరావుగారు



రివరెండ్ యం. కె. ప్రకాశంగారు

# హైదరాబాదు రాష్ట్రమున వయోజన విద్యావ్యాప్తి

### శ్రీ బారు శ్రీనివాసరావు

## ఆరంభయత్నములు

ప్రప్రథమమున 1926 వ సంవత్సరమున వయోజన విద్యా ఉద్యమము ప్రారంభింపబడి 3 రాత్రి పాఠశాలలు స్థాపింపబడెను. హైదరాబాదు నగరమున స్థాపింపబడిన యీ మూడు వయోజన విద్యాపాఠశాలలందు 71 మంది విద్యార్థులు విద్య నభ్యసించుచుండిరి. 1931వ సంవత్సరమువరకే పాఠశాలల సంఖ్య 53 వరకు నెక్కి 2110 మంది వయోజనులు వీనిలో విద్యనభ్యసింపసాగిరి. 1941 వ సంవత్సరమున ప్రభుత్వము వారు మొట్ట మొదటి సారి వయోజన విద్యా వ్యాపకమునకై రు 10,000/ లను ప్రత్యేకించిరి. ఈ మొత్తము నుండి 43 వయోజన విద్యా పాఠశాలలు, 37 పురుషులకు, 6 స్త్రీల కొరకు ప్రారంభింపబడెను. ఈ యుద్యమమెంత వ్యాప్తిచెందవలసియుండెనో యంతటి వ్యాప్తి కాంచలేదు. దీనికి రెండు ముఖ్య కారణములు ప్రజలలో ఉత్సాహము లేకుండుట, వలయునంత ధనసహాయము దొరక నందున ప్రజలలో సక్రమమగు ప్రచారము జరుగక పోవుట. విద్యాశాఖవారు ప్రాథమికవిద్యా వ్యాపక కార్యమున నిమగ్నులగుట వలన గూడ నీ కార్యమంతగా విస్తరింపలేదు. కాని ఆ సంవత్సరముననే ప్రతి సంవత్సరము విద్యావ్యాప్తికై యొసగు గ్రాంటు ఫండునుండి రు 20,168/లు వయోజన విద్యా వ్యాప్తికై యొసంగబడెను. ఈ మొత్తము యిదివరకు స్థాపింపబడిన 43 వయోజన పాఠశాలలలో సక్రమ పద్ధతులపై నడుపుటకును, 34 నూతన వయోజన పాఠశాలలను స్థాపించుటకును వినియోగింపబడెను.

## క్రొత్తస్కీము

1946 వ సంవత్సరమున నొక నూతన ప్రణాళిక సిద్ధము చేయబడెను. దీనివి గురించి వయోజన విద్యా పద్ధతి సక్రమమైన విద్యా ప్రణాళిక ననుసరించవలెననియు, ఒక్కొక్క విద్య రాని వారిపై రూ 4-6-7 వెచ్చించిన, 5 సంవత్సరములలో 28,38,000 నిరక్షరాస్యులు అక్షరాస్యులు కావచ్చుననియు తలంపబడెను. ఆరు నెలల పర్యంతము ప్రచార కార్యమును, ఉపాధ్యాయుల శిక్షణ మొదలైన ప్రాథమిక యత్నములకై రు 5,00,000 లు కావలెననియు, దినమున రెండుగంటలున్న చొప్పున 4 నెలలలో నక్షరాస్యత గాంచ వచ్చుననియు నీ ప్రణాళికయందు సిఫారసు చేయబడెను.

ఇంతేగాక యీ కార్యమున ప్రభుత్వ యత్నములతో బాటు ప్రజాసహాయము కూడ బొందుట కొక సలహా సంఘము (అడ్వైజరీబోర్డు) నొకదానిని స్థాపించి అధికార అనధికార సభ్యులను దీనిలో జేర్చవలెననియు సూచింపబడెను. ఈ బోర్డు విద్యాశాఖ వారికి, వయోజన విద్యా వ్యాప్తికి క్రొత్త ఏర్పాటుల జేయుటకు తమ యభిప్రాయ ముల నొసంగుదురు. ప్రతి జిల్లాలో నొక జిల్లా సంఘమును, తాలూకాలలోను, గ్రామాలలోను, స్థానిక వయోజన సంఘములను స్థాపింపవలెననియు సూచింపబడెను.

ఆ ప్రణాళికలో నీ క్రింద వివరింపబడిన మరి కొన్ని సలహా లొసంగబడెను.

1. ప్రభుత్వోద్యోగములలో క్రింది తరగతికి చెందిన ప్యూన్ మొదలగు ఉద్యోగములకు అక్షరాస్యత కలిగియుండుట ఒక నిర్బంధవిధిగ నేర్పరచవలెను.

2. ప్రభుత్వపు యితరశాఖలవారు కూడ నిరక్షరాస్యతను నిర్మూలించుటకు విద్యాశాఖవారికి తోడ్పడవలెనను నియమ మేర్పాటు చేయవలెను.

3. గ్రామోద్యోగులపై తమ గ్రామములనుండి నిరక్షరాస్యతను తొలగించవలె నను బాధ్యతను మోపవలెను.

4. ప్రతిసినిమా ప్రదర్శనశాలలోను, ప్రతిసినిమా ప్రదర్శనము ప్రారంభించు టకు పూర్వమొకవిద్యకు సంబంధించిన చిన్న ఫిల్ము నొకదానిని తప్పక చూపవలెనను చట్ట మొకదానిని నిర్మించవలెను.

5. యంత్రశాలలు, మిల్లులు మొదలైన కర్మాగారముల యజమానుల నచ్చట పనిజేయు కార్మికుల కొఱకై, అక్షరాస్యతను గాంచు సదుపాయముల కలిగించుట కును, ఇందులకగు వ్యయములో కొంత భాగమును వారు భరించుటకును, ప్రభుత్వము వారిని నిర్బంధించవలెను.

6. అక్షరాస్యతా చట్టము నొకదానిని నిర్మించుటను గూర్చి ప్రభుత్వమువారాలో చించవలెను.

## వయోజన విద్యా కేంద్రములు

1356 ఫసలీ (అనగా అగస్టు 1947 సం॥) అంతమున రు. 50,000ల ప్రతి సంవ త్సర వ్యయమునకును, రు. 75,000 ఒక్కమారిచ్చు మొత్తమును ప్రత్యేకింపబడి విద్యా శాఖ వారికే వయోజన విద్యా వ్యాపకము చేయుటకు ప్రభుత్వము వారవకాశమిచ్చి, ఈ క్రొత్త స్కీము మూలమున నొక ప్రత్యేకపు ఇన్స్పెక్టరు, ఇద్దరు అసిస్టెంట్ ఇన్స్పె క్టర్లు రాష్ట్రమందలి వయోజన పాఠశాలల ఏర్పాటునకు, వాని పనిని సరిచూచుటకు నియోగింపబడిరి. ఒక కేంద్ర సలహా సంఘము, జిల్లా మరియు స్థానిక సంఘములు యేర్పాటు చేయబడెను. నూటఒక్క నూతన వయోజన కేంద్రములు ప్రారంభింపబడెను. ఈవిధముగా 200 వయోజన కేంద్రములు-178 పురుషులకు, 27 స్త్రీలకు స్థాపింపబడెను

ఈ 178 పురుషుల వయోజన పాఠశాలలలో 130 వివిధ జిల్లాలలోను, 48 హైద్రాబాదు నగరమునందును స్థాపింపబడెను. స్త్రీ వయోజన పాఠశాలలు జిల్లాలలో 19, నగరము నందు 8 స్థాపింపబడెను. పై 200 వయోజన పాఠశాలలలో 107 పాఠశాలలలో యిద్దరేసి ఉపాధ్యాయులును, మిగిలిన 93 పాఠశాలలలో ఒక్కొక్క ఉపాధ్యాయుడును పనిచేయు చున్నారు. మొత్తము పాఠశాలలో 314 మంది ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులు పనిచేయుచున్నారు. ఈ పాఠశాలలలో పనిచేయువారు చాలవరకు ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులే. ఈ ప్రత్యేకపు పనిచేసినందులకు వారికి నామకః కొంత ద్రవ్యము (అలవెన్సు రూపమున) ఒసగబడును.

రాజకీయ సంబంధమగు అలజడులవలన చాల వయోజన విద్యా కేంద్రములు మూయబడెను. అందువలన నిట్టి వానిని అంతకన్న ప్రశాంతముగానున్న యితర స్థానములకు మార్చవలసి వచ్చెను. కిరోసినాయిల్ సక్రమముగా దొరకక యిబ్బందులు కలిగెను. కొన్ని చోట్లలో నీ కారణము వలన రాత్రి పాఠశాలలు మూసివేసినట్లు కూడ మాకు తెలియజేయబడెను.

1948 సం॥ (అనగా 1947 సెప్టెంబరు నుండి 1948 వరకు) 11,397 విద్యార్థులు విద్యనభ్యసించిరి. వారిలో 4296 నియమిత పరిశాలికను పూర్తిచేసి పరీక్షయం దుత్తీర్ణులైరి. 1949 సంవత్సరము (అక్టోబరు 1948 నుండి సెప్టెంబరు 1949 వరకు) 9295 వయోజనులు విద్యనభ్యసించి 4,265 మంది అక్షరాస్యతా పరీక్షయందు త్తీర్ణులైరి. ఈ విధముగ గత రెండుసంవత్సరములలో 20,692 వయోజనులు, 19,466 పురుషులు 1226 స్త్రీలు విద్యనభ్యసించి 7945 పురుషులు 616 స్త్రీలు అక్షరాస్యతా పరీక్ష యందుత్తీర్ణులైరి. ఈ సంఖ్య దేశజనాభాను బట్టి తృప్తికరము కాదనుట సత్యమే. దేశములోని అశాంత పరిస్థితులు మున్నగు కారణములును, ప్రచారము సక్రమముగా జరుగనందునను వలయునంత ఫలితము గానరాదు. కాని పాఠశాలల సంఖ్యను బట్టి అందభ్యసించువారి సంఖ్యయు జరిగిన కార్యమును గోచరింపజేయును. కాని నీని మూలమున ఎన్నోచోట్లనుండి వయోజన పాఠశాలల స్థాపింపుడని యంతో ఒత్తిడి చేయుచున్నారు. ఇదియు ప్రోత్సాహకరమే. ప్రజలలో నిట్టి కోరికజనించిన తరువాత నిట్టి వయోజన పాఠశాలలు స్థాపింపబడుననియు నా యాశయము.

## అక్షరాస్యతా ప్రమాణము

అక్షరాస్యత రాష్ట్రమునందు ముఖ్యముగా భాషింపబడు ఉర్దూ, తెలుగు, మరాఠీ, కన్నడ భాషలలో నేదైనా నొక భాషలో కావింపబడును. అక్షరాస్యతకై నీ క్రింద నుదహరింపబడిన సమర్థత ఉండవలెను.

1. సామాన్య వాక్యములు, ఒక కథకుగాని, లేక లేఖకు గాని సంబంధించినవి చదువ గలుగుట.

2. సామాన్య ప్రశ్నలకు ప్రత్యుత్తరములు వ్రాయగలుగుట
3. సామాన్య లేఖలు, దరఖాస్తులు వ్రాయగల్గుట
4. ఒక చదివిన కథనుగాని, విన్న కథనుగాని తప్పులు లేకుండ చక్కగా చెప్పగల్గుట.
5. 100 వఱకు సంఖ్యల చిన్న లెక్కలు చేయుట.
6. ఈ పైజెప్పిన మూడు విషయములు, వ్రాయుట, చదువుట, లెక్కలు చేయుట యేగాక ప్రపంచ జ్ఞానమునకు సంబంధించిన ముఖ్య విషయములు, సాంఘిక విద్యయు సాధ్యమైనంత వరకు ఒసగబడును.

ఈ వయోజన పాఠశాలలలో చదువు విద్యార్థుల వయస్సు 14 నుండి 40 వరకు నుండును. స్త్రీలకు గృహసంబంధమగు విషయములును, శిశుపోషణకు సంబంధించిన విషయములును జెప్పుదురు. దృష్టిమూలమున విద్యనభ్యసింపజేయుటయు వయోజన విద్యా భాగమగుటచే, ఒక 16 M. M. సినిమా ప్రొజెక్టరుతో సమర్పబడిన మోటారు వ్యాన్, కొన్ని విద్యా సంబంధమగు ఫిల్ములు, స్ట్రిప్ ఫిల్ములు, మైక్రో ఫోన్ మున్నగునవి కొనబడినవి. ప్రచారమునకైగూడ తగుయత్నములు జరుగుచున్నవి.

## పాఠ్యగ్రంథములు

వయోజన విద్యకై ప్రత్యేక ఉర్దూ పాఠ్యగ్రంథ మొకటి, సుజ్దాదు మీర్జా ఎడ్యు కేషనల్ సెక్రటరీగారి యభిప్రాయము ననుసరించి వ్రాయబడి ఉపయోగములో నున్నది.

తెలుగులో, క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటీవారిచే ప్రచురింపబడిన పెద్దల విద్య యను పాఠ్యగ్రంథము మూడు భాగములు, సుందరయ్యగారు వ్రాసిన గ్రంథము ఉప యోగములోనున్నవి. మహారాష్ట్ర కన్నడ భాషలలో బొంబాయి, మైసూరు రాష్ట్ర ములలో నుపయోగములో నున్న పాఠ్యగ్రంథములే యీ రాష్ట్రమున గూడ నుపయో గింపబడుచున్నవి.

14 నుండి 45 సంవత్సరముల వయస్సులోనున్న నిరక్షరాస్యులు మాత్రమే వయోజన విద్యా పాఠశాలలలో చేర్చుకొనబడుదురు. వీరే భాషలోను అక్షరాస్యులు కారని స్థానిక సంఘాధ్యక్షునిచే రూఢి పరుపబడవలెను. కొద్దిగా చదువగలిగి అక్ష రాస్యతా ప్రమాణమునకన్న తక్కువగానున్న వయోజనులను గూడ నీ పాఠశాలలలో జేర్చుకొందురు.

## పరీక్ష

పై జెప్పబడినట్లు దీని పరిమితి నాలుగు నెలలు మాత్రమే. ఈ కాల పరిమితి పూర్తికాగానే పరీక్షచేసి ఉత్తీర్ణులకు యోగ్యతా పత్రములనిచ్చెదరు జిల్లా సంఘ, లేక స్థానిక సంఘాధ్యక్షుడుకాని, ఆతనిచే నియమింపబడిన యితర దే పరీక్ష

కుడైన, అక్షరాస్యతా పరీక్షను చేయును. పరీక్షకుడు మొట్టమొదట విద్యార్థులతో వారి యోగ్యతను లోకజ్ఞానమును గుర్తెరుగుటకు వారితో సంభాషించును. రిజిస్టరులను పరీక్షించి వారు పాఠశాలలో జేరుటకు ముందు నిరక్షరాస్యులే యని రూఢి పరుచు కొనవలెను. నియమితమగు విషయములలో నొక సామాన్యమగు పరీక్షను (అనగా పాఠశాలల పరీక్షవంటిది కానిది) చేయును.

## అక్షరాస్యతానంతర విద్య

'ఖుషీక్లబ్' అను పేరుతో వయోజనులు సాధించిన అక్షరాస్యతను నిలుపుటకు వారికి చిన్న చిన్న పుస్తకముల చదువుట కవకాశము కల్పించుటకు సామాన్య గ్రంథాలయములు స్థాపింపబడును. ఈ క్లబ్బులు పఠనాలయములుగను, క్రొత్తగా విద్య నేర్చిన వారికి తగిన జ్ఞానము నొసగుట కనువగు చిన్న చిన్న పుస్తకములుగల గ్రంథాలయములుగను యేర్పాటు చేయబడును. ప్రతి సాయంత్రము వీరిచ్చటజేరి పుస్తకముల జదువుటకును, అప్పుడప్పుడు వీరికొరకేర్పరచబడు కొన్ని సంభాషణలలో పాల్గొనుటకును అవకాశము లేర్పఱుపబడును. ఇట్టి కేంద్రముల నాకర్షణీయ మొనర్చుటకు కొన్ని చిన్న చిన్న ఆటలనాడు కొనుటకు కూడ నేర్పాటు చేయబడును. వీనైన నిట్టి కేంద్రములందు రేడియోలనుగూడ నేర్పాటుచేయవలెనను యత్నములు జరుగుచున్నవి.

## ఉపాధ్యాయ శిక్షణ

ఇట్టి వయోజన పాఠశాలలలో బనిచేయు ఉపాధ్యాయులకు ప్రత్యేక శిక్షణ మొసగుట చాల యవసరము. జూన్ 1947 వ సంవత్సరమున నిట్టి ఉపాధ్యాయులకు శిక్షణ యొసంగబడెను. వీరికి నేర్పబడు విషయముల ప్రణాళిక సిద్ధము చేయబడి హైదరాబాదు పట్నములోను, యితర జిల్లాలలోను గల ట్రైనింగు స్కూళ్లలోనివి యేర్పాటుచేయబడెను. ఆసమయమున 177మంది పురుషులును, 30మంది స్త్రీలును పాల్గొనిరి. దీనికై రు 1701-1-8 వ్యయమయ్యెను. ఈ శిక్షణగాక వయోజన విద్య ఇన్స్పెక్టరుగారు హైద్రాబాదు నగరమందలి ఉపాధ్యాయినుల ట్రైనింగు స్కూలులో కొన్ని ఉపన్యాసముల నొసంగి స్త్రీలకు వయోజనవిద్య శిక్షణము నొసగి యుండిరి. ఈఉపన్యాస కార్యక్రమములో 62 మంది ఉపాధ్యాయినులు 8 మంది యితర స్త్రీలు పాల్గొని యుండిరి.

మే 1948లో మరియొక కొద్దిదినముల పరిమితిగల శిక్షణ యొసంగబడెను. ఈ శిక్షణ ఎడల్ట్ ఎడ్యుకేషన్ ఇన్స్పెక్టరుగారి చేతను, వారి యిద్దరు అసిస్టెంట్లచేతను ఒసగబడెను. 55 మంది ఉపాధ్యాయులు, ఉపాధ్యాయేతరులు దీనిలో పాల్గొనిరి.

హైద్రాబాదు పీపుల్స్ ఎడ్యుకేషన్ కాన్ఫరెన్సువారి సహాయమున గూడ కొంతమందికి వయోజన ఉపాధ్యాయ శిక్షణ యొసగబడెను.

క్రొత్త స్కీము ననుసరించి ఒక బెడ్‌ఫోర్డువ్యాన్, ఎపిడయాస్కోప్, టాకీ మరియు మూకీ ప్రొజెక్టరు, 11 ఫిల్ములు కొనబడెను. కాని 1948 వ సంవత్సరము నుండి యింతవరకును పెట్రోలునకు, డ్రైవరు నేర్పాటు చేయుటకు ప్రభుత్వపు గ్రాంటు దొరకనందున ప్రచారపు పని జరుగలేదు. అందువలన మోటారు వ్యాన్ ప్రొజెక్టరు సరియగు విధమున నుపయోగపడలేదు. కాని యిన్స్పెక్టరు అతికష్టముమీద 14 ఫిల్ము ప్రదర్శనములు పట్టణములోని వివిధ ప్రాంతములలో నేర్పాటు చేసిరి.

## ప్రచారము ప్రకటన

ఈ కార్య ప్రకటనకును, ప్రచారము కొరకును మొట్టమొదట ప్రభుత్వమునకు నివేదించిన ప్రణాళికలో ఆరుమాసముల పర్యంతము వయోజన ప్రచారమున కనువగు పరిస్థితులను కలిగించుటకు కొంతధనసహాయము కోరబడెను. కాని దీనికి వలయుధనము లభించక యీ కార్యము కొనసాగలేదు. అయినను తమ కలిమి యగునంతవరకు వయోజన విద్యా పాఠశాలలే కొంత ప్రచారమును సాగించినవి. పాఠశాలలలో పబ్లికు మీటింగు లేర్పాటుచేసి, గోడలకు పోష్టర్ల నంటించియు, కరపత్రముల పంచియు కొంత ప్రచారము చేయబడెను. ఇన్స్పెక్టరు, అతని అసిస్టెంటులు తమ సంచారములలో వివిధ ప్రాంతములలో వయోజనవిద్యావశ్యకతను గూర్చి ప్రజలలో ప్రబోధమును జేసిరి. మొత్తముమీద ఇటువంటివి రమారమి 150 ఉపన్యాసము లొసగబడెను. సుమారు 13000లకు తక్కువగాకుండ ప్రజలీ ఉపన్యాసములలో పాల్గొనిరి. ఇదిగాక ఆయా ప్రాంతములలోని ఉద్యోగులతోను ప్రముఖులతోను కలిసి యీ కార్యమునకై వారి సహాయ మర్థింపబడెను. వివిధ సమయములందు (Exhibitions) ప్రదర్శనములలో వయోజనవిద్యా సంబంధ ప్రదర్శములు యేర్పాటు చేయబడెను. రేడియో ప్రసంగములు కూడా హైద్రాబాదు రేడియో నిలయమునుండి యేర్పాటు చేయబడెను.

## భవిష్యత్తును గూర్చి ఒక విన్నపము

అక్షరాస్యత యెంతో ముఖ్యమైనదైనను ప్రజలలో లోకజ్ఞాన చైతన్యమును కలిగించుట యెంతో అవసరము. కావున పై నుదహరింపబడినట్లు వయోజనుల క్లబ్బుల నేర్పాటుచేయుట యెంతో అవసరము.

ఈ వయోజనుల కొరకై సరియైన సాంఘిక సభ్యతా విషయముల గూర్చి చిన్న చిన్న పుస్తకాలను వ్రాయవలెను. ఈ గ్రంథములు నూతనముగా విద్య నార్జించిన వారియందుబాటులో నుండవలెను. లేకున్న బజారులలో దొరుకు నిరుపయోగమగు పుస్తకముల జదివి వీరు తప్పుత్రోవల ద్రొక్కవచ్చును. వీరికి తగిన వార్తా పత్రికలను ప్రచురించుటయు చాలముఖ్యము. ప్రతి జిల్లాలో ప్రచారము నకొరకు ప్రొజెక్టరు [illegible]

ఉండవలెను. యేర్పాటులతో నుండు మోటారు వ్యాన్, రేడియోలోకూడ వీరికి తగు ప్రోగ్రాముల నేర్పాటు చేయించవలయును. ప్రచారమునకై కొంత ద్రవ్యమును ఇన్స్పెక్టరుకొసంగవలెను. పై నుదహరింపబడిన ప్రణాళికల ననుసరించి ద్రవ్యసహాయమును చేయవలెనని ప్రభుత్వమును ప్రార్థింపవలెను.

దేశమంతటిని అక్షరాస్యం చేయవలెనన్న కార్యము సులభమైనదికాదు. జన సామాన్యము నందలి మాంద్యతను, నూతన కార్యములపట్ల సహజమగు ప్రజా వ్యతిరేకతను ఎదుర్కొనవలసి యుండును. గ్రామాధికారులు మున్నగువారు కూడ నిట్టి విద్యా వ్యాపకమును నిరోధింప యత్నించుటయు సహజము. ఎందుకనగా ఎంతోకాలము నుండి వీరనుభవించుచున్న ప్రాధాన్యత ఇట్టి జనసామాన్య విద్యవలన తొలంగునన్న భీతియే దీనికి కారణము. అట్టి వ్యతిరేకతనుగూడ నెదుర్కొన వలసియుండును. వ్యాపార శ్రేణికి జెందిన ధనాధికులుగూడ నీ ప్రయత్నమునకు వలయునంత సహాయము చేయరు. చాలమంది విద్యావంతులు కూడ విద్యరాని తమ సేవకులను ఇట్టి పాఠశాలలకు బంప వెనుకాడెదరు.

అందువలన పెద్దగాని చిన్నగాని, ధనవంతుడుగాని బీదవాడుగాని మన దేశములో నున్న ప్రతి వ్యక్తియు విద్యనేర్వ నంత వరకు మనదేశ మభివృద్ధికి వచ్చి మనము వృద్ధిచెంద జాలమని గుర్తించవలెను. కార్యాలయముల, మిల్లుల అధికారులుకూడ ప్రజలు తమ విధులను బాధ్యతలను గుర్తెరిగి మెలగ నంత వరకు వారి ద్రవ్య ముపయోగపడదని గ్రహించ వలెను. వయోజనవిద్యవలననే పై యాశయములు నిర్వహింపబడును. ప్రభుత్వము తనకు చేతనైనంత సహాయము చేయును. కాని యే కార్యమునందు ప్రభుత్వమునకు ప్రజలెట్టి సహాయము చేయవలెనో గుర్తింపకున్న అవసరమగు అభివృద్ధి యెన్నడును పొందలేము. అందులకై తామందరును శక్తి వంచన లేకుండా ఈ సదుద్యమమునకు సహాయ పడవలసినదిగ ప్రార్థించుచు యింతటితో విరమించుచున్నాను.

# వయోజన విద్యా ప్రచారము

## శ్రీ నన్నపురాజు వెంకటసుబ్బారావు

ఏ వుద్యమమైనా ప్రజలలో త్వరగా చొచ్చుకుని వెళ్ళవలెనంటే ఏసిద్ధాంతాలైనా ప్రజానీకంలో వ్యాపించాలంటే ప్రచారం మంచి సాధనం. ఈ సత్యాన్ని గుర్తించి మత ప్రవక్తలు వారి మత సిద్ధాంతాలను, రాజకీయవేత్తలు వారివారి పార్టీల మూలసూత్రాలను ప్రజా బాహుళ్యానికి అందజేయటానికి చక్కని ప్రచారం చేస్తూ వుంటారు.

ఆధునిక యుగంలో పాశ్చాత్యులు ప్రచారాన్ని ఒక కళగా ఒక శాస్త్రంగా అభివృద్ధిపరచారు. వాటివలన కలిగే సత్ఫలితాలను పొందుతున్నారు.

పెద్దల విద్య నేడు మన దేశంలో ముఖ్యమైన సమస్య. వయోజన ఓటింగు సద్వినియోగం కావాలంటే పెద్దలంతా చదువుకోవాలి. పెద్దల దృష్టి చదువుల వైపుకు మరలినగాని వారి పనికి పూనుకోరు. వారిదృష్టిని ఆకర్షించే శక్తి ప్రచారంలో వుంది. కనుక యీ ఉద్యమానికి ప్రచారం మొదటి మెట్టు. పెద్దల విద్యావ్యాప్తికి ప్రచారం ముఖ్య సాధనం.

ప్రచారం బహుముఖాలుగా చేయవచ్చు. స్థానిక వసతులనుబట్టి, అభిరుచులనుబట్టి, అవసరాలనుబట్టి ప్రచార పద్ధతులు కూర్చుకొంటూ ఆశించిన ప్రయోజనాన్ని పొందవచ్చు. పల్లెప్రాంతాలలో ప్రచారం ఒక పద్ధతిలో ఉంటే, పట్టణ వాసాలలో అదే ప్రచారం వేరొకపద్ధతిలో ఉండవలసిన అవసరం కనబడుతుంది. సభలు, సమావేశాలు పట్టణాలలో పనిచేసినంతగా పల్లెలలో పనిచేయవు. నగర సంకీర్తనలు, ప్రచారయాత్రలు, యితర వూరేగింపులు పల్లెలలో పనిచేసినట్లు పట్టణాలలో అంత ఆకర్షణీయంగా ఉండవు. వయోజనవిద్యా వారములు, మొత్తంమీద అన్నిచోట్ల ఒకే ప్రయోజనాన్ని యిస్తవి. సభలు, సమావేశాలు సరియైన ప్రయోజనాలు యివ్వాలంటే ఈ రోజులలో ఆయా సమావేశాల చివర వైజ్ఞానిక ప్రదర్శనాలుండటం అవసరం. బుర్రకథలు, జముకులకథలు, హరికథలు, నాటకాలు మొదలైన పెద్ద ప్రోగ్రాములు, జంతరపెట్టె, బైరాగులవేషం, పకీర్లవేషం, ప్రహసనాలు, నాటికలు, తదితర హాస్యప్రదర్శనలు లాటి చిన్న ప్రోగ్రాములలో ఏవో కొన్నైనా సమావేశ కార్యక్రమంలో వుంటే ప్రేక్షకులు నిండుగావుంటారు. ఇక సినిమా ప్రొజెక్టర్లద్వారా, మేజిక్‌లాంతర్లద్వారా ప్రదర్శనాలుకూడా వుంటే పల్లెలలోని ప్రజలు బాగా ఆకర్షింపబడతారు.

ఈ పై సాధనాలు కేంద్రమునకు రాని ప్రయోజనులను కేంద్ర మునకు ఆకర్షించుటయే కాకుండా, కేంద్రానికి వస్తూవున్న ప్రయో జనులు జారిపోకుండా చూడడానికి కూడా ఉపయోగపడతాయి. ప్రచారానికి సామగ్రి అవసరం. సామగ్రిలో మొదటి స్థానం సమర్థుడైన ప్రచారకుడు. చలాకీ, ఉత్సాహం, పట్టుదల, సహనం ప్రచారకుని ప్రధాన లక్షణములు. ఆతని కంఠస్వరం మధురమైనదిగా, పెద్దదిగా నుండవలెను. భాష నిర్దుష్టంగా, సరళంగా ఉండవలెను. ఈ పై లక్షణాలుగలిగిన ప్రచారకుడు ఏకార్యమునైనా సాధించగలడు. ప్రయో జనులను ఆకర్షించగలడు.

సామగ్రి అన్నప్పుడు యితర పరికరాలుకూడా వస్తాయి. ప్రచార పద్ధతులనుబట్టి పరికరాలు కూడా మారుతూ ఉంటాయి. ఎలాంటి ప్రచారానికైనా మేగఫోను, నినాదపు అట్టలు, గ్రామఫోను అవసరం. మేగఫోను షుమారు ¾ గ. పొడవు, 1 అడుగు వ్యాసము గల ధ్వని ప్రసారకోన నోటివద్ద వుంచుకొనే రంధ్రం ½ అంగుళం నుండి ¾ అం. వరకు వుండవచ్చును. ఇక నినాదపు అట్టలు 1 అ. వెడల్పు 2 అ. పొడవుగల కార్డుబోర్డు అట్టలుగాని, మేదరతడికెలుగాని సంపా దించి, వాటిపై పాతవార్తా పత్రికలు అంటించి, మామూలు సిరాలో ప్రచారనినాదాలను వ్రాయవచ్చును. వాటిపైని తెల్లటికాగితములు అంటించి నల్లసిరాతోగాని, లేక వార్నీషుతోగాని కావలసిన నినాద ములు వ్రాసి తయారు చేసికొనవచ్చును. ఇవి ఊరేగింపులలో తీసికొని వెళ్లవచ్చును. సమావేశములలో వాటిని అనువైన ప్రాంతాలలో పాతటముగాని, గుంజలకు కట్టటముగాని చేస్తే బాగుంటుంది. ఇవి ప్రచారానికీ, అలంకారానికి ఉపయోగిస్తవి.

నినాదపు అట్టలపై వ్రాయడమేగాకుండా వాటికి ప్రత్యేక ప్రయోజనం వుంది. ఊరేగింపులో, తక్కిన సమావేశాలలో వీటిని చక్కగా ఉపయోగించవచ్చు. జాతీయ నినాదములు ఒకటి రెండు యిందు ప్రవేశపెట్టి తరువాత ప్రచార నినాదములు ప్రవేశపెట్టటం బాగుంటుంది. మచ్చుకి కొన్ని దిగువయిస్తాను.

బోలో స్వతంత్రభారత్ కీ – జై
మహాత్మగాంధీకి – జోహార్ జోహార్
పండిత్ నెహ్రూ – జిందాబాద్
ప్రజారాజ్యం నిలవాలంటే – పెద్దలంతా చదవాలి
పెద్దల చదువు – పిల్లల మేలు
పెద్దల చదువు – ప్రజల ఐక్యత

ఈవిధంగా ఒక్కొక్క సమస్యా పరిష్కారం ఒక నినాదంలో ధ్వనించే లాగుండాలి. స్థానిక సమస్యలను వయోజన విద్య ఏవిధంగా పరిష్కరిస్తుందో యీ నినాదాలలో సూచిస్తూవుండాలి. నినాదాలిచ్చే పద్ధతులు కొన్ని ఉన్నాయి. ఒక పద్ధతి ఏమంటే ముఖ్య ప్రచారకుడు నినాదం అంతాపలికితే, మిగిలినవారంతా కలసి ఒక్కటిగా దాన్ని పలకాలి; ఇక రెండవ పద్ధతి ఏమంటే నినాదాన్ని అర్థయుక్తంగా 2 భాగాలుగా చేసి, ఒక భాగాన్ని ప్రచారకుడు పలికితే మిగతా భాగాన్ని తక్కిన వారంతా ఒక్కటిగా పలకాలి. మరొక పద్ధతి ఏమంటే మొదటి భాగాన్ని ప్రచారకులలో ఒకవరుసలోనున్న వారందరూ పలికితే, 2 వ భాగాన్ని 2 వ వరుసలో నున్న వారందరూ పలకాలి. ఈ మూడు పద్ధతులు కాక మరొక పద్ధతికూడా వుంది. ఆపద్ధతిలో నినాదస్వరూపమే మారుతుంది. ఒక వరుసలోని వారు అందరూ కాని, లేక ఒక్కరు కాని ఒక ప్రశ్నరూపంలో ఉన్న నినాదమును పలికితే, మరొకవరుసలోనున్న వారందరూ సమాధానరూపంలో మరొక నినాదమును పల్కెదరు.

మచ్చుకు కొన్ని నినాదాలు :

పెద్దలంటే యెవ్వరు? యీడు ముదిరినవారలు
పెద్దల చదువు ఎన్నాళ్లు? పెద్దల చదువు నాల్నెల్లు
పెద్దలు చదివేదెందుకు? బుద్ధులు మారేటందుకు
బుద్ధులు మారేదెందుకు? అందరు కలిసేటందుకు
అందరూ కలిసేదెందుకు? స్వరాజ్యం నిలిచేటందుకు.

ఇంక ప్రచార గేయాల విషయంలో కొన్ని ముఖ్యవిషయాలు గమనించాలి. సులభశైలిలోను, ఆకర్షణీయంగాను, తేలికగా అనుకరించటానికి వీలుగాను ఉంటూ ప్రాంతానికి సరిపోయినవిగా కూడా వుండాలి. మనం ఒక పాదమును పాడుతూ వస్తూవుంటే స్వల్పకాలంలో ఎదుటను కలుసుకొనబోయే వ్యక్తివద్దకు వచ్చేసరికి భావం పూర్తిగా వింపబడాలి. ఇటువంటివి విరివిగా వ్రాయఃబడి ప్రచారము గావింపబడుతూ వుండాలి. పశువులకాపరికూడా దాని భావం తెలుసుకొని దాని మాధుర్యాన్ని అనుభవించ గలగాలి.

ఇంక ప్రదర్శనములు. ఇవి కేవలం చిత్రకళా ప్రదర్శనములుగా వుండాలి. బొమ్మనుచూచిన వెంటనే భావం అర్థమవాలి. ఆభావాన్ని ప్రక్కనే వ్రాసియుంచడం మంచిది. ఇవి లోకజ్ఞానం, భాష, గణితమునకు సంబంధించినవై వుండవచ్చు. ఇటువంటి ప్రదర్శనములవల్ల ఎక్కువ మేలు చేకూరుతుంది.

ఈ ప్రచార పద్ధతులను నేర్పుతో నిర్వహిస్తూ, వయోజన విద్యా బోధకులు, వయోజన విద్యా ప్రచారకులు వారి వారి ప్రాంతములలోని వయోజనులందరి దృష్టిని చదువులవైపుకు మరల్చి, వారిని చదువరులుగా తయారు చేస్తారని విశ్వసిస్తున్నాను.

# ప్రభుత్వవయోజన ఉపాధ్యాయ శిక్షణ కేంద్రము నిత్య దినచర్య - కొన్ని ప్రత్యేకతలు

శ్రీ ఆత్మకూరి రాఘవాచార్యులు

వయోజన పాఠశాలలో ఉపాధ్యాయులుగా నుండుటకు ఉపాధ్యాయ శిక్షణ తరగతులు 1948 జులైలో మొదట పెట్టబడి నేటివరకు సాగుచున్నవి. ఈ కేంద్రము సర్కారు జిల్లాలలో మొదటగా వేటపాలెమునందును, తరువాత అనకాపల్లి, గుంటూరు, పటమట లంకయందును జరిగినవి.

పాఠశాల స్థాపనకు, అది నడుపదగు కార్యక్రమమునకు ఎక్కువ సూచనలను విద్యాశాఖాధికారులీయలేదు. పాఠ్యప్రణాళిక మాత్రమే తయారు చేయబడి ప్రచురించబడినది. కాని మొదటి సారిగా వయోజన విద్యాకేంద్రముల యందు ఉపాధ్యాయుల మానసిక స్థితినిబట్టి, వారి అభిరుచుల ననుసరించి, పాఠశాల కార్యక్రమము, ఒక నిర్ణీత ఆకారానికి మారుతూ వచ్చింది. మొదట సర్కారు జిల్లాలలో పనిచేయుటానికి శిక్షణ పొందినవారు శ్రీ నర్రావుల వెంకటసుబ్బారావుగారు, శ్రీ పరిగె వెంకట రమణరావుగారు. వీరుభయులు 'స్కౌటు' గా శిక్షణ పొందినవారే. అందువలన 'స్కౌటింగ్', 'సిటిజన్‌షిప్పు' లలోని ఎన్నో అంశాలు కేంద్రానికి కూడ చేర్చారు. మామూలు పాఠాల బోధనకాలం ౫ గంటలు పోగా మిగిలిన కాలాన్నంతా నేర్చుకోతగ్గ, అనుసరించతగ్గ 'స్కౌటింగ్' అంశాలతో నింపివేశారు. తరగతిబోధన రోజు వొకటికి ౫ గంటలు జరిగే విధానాన్ని గురించి ఎక్కువగా చెప్పనక్కరలేదు. అది మామూలు పాఠశాలల మాదిరే. ప్రభుత్వము వారిచ్చిన పాఠ్య ప్రణాళికను నోటితో చెప్పే బోధన ద్వారా పూర్తి చేస్తున్నాము. వీలైనచోట అందుబాటైనచోట ప్రత్యేక నిపుణులు దొరికితే వారిచేత ఉపన్యాసాలిప్పించి కొంత భాగం పూర్తిచేయించడం కూడా ఉంది. ఉదాహరణకు డాక్టర్లచేత ఆరోగ్యానికి ప్రథమ చికిత్సకు సంబంధించిన విషయాలు, చరిత్రలో నిపుణులచే చరిత్రాంశాలు, దేశ సంచారులచే మనదేశంలోని యాత్రాస్థలాలు మొదలైనవి. రాజకీయాలకు, అర్థశాస్త్రానికి సంబంధించిన విషయాలు సాధారణంగా శ్రీ గాడిచర్లవారే పూర్తిచేస్తూ, శిక్షణ పొందే ఉపాధ్యాయులకు, శిక్షణ నిచ్చే ఉపాధ్యాయులకు కూడా శిక్షణ యిస్తూ వుంటారు. ఈ వయోజన శిక్షణకు వీరు పరమ గురువులు. మిగిలిన విషయాలు పూర్తి చేయటానికి కూడా కొన్ని కష్టనిష్ఠురాలకు పాల్పడవలసి వస్తూ ఉంది. ఈ కేంద్రాలు సంచార కేంద్రాలు అవటంవల్ల, క్రొత్తగా స్థాపించబడటంవల్ల మామూలు విషయ బోధనకు, విషయ గ్రహణకు కావలసిన మ్యాపులు వగైరాలు ప్రభుత్వంవారు సప్లయి చేయలేదు. స్థానికంగా ఉన్న ఏ ఉన్నత పాఠశాల వారినో ఆశ్రయించి కావలసిన పరికరాలు పొందటం ఆచారం అనుశ్రుతం అయిపోయింది. కాకపోతే ఈ కేంద్రాల నిరీక్షకులయిన శ్రీ గాడిచర్లవారు గ్రంథాలయోద్యమానికి కూడా పితామహులు అవటంవల్ల సాధారణంగా ఒకపెద్ద గ్రంథాలయాన్ని అంటి పెట్టే కేంద్రాన్ని ఏర్పాటు చేస్తూ వచ్చారు. అందువల్ల రిఫరెన్సుకు కావలసిన పుస్తకాలు అక్కడ నుండి పొందుతూ వచ్చాము. తద్వారా ఆంధ్రదేశంలో పేరు పడ్డ గ్రంథాలయాలను చూచేభాగ్యం మాకు లభించింది.

ఈ ౫ గంటలకాలం పోగా మిగిలిన కార్యక్రమంలోనే మొదట పేర్కొన్న ప్రత్యేక లక్షణాలు అన్నీ యిమిడి ఉన్నాయి. ఉదయాన ౫ గంటలకే అందరు నిద్ర లేవాలని నియమం. కాలకృత్యాలు పూర్తిచేసుకొని ౬ గంటలకల్లా ప్రార్థనకు, జెండా వందనానికి హాజరవాలి. జెండా ఎగురవేసే పద్ధతులు, దాన్ని గౌరవించడాన్ని గురించి, పరోక్షంగా ఇక్కడ శిక్షణ లభిస్తూ ఉంది. 7-30 గంటలకు మామూలు తరగతులు

ప్రారంభం. 10-30 గంటలకు సమాప్తం. విషయ బోధనకు కావలసిన పరికరాలు ఎక్కువగా విద్యార్థులవల్ల ఉపాధ్యాయుల వల్ల తయారు చేయబడ్డవి. మరల 2-30 గంటలకు తరగతులు ప్రారంభమై 4-30 గంటలకు పూర్తి అవుతుంది. ముఖ్యంగా ఉపాధ్యాయ విద్యార్థులు ఈ దిగువ అంశాలలో కావలసిన యోగ్యత పొందటానికి క్రమ తీసుకో బడుతుంది. 1. భాషాబోధనకు కావలసిన పరికరాలుతయారుచేయడం 2. విద్యాబోధనలో సమర్థత. 3. సభలు సమావేశాలలో పొందికగా మాట్లాడ గల్గటం 4. మాజిక్ లాంతరుకు స్లైడ్స్ తయారు చేయడం, పెట్రోమాక్సు దీపాలు, గ్రామఫోనులు బాగుచేయ గల్గడం; చివర విషయాన్ని బోధించటానికి ప్రత్యేక నిపుణుణ్ణి నియమిస్తూ ఉంటారు.

ఇక 10-30 నుండి 2-30 గంటల వరకూ శిక్షణ పొందేవారు నిద్రించ టానికి వీలులేదు. భోజనాలు వగైరాలు 11-30 గంటలకు పూర్తి. ఆపైన 1 గంట విశ్రాంతి. తరువాత విరామకాల కాలక్షేపాలు. ఈ కాలంలో శిక్షణ పొందే విద్యార్థుల అభిరుచి ననుసరించి రకరకాల కార్యక్రమం ఏర్పాటు చేయబడింది. చేరి పనులు చేయటం, బోధనోపకరణాల తయారు, నూలు వడకటం, వాడుక హిందీ భాష నేర్వడం మొదలైన అంశాలన్నీ ఇమడ్చ బడ్డాయి. సాయంత్రం స్కూలు పూర్తి అవగానే ఏ మైదానానికో పోయి దేశీయములైన ఆటలు ఆడటం, కొద్దిపాటి కసరత్తు, సూర్య నమస్కారాలు జరపడం ఆచారాలు; పూర్తి అయిన తరువాత సాంఘిక సమావేశాలు జరిపి ఒక్కొక్కరి వద్దనున్న ప్రత్యేకాభిరుచులు గ్రహించి వాటిని అభివృద్ధి చెందించ టానికి మార్గాలు అన్వేషించడం జరుగుతుంది. మొదటి రెండువారాలు సాధారణంగా మాదిరి పాఠశాలలు జరుగవు.

ఆ కాలంలో రాత్రి సమావేశాలు 8 గంటలు మొదలు 10 గంటల వరకు ఏర్పాటు చేయబడుచూ ఉన్నవి. అప్పుడు ఒక్కొక్కరోజు ఒక్కొక్క విషయాన్ని గురించి చర్చించ బడుతుంది. తద్వారా పరోక్షంగా సభలు - సమావేశాలలో పాల్గొనే రీతులు, అందు ప్రవర్తించవలసిన విధం అధ్యక్షత వహించి కార్యక్రమాన్ని నడపటం, మొదలైన అంశాల్లో శిక్షణ ఇవ్వబడుతూ ఉంది. కొన్ని కొన్ని సభలకు విద్యార్థులనే అధ్యక్షులుగా ఎన్నుకోవడం కూడా జరుగుతూ వుంటుంది.

మొత్తం పాఠశాల నిరీక్షణ నిర్వహణ కూడా, ప్రజాతంత్ర పద్ధతుల ననుసరించి జరుగుతూ వుంటుంది. వారవారం క్రొత్తకార్యవర్గం ఎన్నుకోబడుతుంది. ఈ కార్య వర్గంలో పోర్టుఫోలియోలు సాధారణంగా ఈ క్రింది విధంగా యేర్పాటు చేయ బడుతూ ఉన్నాయి.

1. మొత్తం పర్యవేక్షణ (ప్రధాన మంత్రి)
2. విద్యాశాఖ
3. ప్రచారశాఖ
4. ఆరోగ్య శాఖ
5. ఆహారశాఖ

ఒక్కొక్క శాఖ ఒక్కొక్కరి ఆధ్వర్యం క్రింద జరుగుతూ ఉంటుంది. వారం పూర్తికాగానే వారు వారు నిర్వహించిన కార్యక్రమాన్ని గురించి నివేదికను సమర్పించ వలసి యుంటుంది. దీనిపై సాధారణసభ చర్చిస్తూ వుంటుంది. అల్లాగే ఎన్నిక అయ్యే వారు కూడా తమతమ శాఖలు ఎల్లా నిర్వహించ బోయేది, ఏయే మార్పులు చేయ బోయేది మొదలైన అంశాలను గూర్చి నివేదిస్తారు. ఈ విధంగా పార్లమెంటరీ ప్రచారాలు మర్యాదలు గూర్చి ఒక వంక శిక్షణ ఇస్తూ ఒక వంక అందుకు సంబంధించిన పాఠ్యక్రమం కూడా పూర్తి చేయబడుతూ వుంటుంది. మా కేంద్రంలో శిక్షణ పొందిన వారు ముందు ముందు శాసన సభ్యులుగాని, మంత్రులుగాని అవటం తటస్థించిన వారికి శాసన సభా కార్యక్రమం ఎక్కువ క్రొత్తగా కనుపించదు.

కేంద్రాన్ని అనుసరించి విధిగా హాస్టలు కూడా ఉంటూ వస్తూంది. విద్యార్థులే యీ హాస్టలు నడుపుకుంటూ జమా ఖర్చులు వ్రాస్తూ వుంటారు. ఈ హాస్టలులో జాతి మత వివక్షత లేకుండా అందరు కలసి భోజనం చెయ్యాలని నియమం. పొదుపుగా వాడటం, అంచనా ననుసరించి ఖర్చు చెయ్యడంలో కూడా ఒక రకంగా విద్యార్థులకు శిక్షణ ఇవ్వబడుతూఉంది. వంతుల ప్రకారం వడ్డన వగైరా కార్యక్రిమాలలో పాల్గొనాలి.

రక రకాల వ్యక్తులలో నుండి వివిధ అంతస్థులు గలవారు, చాలాకాలం ఉపాధ్యాయులుగా నుండి ఇతర ప్రాపంచి కానుభవం గలవారు కూడా వస్తూ ఉంటారు. కవులు, గాయకులు, హరికథ చెప్పగలవారు, చిత్రలేఖకులు ఎక్కువ లోకానుభవం గలవారు కొద్దిపాటి వ్యవహార వేత్తలు కూడా కేంద్రానికి శిక్షణకు వస్తూవుంటారు. వయస్సు ముదిరిన వారు అవటంవల్ల సాధారణంగా స్థిరపడిన భావాలు కలవారు కూడా అయివుంటారు. వీరందరితోను వ్యవహరించటం కూడ జీవితంలో ఒక క్రొత్త అనుభవాన్ని ఇస్తూ ఉంటుంది.

వయోజన శిక్షణ కేంద్రాల్లో ఎక్కువ ముఖ్యమైన విషయాలు ప్రచారం చేసి విద్య నేర్వాలనే అభిలాష పెద్దల్లో రేకెత్తించడం, అది చల్లబడకుండా చూడటం, సులభ మార్గాలద్వారా వారిని అక్షరాస్యులుగా చేయడం. ఇందులో మొదటి రెండు విషయాలు కొంచెం కఠినం. అందువల్ల అరకమైన శిక్షణ విద్యార్థులకు ఎక్కువగా ఇవ్వబడుతుంది. చుట్టుప్రక్కల పల్లెలకు, వెనుక బడ్డ పేటలకు ప్రచారానికి పోవడం ఆచారం. కేంద్రానికి రెండు పెట్రోమాక్సులైట్లు, ఒకగ్రామఫోను, ఒక మ్యాజిక లాంతరు ఇవ్వబడ్డాయి. వీని సహాయంతో వయోజనులను ఆకర్షించడం జరుగుతూ వుంటుంది. ఆ కాలంలో ప్రస్తుతం పటమటలంకలో ప్రధానోపాధ్యాయులుగా నున్న శ్రీ వరాప్రుల వెంకట సుబ్బారావు గారిచే రచింపబడ్డ గేయాలు ఉపయోగిస్తూ వుంటాము. వాడుక భాషలో జన సామాన్యం మనస్సుకు ఆకర్షణీయంగా నుండటం ఈ గేయాల ప్రత్యేకత. వీటిని పాడుతూ ప్రచారానికి రాత్రిపూట బయలు దేరుతూ

వుంటాం. కొద్దిరోజులకు గొడ్లను కాసే కుఱ్ఱవాళ్లు కూడా ఏ చెట్టుకిందో కూర్చొని "ఓ చదువులేని పెద్దవాడా" అనో, 'తెలుగుతల్లి బిడ్డలం' అనో ఎలుగెత్తి పాడటం అనేక సార్లు విన్నాం. మా ప్రచార ఫలితాన్ని చూచి మేమే ముగ్ధులమయ్యే వారము. చదువుకోవాలను అభిలాష కలగాలిగాని చదువు నేర్పడం ఎక్కువ కష్టంగాదని మా అభిప్రాయం.

సాధారణంగా ఏ పేటలేక పల్లెలో ఒకటి రెండు రోజులు ప్రచారం చేస్తామో అక్కడే ఒక మాదిరి కేంద్రం స్థాపించి శిక్షణాలయము ఉన్నంత కాలము నిర్వహిస్తూ ఉంటాము. ఆకాలంలో మా విద్యార్థులకు శిక్షణ నివ్వటమే కాకుండా ఏమార్గాన్ని బోధిస్తే పెద్దలకు ఆకర్షవంతంగా ఉండి తేలికగా బోధపడుతుందో గ్రహిస్తూ వచ్చాము. బాగా బస్తీలలోని సినిమాలు ఎక్కువగా నున్నచోట్ల అశోకుడు నాటి మ్యాజికు లాంతరు నిశ్చల చిత్రాలు ఎక్కువ ఆకర్షణీయంగా ఉండకపోయినా, మారు మూలల పల్లెల్లో వీనికి కూడ కొంత విలువ వుంటూనే వచ్చింది. చిన్నసైజు 'మూవీ' ప్రభుత్వము వారు మంజూరు చేస్తే యింకా బాగుండేది.

శిక్షణ కేంద్రంలో కొంతకాలం ఉపాధ్యాయులుగా పని చేసిన శ్రీ కమ్మూ సాహెబ్ వ్రాసిన బుఱ్ఱకథ ప్రచార సమయంలో ఉపయోగిస్తున్నాము.

అదృష్ట వశాత్తు శిక్షణ కేంద్రం ఏర్పాటు చేసిన ప్రదేశానికి సమీపంలోనే చారిత్రక ప్రాముఖ్యత వహించిన ప్రదేశాలు, పుణ్యక్షేత్రాలు ఉంటూఉన్నాయి. అందువల్ల విద్యావిహారాలకు అట్టి ప్రదేశాలకు పోవటం, కులాసాగా కాలంగడుపుతూ ప్రకృతి నుండి విద్య నేర్వడం కూడా అలవాటయింది. ముందుగా పరిశీలనచేసి తరువాత కేంద్రాలు స్థాపించడంవల్ల ప్రకృతి రామణీయకం ఉన్న ప్రదేశాలే మా కేంద్ర స్థానాలు అవుతూ వచ్చాయి.

శిక్షణ కాలం ఆరువారాలే అవటంవల్ల సెలవలు ఏమీలేవు. ఒక ఆదివారం మాత్రం ఒక మోస్తరు సెలవు దినం. విద్యార్థులకు కూడా క్యాజువల్ సెలవులు యివ్వబడటంలేదు. అయినా ఒక విధంగా కేంద్రమే ఒక కుటుంబంగా ఉండటంవల్ల పాఠశాలల కుండే విసుగుదల లేకుండా ఆరువారాలు యిట్టే గడిచి పోతాయి. ఈ ఆరువారాలు ఒకమధురస్మృతిగా అనేకమంది పాత విద్యార్థులు చెప్పటం కూడా విన్నాం. ఆ విధంగా తమ వద్దకు వచ్చిన నిరక్షరాస్యులైన పెద్దల్ని కూడా ఏవిధంగా ఆకర్షించవచ్చునో శిక్షణ పొందేవారు నేర్చుకుంటూ ఉంటారు.

# ప్రయోజన విద్య

## జైలులోని ఒక చిన్న అనుభవం

శ్రీ వంటెద్దు పంకజపార్వతీశం

ఇది కథ మాత్రంకాదు, యథార్థం. ఇది 1930 ఆగస్టునుండి డిసెంబరు నెలలోపుగా జరిగిన విషయం. మేమున్నది గోల్డన్‌రాక్ సెంట్రలు జైలులో తిరుచునాపల్లి చేరువ రెండుమూడుమైళ్ల దూరంలో నిర్మింపబడ్డ పురాతన జైలు యిది. ఆంధ్రదేశంనుండి ముఠాలు ముఠాలు ప్రతి పదిహేను రోజులకు రాజధాని యందుగల యితర జైళ్లకు ఆ నాటి సత్యాగ్రహులను మారుస్తూవుండేవారు. అటులనే సుమారు 140 మందిని, జులై నెల 3 వ వారంలో రాజమండ్రి నుండి తిరుచునా పల్లి జైలుకు మార్చారు. అప్పటికే అచట 4గురు ఆంధ్రులు మాత్రం సత్యాగ్రహులున్నారు. వారిలో క్షప్తిలో ఉన్నవారు శ్రీయుత సాగి విజయ రామరాజుగారు, దేవరంపాడు వాస్తవ్యుడు. వారివల్ల కొత్తలో జైలుభోగాలు అన్నీ చూచాం. కాని ఎంతకాలంజరుగుతుంది కాలయాపన. ఇందువల్ల తరువాత ఉదయంనుండి సాయంత్రంవరకు ఒకవిధమైన కార్యక్రమం కొందరం కలిసి వేసికొని దాని ప్రకారం పనిచేసుకొనే వారం. అందులో ముఖ్యంగా చీకటితోనే యోగాభ్యాసం, తర్వాత వంటచేసేవారికి సహాయం నిమిత్తం వెళ్లటం. దీనితో రెండు సంగతులు నేర్చుకుంటున్నాం. ఒకటి వంట నేర్చుకొనుట, రెండు యితర రాజధానులనుండి వచ్చేవారితో వచ్చీరాని హిందీతో కాలక్షేపం చెయ్యటం. అందువలనను కాలం పూర్తి అవక, కొందరితో ఆలోచించి మనతో సత్యాగ్రహం చేసిన సోదరులలో చదువురాని వారుగా వున్నవారికి చదువు చెప్ప నిర్ణయించుకున్నాం. ఈవిషయంలో తోడ్పడ్డ సోదరులు పశ్చిమగోదావరి నుండి వచ్చిన తణుకు ప్రాంతీయ వాస్తవ్యులు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి (సంస్కృత పండితుడు), ఏలూరు నేషనల్ స్కూలు విద్యార్థి ముదుంబై నరసింహాచారి వగైరాలు.

మాతో కలిసి విశాఖ జిల్లా నుండి మామిడి పండ్లవర్తకుడు బలిజ కులస్థుడు, సుమారు 60 సం॥ వృద్ధు కూడా ఉన్నాడు. అందరినీ అడిగినట్లుగా వారిని అడగకపోయినను, తనంతట తానే నావద్దకు వచ్చి "బాబుగారూ ! నాకు యీ జన్మలో నా అంతటనేను వ్రాసుకొని చదువుకొనే అదృష్టం కలుగుతుందా" అని అడిగాడు. ప్రపంచంలో యితర దేశాల ప్రజలు నిరక్షరాస్యతా నిర్మూలనానికి చేసిన ప్రయత్నాలు, దాని వలన పొందిన సత్ఫలితాలు నచ్చజెప్పగా సుమారు 15, 20 రోజులలో వారింటికి ఆ తాత తనే ఒక కార్డు వ్రాస్తూ చెప్పిన మాటలు అత్యాశ్చర్యకరంగా వుంటుందని ఊహిస్తున్నాను.

"నేను పిల్లలు కలవాణ్ణి. అదీగాక మామిడి పళ్లలో ప్రతి ఏటా నాకు వ్యాపారంలో అధమం పదివేలు వస్తాయి. మీబోటి చదువుకున్నవారి సహాయంతో నాకే వ్రాతాకూతా వుంటే యింకా నాలుగైదు కలిసి వచ్చే అవకాశం వుంది. ఇదీగాక నా చిరకాలపు కోరిక, తలవని తలంపుగా మహాత్మాగాంధీగారి సత్యాగ్రహంవల్ల నా జైలు యాత్ర మొదట్లో కష్టాలు పడటానికి వచ్చినా, వ్యాపారి ఎక్కడికి పోయినా లాభానికే అన్నట్లు, యిచ్చటికివచ్చి విద్య నేర్చుకున్నాను" అన్నాడు కార్డు వ్రాస్తూ.

కార్డు వెళ్లిన 10 రోజులలో అతని కుమార్తెల వద్దనుండి జాబు వచ్చింది. "నాన్నా ! నీవు జైలుకుపోతే డబ్బుదండుగని మాకు భయం లేదు. కాని తిరిగి మాకు దక్కవనే భయంతో ప్రతి దినం మాలో మేము బాధపడుతూ వుండేవాళ్లం. కాని కష్టాలలో కూడ ఒక ఆనందాన్ని చూచే అదృష్టం మాకు కలిగింది. నీకు వేసిన శిక్ష ఆరునెలలే గాక యింకొక ఆరునెలలున్నా మేము చింతించం. ఏమంటావా ? వచ్చేటప్పటికి పూర్తిగా చదువుకు వస్తావు" అని వ్రాశారు.

అది చూపి ఆనాడు ఆ వృద్ధుడు పొందిన ఆనందం యింతింత కాదు. కాని ఆ దినాలు యిప్పుడు గతించాయి. ఆనాడు మనం బానిసలం. నేడు సర్వస్వతంత్రులం. ముఖ్యంగా వయోజన విద్యా ప్రచా

రం చేస్తూవున్న రోజులివి. మదరాసు రాష్ట్రంలో యీ యేడు జరిగిన వయోజన విద్యా వారంలో నేను సత్తెనపల్లిలో ఉండటం తటస్థించడం, నా బాల్యస్నేహితుడు జనమంచి కామేశ్వరరావుగారు సీనియరు డెప్యూటీ యిన్స్పెక్టరుగా అచట వుండటంవలన, శ్రీయుతులు చెరుకువాడ వెంకట నరసింహం పంతులు, శ్రీ ముదిగంటి జగ్గన్నశాస్త్రిగార్లు నన్ను రెండుమాటలు చెప్పమనే సరికి యీ విషయంలో నాకీ పూర్వగాథ జ్ఞాపకంవచ్చి అచటగల వయోజనులకు చెప్పాకున్నాను.

ఆ విషయం వారికి ఎలా నచ్చిందో, లేదో నాకు తెలియదు గాని ఆనాటి యదార్థమే తెలియ జెపుతా. ఆనాటి కీనాడు శ్రీ సర్వోత్తమ భవనాకి ఆంధ్రదేశగ్రంథాలయ సంఘకార్యదర్శి శ్రీయుత పాతూరి నాగభూషణం గారిని చూడరాగా, వయోజన విద్యను గూర్చి వ్యాసములు వ్రాయమని వారెవరితోనో చెప్పుచుండగా, వారికి నేమంతా కొంతకాలం కలసివున్న ఆనాటి తిరుచునాపల్లి జైలు విద్యా ప్రచారం విషయం ప్రస్తావవశంగా మనవి జేశాను. వెంటనే ఎంత అర్జంటైనా యిది కాస్త వ్రాసి యివ్వమన్నందు వలన యీ అవకాశం దొరికింది. అట్టి వుత్సాహంతో ప్రచారకులు తమ ధర్మమనుకుంటే మన వయోజన విద్యా సమస్య, అయిదు సంవత్సరాలలో పూర్తి కాగలదని నా ధృడ విశ్వాసం.

## అక్షరాస్యతా ప్రచారానికొక ప్రణాళిక

### శ్రీ కొర్రపాటి వెంకటసుబ్బారావు

వయోజన విద్యా పితామహులు, గురుతుల్యులునగు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారి శిశ్రూషా భాగ్యంవల్ల వయోజన విద్యా బోధనకు కొన్ని సులువగు మెలకువలను గ్రహించి తమ యెదుట నిడుచున్నాను.

మన తెలుగుభాష నేర్పుటలో ముఖ్యముగా మనము గమనించవలసినది, విద్యార్థికి తేలికగా విసుగులేకుండా అక్షరజ్ఞానము కలుగజేయుట. అక్షరములను సులువుగా గుర్తుపట్టుటకు కొన్ని మార్గములు పెద్దలు కనిపెట్టినారు. నాకు తోచిన దిగువ సూచనలు అక్షరాస్యతా ప్రచారానికి ఉపకరించగలవని నానమ్మిక.

ఈ పద్ధతులవల్ల

1. బోధకుడు ఎక్కువసేపు తన సమయమును వుపయోగించ నక్కరలేదు. ఉపోద్ఘాతములను ఎక్కువగా చెప్పి తాను శ్రమపడవలసిన పనిలేదు. కొద్ది మాత్రపు గుర్తులు, సలహాలతోనే విద్యార్థి తన మనస్సును అక్షరముల యెడ లగ్నపరచుకొన గలడు.

2. కొద్దిగ నేర్చుకొన్న యువకుడుగూడా ఇతరునికి చెప్పుటకవకాశమేర్పడును. కొందరు వ్రాత నేర్పక, చదువుట మాత్రమే ముందు నేర్పి, తదుపరి వ్రాత నేర్పుట మంచిదనుచున్నారు. కొందరు చదువుట కొంత నేర్పి. తదుపరి అక్షరములను వ్రాయుట నేర్పుట మంచిదనుచున్నారు. మరికొందరు అక్షరము గుర్తు అతని మనస్సునకెక్కించి, అతనికా అక్షరము బాగుగా గుర్తగుట కొరకు అభ్యాసపదములను అతనికిచెప్పి, అతని చేతనే ఆపదముల కూర్పును వ్రాయించిన, అతని మనస్సులో బాగుగా నాటుకొని పోవుననుచున్నారు. మూలపదవిధానము, మూలాక్షరవిధానము, లాబక్ విధానములను కొందరు పేర్కొనుచున్నారు.

మూలపద విధానము, లాబక్ పద్ధతులవల్ల వయోజన విద్యార్థి తనకంటిఎదుట చాల అక్షరములు కనబడుటచే తికమకపడి చెప్పినది తెలుసుకొన లేకపోవుచున్నాడు. అందువల్ల అతడు ఆ అక్షరములు నేర్చుకొనుటకు అనువైన యేర్పాటులుండవలెను.

సరళాక్షరములను ముందు నేర్పుట మంచిదని అందరూ అనుచున్నారు. సరళాక్షరములను ముందు నేర్పి తదుపరి గుణింతములను ప్రవేశపెట్టిన బాగుండును. మొదటి పాఠములోనే గుణింతపు గుర్తులు ప్రవేశపెట్టిన విద్యార్థి తికమకపడుచున్నాడు. అందువల్ల సరళాక్షరములు అయిన తర్వాత ఒక్కొక్క పాఠములో ఒక్కొక్క గుణింతపు గుర్తును ప్రవేశపెట్టుటుచితము. చదువుతో వ్రాతకూడా నేర్పిన విద్యార్థి తృప్తి, ఉత్సాహములతో తన చదువును అభివృద్ధి పరుచుకోగలుగుతాడు. మాటలు చదువగలిగేటంత వరకు కేవలము అక్షరములను నేర్చుకొనే సంకల్పమే విద్యార్థికి కలుగచేసి తదుపరి మాటలు, అందువెంట ప్రపంచజ్ఞానము బోధించిన బాగుండును.

అక్షరముల గుర్తుల విషయమై ఆ అక్షరములకు మూలములగు ం(సున్న), అరసున్న, బోర్లించిన అరసున్న, తలకట్టు, అడ్డగీత, నిలువుగీత గుర్తులను మొదటి పాఠములలో ప్రవేశపెట్టుచు ఆ ఆకారములలోనే ముందు నేర్చుకొనబోవు అక్షరములుండునని ఆ గుర్తుల అభ్యాసము బాగా యివ్వవలెను.

అక్షరములను నేర్పు వరుసగూడా ఫ్రీక్వెన్సీనిబట్టిగాక ఆకారములు ననుసరించి యున్న విద్యార్థి మనస్సుకివి బాగా పట్టి అతనికి త్వరలో వీనిని గుర్తుపట్టుశక్తి అలవడ గలదు. పనిపాటులు చేసుకొని జీవించువారే ఎక్కువగా మనకు విద్యార్థులగుదురుగాన వారికి పుస్తకములకు బదులుగ కరపత్రములుగానీ, కార్డులుగానీ ఉపయోగించుటమేలు.

వారు పనిపాటులకు వెళ్లినప్పుడు తీరిక దొరికినప్పుడల్లా ఆ అక్షరముల యందు తన మనస్సును కేంద్రీకరించి నేలమీద వ్రాయుట మొదలగు చర్యలద్వారా ఆ అక్షరములను గుర్తుపట్టు నంతవరకు గట్టిగా సాధించగలుగుతాడు. ప్రారంభమందు రెండు మూడు పాఠములకు అక్షరములే నేర్పి, తదుపరి మిగత పాఠములలో మాటలనుకూడా వుపయోగించవచ్చును.

మాటలను నేర్పునప్పుడు వారికి అర్థమయ్యే మాటలనే బోధించవలెను. ప్రారంభమందే నేర్చుకొన్న అక్షరముమీద గుణింతము గుర్తులన్నియూ ప్రవేశపెట్టి మాటలు నేర్పించే బదులు, పూర్తిగా ఒక్కొక్క గుణింతపుగుర్తు మీద, నేర్చుకొన్న సరళాక్షరములతో మాటలు సాధనచేసిన బాగుండును. అట్లు లేకపోయినచో వరుసగా గుణింతము లన్నిటినీ ప్రయోగించిన విద్యార్థి తికమకపడును. అతనికి వ్రాయుటరాదు. ఎప్పుడు వ్రాయుటరాదో అతనికి వుత్సాహము తగ్గి విసుగు జనించును.

కడపటి నుదహరించిన వరుస ప్రకారం 12 కార్డులు సిద్ధముచేసి దినమున కొక కార్డు విద్యార్థి కియ్యవలెను.

కొత్త అక్షరం నేర్పేటప్పుడంతా అది యెట్లేర్పడుతూ వుందో బోర్డుమీద వ్రాసి చూపవలెను.

ఉదా: సున్న వ్రాసి పైన తలకట్టుయిస్తే 'ర' అవుతుంది. అరసున్నను వెల్లకిలగ వ్రాసి మొదటి కొసలోనికి మడిస్తే 'ల' అవుతుంది. అరసున్నను వెల్లకిలగ వ్రాసి రెండు కొసలు లోనికి మడిచి లోపల అడ్డగీత గీస్తే'అ' అవుతుంది. బోర్లించిన అరసున్న పైన తలకట్టుయిస్తే 'గ'అవుతుంది. 'ప' వ్రాసి దిగువకు నిలువుగీతనువ్రాస్తే'మ'అవుతుంది.

న స, ప వ, మ య లకుగల పోలికలు, భేదములు గుర్తించు సూచనలను తెలుపవలెను.

అనుకూలమును బట్టి ఒక క్రమంలో అక్షరాలన్నీ నేర్పిన తర్వాత అసలుక్రమాన్ని వారికి చెప్పి, దీనిని వారు గుర్తుపెట్టు కొనుటకేదైన ఉపాయమును చేయవలెను. ఈవరుస వారికి తెలిసినపిమ్మట గుణింతము నేర్పుట సులభము.

ఈ పండ్రెండు రోజులలో సరళాక్షరములు, వత్తు అక్షరములు గుర్తుపట్టుట, వ్రాయుట, చదువుట విద్యార్థికి పట్టుబడగలవు.

గుణింతాక్షరముల విషయమై ఒకటే గుణింతపు గుర్తుమీద సరళాక్షరములన్నీ సాధనచేయుటే చాలామంచిది. లేనిచో తికమకపడగలడు.

మాటను పలికించునపుడు ఒకేసారి పలికించునట్లు బోధపడు చూడవలెను. ఒక్కొక్క అక్షరము చెప్పించరాదు.

గుణింతపు అక్షరాల అభ్యాసములో మనము వాడుకలో ఉపయోగించేమాటలు, తేలికవిగా నుండు సామెతలు వుంటే మంచిది.

ఈ విధానములో ఎక్కువ శ్రమపడవలసినపని వుండదు. ఉపోద్ఘాతములతో గాని, బోధనోపకరణములతో గాని దీనిలో అంతగాపని లేదు. ఈ పని అంతా చాల లవుగా జరిగిపోతుంది. కంఠశోష వుండదు.

1 వ కార్డు:-

○ ◡ ∩ ✓

2 వ కార్డు:-

( ω — | ○

3 వ కార్డు:-

ర ల అ

4 వ కార్డు:-

త గ క

(రెండవ వైపు)

అ ర

అ ల

అం. లం. రం.

5 వ కార్డు:-

న స

ర. ల. అ. త. గ. క

(రెండవ వైపు)

కం. తం. గం.

| | | | |
|---|---|---|---|
| తల | లంక | రంగం | తరక |
| కల | గంగ | అంతం | కలత |
| అంగ | గంత | అరక | కలక |

కంకర

6 వ కార్డు:—

ప వ మ య

ర ల అ త గ క న స

(రెండవ వైపు)

సం

| | | |
|---|---|---|
| నగ | రసం | సరసం |
| నస | సలక | కరకర |
| సంత | నలక | గరగర |

7 వ కార్డు:—

బ ట

ర, ల, అ, త, గ, క, న, స, ప, వ, మ, య

(రెండవ వైపు)

# పం, వం, మం, యం

పన గంప పరక
వస వంత పలక
వల వంగ కమల
పస యలక
మర వలస సవరం
తమ పనస వసనం
మరతల వలపల
అలమర అవతల
పంపర పనస

8 వ కార్డు:-

డ ద
ర ల అ త గ క న
స ప వ మ య బ ట

(రెండవ వైపు)

గంట వంట ఆటక అబల
పంట మంట తబల బరమ
తంపట యంటవ
టపటప పటపట పటమట

9 వ కార్డు:-

చ జ

ర, ల, అ, త, గ, క, న, స

ప, వ, మ, య, బ, ట, డ, ద

(రెండవ వైపు)

| | | |
|---|---|---|
| గడ | మంద | మడమ |
| గద | పడవ | మడత |
| దండ | గడప | పండగ |
| కండ | నడత | దండగ |
| కంద | నడవ | మందర |
| వంద | దవడ | |

తడపర తమదయ పడమర తలగడ

10 వ కార్డు:-

శ హ ష

ర, ల, అ, త, గ, క

న, స, ప, వ, మ, య

బ, ట, డ, ద, చ, జ

(రెండవ వైపు)

| | | |
|---|---|---|
| జడ | మంచ | చలమ |
| జండ | చంచ | జలగ |
| కంచ | చమట | జరద |

చపలత చకచక చరచర

11 వ కార్డు:-

ఐ, ళ, క్ష, అ

1 2 3 4 5 6 7 8 9 10

అ క. గ. చ. జ ప. బ. మ. య. ర. ల

ట. డ. త. ద. న. వ. శ. ష. స. హ. క్ష

(రెండవ వైపు)

| | |
|---|---|
| శగ | శంకర |
| హంస | హరహర |
| శంక | క్షవరం |
| శనగ | అక్షరం |

హంస నడక

12 వ కార్డు;-

| | | | |
|---|---|---|---|
| క | ద | ల | క ఖ గ ఘ ఙ |
| గ | న | వ | చ ఛ జ ఝ ఞ |
| చ | ప | శ | ట ఠ డ ఢ ణ |
| జ | బ | ష | త థ ద ధ న |
| ట | మ | స | ప ఫ బ భ మ |
| డ | య | హ | య ర ల ళ వ |
| త | ర | క్ష | శ ష స హ |
| | | | క్ష అ |

రెండవ వైపు

| | | | |
|---|---|---|---|
| అ ర | న గ | అ ర క | త ర క |
| అ ల | ప న | అ ల క | ద వ డ |
| అ స | బ స | అ ర వ | ప ల క |
| క ల | మ ర | క ల వ | బ ర మ |
| గ డ | ర వ | క ల క | మ డ త |
| జ డ | ల త | గ డ ప | వ ర ద |
| త ల | వ ల | చ ల మ | శ న గ |
| ద డ | శ గ | జ ల గ | స వ ర |

తలగడ మరతల పడమర

# వయోజన విద్యాశాఖా సమావేశము

( అధ్యక్షోపన్యాసము )

రివరెండ్ యం. జె. ప్రకాశం

ఆంధ్రదేశంలో దాదాపు పదిహేను సంవత్సరములనుండి వయోజన విద్యా వ్యాప్తికొఱకై కొంత తీవ్రమైన కృషి జరుగుచున్నది. ఈ ఉద్యమమునకు మొదటి నుండి చేయూతనిచ్చి దానినింతవరకు నిలువబెట్టినవారు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు. ప్రభుత్వమువారు వయోజన విద్యయందు శ్రద్ధవహించి ఉపాధ్యాయులకు గ్రాంటులనిచ్చి, శిక్షణ శిబిరములను నెలకొల్పి పనిచేయుచున్నను వారికృషి చాల కొద్దిపాటిదిగనే కనబడుచున్నది. మన దేశములోనున్న 40, 45 కోట్ల జనులలో యిప్పటికింకను నూటికి ఎనభై యిద్దరు నిరక్షరాస్యులై యున్నారు. వారిని అక్షరాస్యులుగ చేయుటకు ఒక పంచవర్ష ప్రణాళిక వేసి చూచిన కనీసము 200,000 ఉపాధ్యాయులు కావలెను. వీరికి కనీసము మూడు మాసములైనను ఉపాధ్యాయ శిక్షణ నీయవలెను. ఒక్కొక్కదానిలో 200 మంది శిక్షితుల చొప్పున 250 శిక్షణ శిబిరములు, ఒక్కొక్క శిబిరమునందు తొమ్మండుగురు ఉపాధ్యాయులు కావలెను. ఇక శిబిరములకైన కట్టడములు, ఉపాధ్యాయ, విద్యార్థి వేతనములు, సాధన పరికర

ముల ఖర్చులు - వీటన్నిటికి కొన్నికోట్ల రూపాయలు వ్యయమగును. ఇప్పటిలో మన ప్రభుత్వము యింత ధనవ్యయము చేయగలదనుట అసాధ్యము. ఒక్క ప్రభుత్వమువారే యీ పనినంతయు ఏదేశములోను చేయలేదు. అట్లు చేయవలెనని ప్రజలూ కూడ కోరలేదు. అయితే ప్రభుత్వము తోడ్పాటు, ప్రోత్సాహముతో ప్రభుత్వేతర ప్రత్యేక సంస్థలు, వ్యక్తులు ఈపనికి పూనుకొని గొప్పవిజయము గాంచిరి.

అమెరికా, ఇంగ్లండు, నార్వే,స్వీడను,జపాను మున్నగు దేశములలో దాదాపు నూటికి నూరుగురు అక్షరాస్యులున్నారు. రష్యా, టర్కీ, చీనా, మున్నగు దేశములలో 50-80% అక్షరాస్యులున్నారు. కాని ఆసియాఖండపు దేశములలో 5-25% మంది మాత్రమే అక్షరాస్యులున్నారు. ఇట్లు మనదేశమునందు తరతరాలనుండి స్తంభించిపోయిన ఈ నిరక్షరాస్యతను నిర్మూలించుటయే నేటి మన ప్రధానకర్తవ్యం.

నిరక్షరాస్యత యనునది దేశమునకు మొదటి శత్రువు. ఈ శత్రువుతో పోరాడుటకు గొప్పసైన్యముకావలెను. ఈ సైన్యము ప్రజల నుండియే సిద్ధముగావలెను. కావున మనదేశములోనున్న పెక్కు ప్రభుత్వేతర సంస్థలు ఈ పనికి పూనుకొనవలయును. క్రైస్తవ మిషనులు, సంఘములు, రామకృష్ణమిషను, గ్రామోద్ధరణ సంఘములు, గ్రామసేవకసంఘములు, కాంగ్రెస్ సంస్థలు, గాంధీసంస్థలు, పాఠశాలలు, కళాశాలలు, వైద్యశాలలు, విశ్వవిద్యాలయములు - ఇవన్నియును యీ పనికి కంకణము కట్టుకొనవలయును. డా॥లాబక్ అను వయోజనవిద్యా ప్రవీణుడు 1935 సం॥లో మన దేశమును మొదట దర్శించిన నాటినుండి, క్రైస్తవ సంస్థలు వయోజనవిద్యావ్యాప్తికి పూనుకొని ఓపికతో పనిచేసినందున, ఇప్పుడు క్రైస్తవులయందు అక్షరాస్యుల సంఖ్య 30% వరకు పెరిగినది. అట్లే హిందూ మహమ్మదీయుల యందును కొంత సంఖ్య పెరిగినది. కాని యిది చాలదు. నేడు స్వతంత్రమైన మన దేశంలో ప్రజారాజ్యం జయకరంగా సాగిపోవుటకు నూటికి నూరుగురు అక్షరాస్యులయ్యే వరకు మనము నిద్రపోగూడదు.

వయోజన విద్యా వ్యాప్తికి మన దేశములో కొన్ని ప్రత్యేక సంస్థలు యేర్పడియున్నవి అవి యేవనగా (i) అఖిలభారత వయోజన విద్యా సంఘము (ii) దక్షిణ భారత వయోజన విద్యా సంఘము. (iii) ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము.

చదువుగాని పెద్దవారికి చదువునేర్పు సూత్రములు ఎవరైనను కొలదికాలములోనే నేర్చుకొని పనికి పూనుకొనవచ్చును. శ్రీహరిసర్వోత్తమరావుగారి వయోజనవిద్య బోధనక్రమము, వయోజన విద్య - మొదటి పుస్తకము ఈ విషయములు తెలిసికొనుటకు చాల సహాయపడును. ప్రభుత్వమువారిచ్చిన వయోజనవిద్య శిక్షణపొందిన ఉపాధ్యాయులు దేశమంతటా చెదరియున్నారు. అట్టివారిని పిలిపించుకొని బోధన సూత్రములు, మాదిరి పాఠములు చెప్పించుకొనవచ్చును. నిరక్షరాస్యులకు చదువు నేర్పుట సులభమైన పనిగాదు. లాభము శూన్యము. ఈపని చేయువారిని మెచ్చుకొనువారైనను

వుండరు. నిజమేగాని, యిది లాభదృష్టితో యితరుల మెప్పుకొరకు చేయుపనియు కాదు. కేవలము దేశోన్నతికొరకును, ప్రజాక్షేమము కొరకును, నిష్కల్మష త్యాగ బుద్ధితో, నిష్కామముగా చేయవలసినపని. కన్నతల్లిని ప్రేమించినంత గాఢముగా భారతమాతను ప్రేమించెడివారే యీ పనికి పూనుకొనగలరు. అట్టివారు మనదేశములో ఉన్నారు. వారు యిప్పుడు ముందుకువచ్చి, నడుము బిగించి పనిచేయవలసిన కాలము ఆసన్నమైనది.

## వయోజన విద్యాభిమానులు చేయగల కొన్ని పనులు

(1) ప్రజలు చదువు నేర్చుకొనుటకు ఆశపుట్టించుట. ఇది చాలా కష్టమైనపనియేగాని మన ఉద్యమమునకు పునాదివంటిది. "మా కెందుకు ఈ చదువు. చదువుకొని గొప్పపదవులు పొందుతామా ? మాకు సమయములేదు." అని ఎన్నో సాకులు చెప్పుదురు. తరతరాలనుండి నిరక్షరాస్యులను పట్టి పీడించుచుండిన భయము, సిగ్గు, చేతగానితనము దీనికి కారణములు. కావున యువకులు గుంపులుగ ఏర్పడి గ్రామగ్రామానికి, పల్లెపల్లెకు, వాడవాడకు తిరిగి పాటలు, పటములు, నినాదములు మున్నగు సాధనములద్వారా విద్యాప్రచారము గావించి చదువు నేర్చుకొనుటకు ప్రజల మనస్సులను సిద్ధపరచవలెను.

(2) ఒక్కొక్క గ్రామానికి ఒక వయోజన శిక్షా కేంద్రము ఏర్పడవలెను. ఇందు ఒకరు అధ్యక్షులు, ఒకరు కార్యదర్శి, ఒకరు కోశాధిపతి, ఇద్దరు సామాన్య సభ్యులు ఉందురు. వీరు గ్రామమునీద కొన్ని చందాలు పోగుజేసి పరికరములు సంపాదించుకొని పనిజేయవలయును.

(3) గ్రామ గ్రామానికి ఒక కేంద్రము పెట్టి రోజూ కనీసము ఒక గంటసేపు భజనలు చేయించి, పాటలు పాడించి, ప్రజలు ఉత్సాహముగ నున్నప్పుడు వారు చదువుటకు, వ్రాయుటకు, లెక్కలు చేయుటకు నేర్పవలయును. ఈ కేంద్రములకు కావలసిన స్థలము, సామగ్రి, గ్రామ వయోజన విద్యాసంఘము పేరిట ప్రజలనుండియు, ధార్మికులైన ధనవంతులనుండియు సంపాదింపవలెను.

(4) కేంద్రములు పెట్టి పనిచేయలేనివారు ఒక్కొక్కరు సంవత్సరమునకు కనీసము పదిమందికైనను చదువు నేర్పుటకు దీక్ష గైకొనవలెను.

(5) విద్యార్థులు వేసవికాలము, ఇతర విరామకాలములలో వయోజనవిద్యా సేవకు పూనుకొనవలెను.

(6) ఉపాధ్యాయులు, మత ప్రచారకులు, డాక్టరులు, లాయరులు, నర్సులు, వర్తకులు సాంఘిక సేవకులు, సంఘసంస్కర్తలు – ఒకరేమి ? భారతమాతను ప్రేమించు వారందరు ఒక్కొక్కరు కనీసము పదిమందికి చదువు నేర్పుట తమ పౌరధర్మమని గ్రహింపవలయును.

(7) స్వయముగ చదువు నేర్ప వీలులేనివారు, వయోజనవిద్యా సేవకు తోడ్పడి ధారాళముగ విరాళముల నీయవచ్చును.

(8) ఫ్యాక్టరీ మేనేజర్లు, పుగారు, రైల్వే కంపెనీల యజమానులు తమ యొద్ద పని చేయుచున్న వందలకొలది నిరక్షరాస్యులైన కార్మికులకు చదువు నేర్చుకొను వసతులు కల్పించవలెను. అనగా విద్యా కేంద్రములు పెట్టించి శిక్షణపొందిన ఉపాధ్యాయులచేత చదువులు చెప్పించవలెను.

(9) వయోజనవిద్యా వారములు జరిపి ఊరేగింపులు, ఉపన్యాసములు, పాఠములు నేర్పించుట, మున్నగు సాధనములద్వారా విద్యా ప్రచారము గావించవలెను.

నేటి మన వయోజనవిద్యా సమస్య గొప్పభారము మోయుచు, కొండ నెక్కుచున్న ఒక రైలుబండివంటిది. దీనికి రెండు యింజనులుకావలెను. ఒకటి ముందు లాగుచుండగా మరొకటి వెనుక నెట్టుచుండును. అట్లే ప్రభుత్వము, ప్రజల వెనుకనుండి వారికృషికి చట్ట సంబంధమైన సహాయమును చేయుచుండవలెను.

ఈ క్రింది సూచనల ప్రకారం ప్రభుత్వమువారు వయోజన విద్యకు క్రియారూపమున తోడ్పడవలెను.

(1) 40 ఏండ్లు మించని వయోజనులందరు ఒకానొక నియమిత కాలములోపల చదువు నేర్చుకొనవలెను. అట్లు నేర్చుకొనని పక్షానికి జరిమానా వేయుటగాని, పౌర హక్కులు, ఉద్యోగము, పోగొట్టుకొనుటగాని జరుగునని ఒక శాసనము పుట్టించి ప్రజలందరికి తెలియజేయవలెను.

(2) ఇంగ్లండు, అమెరికా, రష్యా, జపాను మున్నగు దేశములలోవలె గ్రామ విద్యాకేంద్రములు స్థాపించి, కార్మికులు, వ్యవసాయకులు, కూలీలు తమ విరామ కాలములో విద్యాభ్యాసము చేయుటకు సదుపాయములు కల్పించవలెను.

(3) జిల్లాకొక విద్యా ప్రచారకుని నియమించి, విజ్ఞాన సంబంధమైన ఫిల్ములు, రికార్డులు, శ్రవణయంత్రములు, గోడపటములు గలిగిన ప్రచార శకటముల (Propaganda vans) సహాయముతో పనిచేయించవలెను.

(4) హరిజన దినములువంటి ఉత్సవములు పెట్టించి. నామకార్థముగగాకుండ గట్టిపని చేయించి తేలిన ఫలితములను సంఖ్యలతోను, వివరములతోను మూడుమాసము కొకసారి ప్రచురించుచుండవలెను.

(5) రూరల్ వెల్ఫేర్ డిపార్టుమెంటు మున్నగు ప్రభుత్వ ఉద్యోగశాఖలకు ఈపనిని అప్పగించి వారి రిపోర్టులను గూడా ప్రచురించుచుండవలెను.

(6) ప్రభుత్వమువారి ప్రోత్సాహముతో విశ్వవిద్యాలయములు వయోజనవిద్యకు పూనుకొని, వయోజనులకు నేర్పవలసిన విద్యా ప్రణాళికను సిద్ధముచేయవలెను. పట్టభద్రులు కనీసము మూడునెలలైనను విశ్వవిద్యాలయ ప్రణాళిక ననుసరించి ప్రజలకు విద్య నేర్పినపుడే వారికి యోగ్యతాపత్రము లిచ్చుట మంచిది.

వయోజన విద్య అనగా వట్టి చదువు నేర్పుటయే కాదు. నేర్చుకొనిన చదువు సార్థకమై యుండుటకును, ప్రజలు తిరిగి నిరక్షరాస్యులు కాకుండుటకును, దేశమంతట చిన్నవి, పెద్దవియైన గ్రంథాలయములు నెలకొల్పవలెను. వయోజనవిద్యకు గ్రంథాలయములు పట్టుకొమ్మవంటివి. నా సంచారములలో కొన్ని కొన్ని గ్రామముల యందు చిన్న చిన్న గ్రంథాలయములు చూచితిని. వాటిని నడుపువారికి ఎట్టిపుస్తకములను చేకూర్చి పెట్టవలెనో, ఆ గ్రంథాలయముల నెట్లు సాగించవలెనో అనువిషయముల పైన సలహాల నొసగవలయును. అట్టి గ్రంథాలయములకు కొంత గ్రాంటు నిచ్చుటయు మంచిది. ఈ పనినంతయు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముద్వారా జరిగించుట శ్రేయస్కరము. ఇప్పటికే ఈ గ్రంథాలయ సంఘము ఆంధ్రదేశమునకు చేసినసేవ ప్రశంసనీయము.

దేశమున చౌకరకము వాఙ్మయము, అనగా దిన వార మాసపత్రికలు, కర పత్రములు, పుస్తకములు విరివిగా వెలువడుచున్నవి. కాని యివన్నియు ప్రజలు చదువుటకు యోగ్యమైనవి కావు; కొన్ని చాల అపాయకరమైనవి. ప్రజల శీలమును సంపూర్ణముగ చెడగొట్టునవి. ప్రజల కొఱకు వ్రాయబడు పత్రికలు, పుస్తకములు వారి జీవితమునకు సరిపోయినవిగాను, విజ్ఞానమును పెంపొందించునవిగాను, ప్రజలు కొనుటకు చౌకగాను, ఆకర్షణీయముగాను ఉండవలెను. వ్యవసాయము, వృత్తి విద్య, చేతి పనులు, గ్రామ జీవితము, ప్రజల అలవాట్లు, సాంప్రదాయములు, ఆరోగ్యము, వివాహము, కుటుంబము, బిడ్డలపెంపకము, పౌరసత్వము, పౌరహక్కులు, బాధ్యతలు, రోడ్డు- రైలుమీదచేయు ప్రయాణమర్యాదలు, వరుసలలో నిలువబడి యుండుట, కథలు, నాటకములు, బుఱ్ఱకథలు, గేయములు, గీతములు ఇత్యాది అంశములపైన అనుభవముగలవారు పుస్తకములు వ్రాయుచుండవలెను. వయోజనులకు కావలసిన పుస్తకములు, పత్రికలలో పెద్ద అక్షరములు, రంగుపటములు విరివిగ వాడవలయును. ఈ పనియంతయు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వంటి యనుభవము గలిగిన సంస్థయే చేయగలదని నా గట్టినమ్మకము.

ముగింపుగా ఒక మాట చెప్పగోరితిని. నేనీ ఉపన్యాసము చదువుచుండగా మీ మనస్సులలో "ఎందుకో యీ శ్రమంతా ? ఈ చదువువలన లాభమేమి ?" అను ప్రశ్నలు చెలరేగుచుండునని నేనెరుగుదును. దానికి సమాధానమేమనగా, నేడు మన దేశము స్వతంత్ర దేశము. వయస్సువచ్చిన ప్రతి వయోజనుడు వోటుచేయుటకు హక్కును పొందియున్నాడు. రాజకీయ వ్యవహారములు విద్యావిహీనులు గ్రహింపలేరు. "రాముడేలైతే మాకేమి, రావణుడేలైనే మాకేమి, మా పొట్టలు నిండితేచాలు" నని వారందురు. వీరి యజ్ఞానము ఆధారముచేసుకొని మాయమాటలుచెప్పి అయోగ్యులైన అభ్యర్థులు వోటువేయించుకొందురు. కొందరు లంచమిచ్చి వోటువేయించుకొందురు. వోటు అనునది ఒక గొప్పశక్తి. దానిని న్యాయసమ్మతముగ వినియోగించు ప్రజలు యోగ్యులైన శాసనసభ్యులను, మంత్రులను, ప్రభుత్వమును ఎన్నుకొనుటయు, అయోగ్యులైనవారిని త్రోసివేయుటయు ఈవోటువలననే జరుగగలదు. ఇట్టి శక్తివంతమైన వోటును

విద్యావంతులైన ప్రజలే సద్వినియోగము చేయగలరు. కనుక నేడు పెద్దలవిద్య విరివిగా ప్రచారము కావలెను.

ప్రతిమానవునికి చాలకాలము జీవించుటకును, సుఖముగా జీవించుటకును కోరిక యుండును. అయినను మన దేశములో సరాసరి ఆయుఃప్రమాణము 27 సం॥ లు మాత్రమే. దీనికి ప్రజల పేదతనము కారణము. పేదతనమునకు విద్యావిహీనత కారణము. శాస్త్రీయముగ వ్యవసాయము మున్నగు పనులను చేసికొని ఎక్కువ పంటలు పండించుకొనుటకు, మన ప్రజలకు తెలియదు. పెట్టుబడిదార్ల మోసమును, బ్లాకు మార్కెటుచేయు వారికుతంత్రములను వారెఱుగరు. ఇందుచేత ప్రజల జీవితము మరింత దుర్భరమగుచున్నది. దేశములోని దుష్టశక్తుల నన్నిటిని కుంకటి త్రేళ్ళతో గూడ పెల్లగించి వేయగలిగినది ఒక్క వయోజన విద్యయే.

మన దేశములో ఎటుచూచినను మతము, దేవుడు అను మాటలు మాఱుమ్రోగుచున్నవి. తిరునాళ్ళు, యాత్రలు, జపతపములు, ప్రార్థనలు, నమాజులు, ఇవి మత సూచకములై యున్నవి. ఇట్టి మతావేశముగల మన దేశములో ప్రజలు విద్యావంతులైనప్పుడే, ఒకరి మత సత్యములను మరి యొకరు చదివి గ్రహించి, మత సామరస్యము గలిగి అన్నదమ్ములవలె జీవించుట నేర్చుకొందురు.

ప్రజలలో ప్రబలియున్న అనారోగ్యము, దురభ్యాసములు, అమర్యాద వాడుకలు, మూఢనమ్మకములు నశించుటకు ఒక్క వయోజన విద్యయే సాధనము. ప్రజలు సంఘ జీవులుగాన వయోజన విద్యవలన సాంఘిక వర్తనయు చక్కబడును. ఒకరి హక్కులను మరియొకరు గౌరవించి కాపాడుటకు నేర్చుకొందురు. సహకారము, ఉమ్మడి ప్రయత్నములు ప్రజలకు బాగా అలవడును. ఇది అంతయు అయ్యేడి పని యేనా? అని కొందరు అనవచ్చును. మనస్సుంటె అయి తీరునని నానమ్మకము. కోట్ల కొలది రూపాయల వరుమానములు వచ్చుచుండిన మద్య పానమున ప్రజలు, ప్రభుత్వము కలసి దేశ స్వాతంత్ర్యము పొందిన మొదటి సంవత్సరములోనే నిషేధించలేదా? అట్లే ఒకే మనస్సుతో, ప్రజలు, ప్రభుత్వము చేతులు కలిపి వయోజన విద్యా వ్యాప్తికి పూనుకొనిన మొదల పది సంవత్సరములలో మన దేశమునందు గొప్పమార్పు కలుగునని అనుభవముద్వారా నాయందు స్థిరపడిన నమ్మకమును మీకు నివేదించుచు విరమించుచున్నాను.

# THE LIBRARY CATALOGUE

by

*S. R. Ranganathan, M. A., L. T., F. L. A.,*

professor of Library Science, Delhi. University,

President, Indian Library Association.

The Library Catalogue, I should emphasise at the very outset, is but one of the many tools devised by the library profession to satisfy all the demands of the Laws of Library Science. It is a tool that remembers that it is not having the sole monopoly of satisfying the Laws. It is aware that there are also other tools with the same purpose and with which it should co-operate. It has to co-operate, for example, with Library Classification and Reference Service. These three tools have to get on together on many things. Each should confine itself to its own allotted sphere and do its very best in that sphere, with the full belief that the other two will do similary in their own respective spheres.

About half a century ago this was not realised. That was due to historic causes. Reference Service had not then come into existence. Library Classification had not attained sufficient maturity to attempt individualising specific subjects of books, throwing them in a helpful order and mechanising the maintenance of that order. The Library Catalogue had therefore additional charge so to speak of the functions of these two tools as well. In those circumstances, the Library Catalogue began to assume, without the necessary discipline, the onerous duty of assessing the specific subject of a book. It further assumed that the readers should be and could be given every possible help through its own entries.

During recent years the Library Catalogue has begun to realise that these additional charges interfered far too much with its own legitimate functions. It also found

that Library Classification and Reference Service had already developed to a stage when they can not only look after their own field more efficiently, but could also offer substantial aid to the catalogue itself. Thus today what we have to consider and re-examine frequently is that boundary region where these tools can step in when any one of them feels beyond its depths. Let me give a few illustrations :

1. Consider multi-focal books. No scheme of Library Classification has so far succeeded in distinguishing and individualising books of partial comprehension. Take as an example Edward Dowden's *New Studies in Literature*. Classification can only put it in the class "Applied Literary Criticism on some authors, the youngest of whom was born in the fifties of the nineteenth century." The book actually deals with only Meredith, Bridges, Donne, Goethe, Coleridge, Sherrer and a few other French authors. Shelf arrangement, that is, Library Classification, desires to bring out these foci of the book to the notice of the reader in order to get every possible chance for the fulfilment of the Laws of Library Science. But it has no notational device by which it can achieve this desire. It therefore turns to the Library Catalogue which puts for its *cross reference entries* or subject analyticals to achieve the desired end.

2. The American Library Association and the Library of Congress had made frantic efforts to prop up the Library Catalogue with their *List of Subject headings* whenever it goes beyond its depth in the choice and rendering of the headings for subject entries or class index entries. When the catalogue thus stands marooned amidst the conflicting waves of all kinds of subject headings, the Library Classification throws forth the tow of its Chain Procedure and brings it to safe waters. You will find a detailed picture of this friendly service of Library Classication to the Library Catalogue in my books on the Library Catalogue. You can also get a specific and popular illustration of this in an article by my you-

ng friend Murari Lal Nagar which appeared in the 1946 volume of *The Indian Librarian.*

*3.* The *co-operation between Library Catalogue and Reference Service* for their mutual benefit, is a matter of daily occurance in any library which functions up. It is the enormous number of added entries which the Library Catalouge provides now-a-days, that makes possible exact and expeditious Reference Service. Reciprocally the knowledge that there is a living man on floor-duty to have charge of the ultimate stage of establishing contact between the right reader and the right book enables the library catalogue to improve its technique unmindful of the inevitable, resulting complexity. It is no longer under the illusion which had mesmerised hitherto-the illusion of the 'Common Reader' idea. This bogey of the assumed ignorance of the common man has been the cloak under which the Library Catalogue had till now drifted evading the responsibility offorging new techniques to meet the new demands of the new cross-sections of knowledge and the new classes of books that appear in such large numbers now-a-days. The fact is that even the simplest Catalogue is too artificial in every one of its details to be intelligible to the common reader without help. The inversion of the words in the name of a person, coining of the term to denote a governmental author and the inevitable cross reference entries do baffle any reader. All along the Library Catalogue had, in an ostrich-like manner, closed its eyes to its unintelligibitity to any of its un-initiated users.

The change that has come over our land -- this long-wished for change --, which after all came on the 15th August, 1947, throws a great responsibility on the Library Catalogue. *Its function is no longer to serve the few who could read English.* It has hereafter to serve the many who can read only their own mother tongue. The Library Catalouge should therefore be in Telugu, for examle, in the Andhradesa. To adapt itself to this new

( continued on page 89 )



శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు (పుట 84)

నిర్వహణశాఖా సమావేశము

# అధ్యక్షోపన్యాసము

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.

నిర్వహణానుభవం నాకు లేదు. ఈ విషయమై మన కార్యదర్శి గారు కొంత నిపుణతను సంపాదించినారు. ఇటువంటి సంఘాల అధ్యక్షులైన వారుకూడ యీ విషయంలో ప్రావీణ్యత సంపాదించడమవసరం.

గ్రంథాలయ స్థల నిర్ణయం నుంచీ యీ శాఖ కార్యక్రమం ఆరంభమవుతుంది. ఊరికి వెలుపల గ్రంథాలయం కడితే ప్రయోజనం లేదు. క్లబ్బుల విషయంవేరు. ఇండ్లు యిరుకుగా వుంటే పాఠకులకు సౌకర్యముండదు. చదలు నుండి పుస్తకాలను కాపాడవలసిన అవసరం కూడా వుంది. పుస్తకాలు చేర్చే కార్యక్రమంకూడ నిర్వహణకు సంబంధించిన విషయమే. దీనికి జాబితాలు తయారు చేయవలె. ఇప్పటికిట్టిపట్టిక ఒకటి తయారయినది. మా ఉపాధ్యక్షులు శ్రీ నాగినేని వెంకయ్యగారీ కార్యక్రమానికి సహాయపడుటకు నిశ్చయించుకొన్నారు. అన్ని రకాల పుస్తకాలను ప్రతి గ్రంథాలయము సంపాదించుట సాధ్యం గాదు. ఒక్కొక్క గ్రంథాలయం జాబితాలు తయారు చేసుకోవడంలో విషయ విభజన ప్రకారము వీటిని సిద్ధపరిస్తేతప్ప ప్రయోజనం లేదు. అయితే కొన్ని పుస్తకాలు అనేకవిషయాలకు సంబంధించి వుంటాయి. అప్పుడు వీటిని విడివిడిగా కోరువారందరికీ అందుబాటులో వుండేలాగు చేయడానికి వీలుగా కార్డు పద్ధతి జాబితాల నిర్మాణంలో అమలుకు వచ్చింది.

ఇంతకు ముందు పుస్తకాలు బీరువాలలో పెట్టి తాళాలు వేయడం ఆచారంగా వుండేది. ఇప్పుడీపద్ధతి మారిపోయింది. నిరాటంకంగా ప్రతి చదువరీ తనకు కావలసిన పుస్తకాలను స్వయంగా ఎంచి తీసుకోవడానికనుకూలంగా స్వేచ్ఛోపలబ్ధి విధానం యేర్పాటైనది. బీరువా

లలో పుస్తకాలు పెట్టడంలో పరిమాణాన్ని ప్రమాణంగా తీసుకుంటే ప్రయోజనముండదని విషయాలననుసరించి, తిరిగి ఒక్కొక్క విషయంలో వివిధవర్గముల ననుసరించి వీటిని విడదీసి బీరువాలలో పేర్చడం అమలులోకి వచ్చింది. పుస్తకాల ఉపయోగం విషయంలో స్వార్థపరు లీ యవకాశాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. బొమ్మలను చింపుకోవడమో, పుస్తకాలను సంగ్రహించడమో చేస్తున్న పాఠకులునూ వున్నారు. ఈ యన్నిటినుండి గ్రంథాలను తప్పించడానికి నిర్వాహకులు ప్రయత్నించవలె.

ఒక్కొక్క విషయంలో వాఙ్మయ సూచికలు, వాఙ్మయ సూచికల వాఙ్మయసూచికలు నేడు లోకంలో తయారైనవి.

గ్రంథ భాండాగారుల నియామకంవిషయంలో మనమిప్పుడు తగుశ్రద్ధ గైకొనుటలేదు. యోగ్యులైన వారిని యీ పనికి నియమించి తగిన వేతనము లివ్వవలసిన అవసరం చాలా వున్నది.

నేటి గ్రంథాలయ నిర్వహణంలో ఆచూకీసేవ చాల ప్రధాన మైనది. ఆధునిక గ్రంథాలయాలలో యీ కార్యక్రమము చక్కగా సాగుచున్నది. చదువరుల కీ కార్యక్రమం అనేక విధముల ప్రయోజన పడుచున్నది. ఈ కార్యక్రమం సక్రమంగా నిర్వహణం కావడానికి కార్యకర్తలు గ్రంథాలయమునకు వచ్చు పాఠకుల మనస్తత్వాలను కనుగొని దీనికనుగుణంగా నడచుకోగల సమర్థులుగా వుండాలి. ఎవ్వరువచ్చి ఏ విషయాన్ని గూర్చి సమాచారం తెలుసుకో గోరినా వారికి కావలసిన సమాచారాన్ని వెంటనే కాకపోయినా సకాలానికి వారికందించే ప్రయత్నం గ్రంథాలయాలు చేయవలసిన అవసరమెంతైనా వున్నది. ఈ సందర్భంలో కెనడాలోని ఒక యూనివర్సిటీ గ్రంథాలయ పాఠకుడు 'తాళవిలాసం' అనే పుస్తకం కావలెనని కోరినప్పుడు పటకాసు యూనివర్సిటీ లైబ్రరీవారు నానాతంటాలుపడి దీనిని సంపా

దించిపెట్టిన వివరాలు* గ్రంథాలయ కార్యకర్త లొక్కొక్కరూ తెలుసుకొనదగినవి.

పత్రికలలోని ముఖ్యవిషయాలను కత్తిరించి విషయాన్ని బట్టి విభజించి అనుక్రమణికలు తయారు చేయడం గ్రంథాలయాల నిర్వహణ కార్యక్రమంలో ముఖ్యమైన కార్యక్రమం.

పిల్లల గ్రంథాలు సేకరించుట, పనికిరాని పాతపుస్తకాలను తొలగించవలసినపనికూడ గ్రంథాలయ నిర్వహణమునకు సంబంధించినవే.

---

* చూడుడు. గ్రంథాలయములు [వ్యాసావళి] పుటలు, [illegible]
కర్త: శ్రీ పాతూరి నాగభూషణం
ప్రకాశకులు - ఆంధ్రసారస్వత పరిషత్, హైదరాబాదు

# పిల్లలమఱ్ఱియాత్ర*

శ్రీ ఆకెళ్ళ సుబ్రహ్మణ్యకవి

పిల్లలమఱ్ఱియాత్రకు తపించిన భక్తులు వెళ్ళినార లా
సల్లలితంపు దేవళము చక్కని శాసన శిల్పసుందరో
ద్వల్లికగా కనుంబడి కథావళిలోన పురాచరిత్ర సం
ఫుల్ల ముఖాలఁ జేసె మన పున్నెము పండెను నీ సభాగతిన్॥

నరకిరి నాట్యభంగిమలు నాటి మహోజ్జ్వల దివ్యభిత్తికన్
కరకు తనమ్ములో నురులకత్తుల నాంధ్ర పురాణ శిల్పముం
గొరికిరి వజ్రదంతముల క్రూరభయంకర కాలరాక్షసీ
కరముల బట్టువడ్డదని కానకపోయిరి రాజముష్కరుల్॥

ఏనాడో మావార లేలిరి రాజ్యా ల
టంచును గొప్పలు నించుకొనుచు

ఎప్పుడో మాతాత యీరుడైనాడని
చంకలెగురవేసి చప్పరిలుచు

ఎందరో మాకవు లింపైన కావ్యాలు
రచియించిరని డెప్పరంబుగనుచు

ఏనాడో మావాడు నెన్నియో ధర్మాలు
శిల్పాలయాలలో నిల్పెననుచు

పాతగొప్పలు త్రవ్విన ఫలమదేమి ?
స్వచ్ఛజాతీయతా ముద్ర భ్రష్టమగుట
శిథిల శిల్పాల పేదల వ్యథల కవుల
కష్టజాలములను గాంచి కలతపడవె ?

---

* కవిసమ్మేళనములో చదివిన పద్యాలు



పిల్లలమర్రి దేవాలయము (పుట 88)



శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు



శ్రీ కొమ్మా సీతారామయ్యగారు

# క్షమాపణ

సూర్యాపేటలో 27 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ జరిగిన 7 సంవత్సరాల 7 నెలలకు పిమ్మటగాని యీ సంచికను లోకానికి సమర్పించలేకపోయినందుకు చాలా బాధపడుతున్నాను. సూర్యాపేట మహాసభ ఇప్పటికి జరిగిన అన్ని మహాసభలలోను వైభవోపేతంగానూ, అత్యంత జయప్రదంగానూ జరిగింది. మహాసభకు ప్రతి యేర్పాటూ యెంతో పరిశీలనతోనూ, విచక్షణతోనూ జ రి గిం ది. ఎన్నో ప్రబల శక్తులు అవరోధంగా నిలచినా లెక్కచేయకుండా కార్యకర్తలు బ్రహ్మాండమైన యేర్పాట్లతో మహాసభను జరిపి, కృతకృత్యులైనారు. ఏ మహాసభకూ రానంత ఆదాయంవచ్చి ఖర్చయింది. దాదాపు 7,000 హాలీ రూపాయలు వసూలై ఖర్చైనవి. ఇంకా 1200 హాలీ రూపాయలు వసూలు కావలసి యుండెను. అవి వసూలు కాగలవని ఆహ్వానసంఘం ఆశించింది. కాని వసూలుకై తగినకృషి జరుగలేదు. మహాసభ అయితే బ్రహ్మాండంగా జరిగిందిగాని, సంచిక ప్రచు

---

(from page 84)

situation the Library Catalogue should immediately experiment on and stabilise correct styles of writing the heading, the title and the various other items of a catalogue entry; it has also to develop helpful methods of rendering the names of persons personal as well as corporate. The English language had taken a few centuries to find out the most helpful style and rendering for subject headings. All this will have to be done within a few years, starting from a scratch or perhaps what is worse, unlearning several wrong practices that have drifted into usage. I shall de glad to hear from you or the experiments you make and the standards you arrive at. It may be encouraging for you if I say that groups of able young men are already doing similar experiments for Marathi, Hindi and Urdu. If you have no objection to take help from an non-Andhra, my suggestions and services are ever at your disposal.

రణకు కావలసిన ద్రవ్యం సమకూరలేదు. కాలంగడుస్తున్నకొద్దీ నిధి సేకరణపట్ల అలసత్వం, అశ్రద్ధ పెరిగిపోయినవి. డబ్బులేక సంచిక ప్రకటన కాలేదు. నాటి ఆహ్వానసంఘ సభ్యులు చెల్లాచెదురుగ తలకొక త్రైన్నినారు. ఆహ్వానసంఘాధ్యక్షులు, ఇద్దరు సభ్యులు పరలోక గతులైనారుకూడ.

ఇంత విజయవంతంగా జరిగిన యీ మహాసభ వృత్తాంతం గ్రంథస్థం కాకపోవటం నా హృదయానికి తీరని బాధగా పరిణమించగా నా మానసిక పరిస్థితిని గమనించిన ఒక మిత్రుడు రు 500/- వాగ్దానం చేశారు. అందులో రు 300/- అందజేశారు. మిగతా మొత్తం సంపుదురని ఆశిస్తున్నాను. ఆమిత్రుడు తనపేరును ప్రచురించుట కంగీకరించలేదు. కనుక ఆయనపేరును లోకానికి తెలియజేయలేనందుకు చింతిస్తున్నాను.

సూర్యాపేట ప్రముఖ వర్తకులు శ్రీ నెంపటి,బుచ్చయ్యగారు, శ్రీ కర్నాటి రాములుగారుకూడ అట్లే రు 100/- చొప్పున వాగ్దానం చేశారు. శ్రీ బుచ్చయ్యగారు రు 50/- వసూలు యిచ్చినారు. త్వరలోనే మిగతా మొత్తంగూడ అందజేయుదురని ఆశిస్తున్నాను. మొత్తంమీద పై మిత్రుల వాగ్దానాలబలం సంచిక ప్రచురణకు పురికొల్పగా, చెల్లించిన మొత్తాలు దీనిని సాధ్యపరచినవి. ఈ విధంగా సంచిక ముద్రణకు ఆర్థికంగా సహాయపడ్డ మిత్రులందరికి సూర్యాపేట పౌరులు, ముఖ్యంగా మహాసభ ఆహ్వానసంఘు సభ్యులు కృతజ్ఞులు. వ్యక్తిగతంగా నాసంగతి సరేసరి.

ఈ మధ్య కాలంలో ఆహ్వానసంఘు ముఖ్య కార్యకర్తలు తలాఒకదారి అయినారు. నావరకు నేను అనేక స్థలాలకు మారాను. నావద్దగల కాగితాలున్నూ అనేకచోట్ల చేరినవి. అట్లే ఇతర మిత్రులు గూడా. ఈ మహాసభ సంచికకుకావలసిన భోగట్టా సంపాదన బ్రహ్మాండమైన చారిత్రిక పరిశోధనవంటి కష్టసాధ్యమైన పని అయింది.

సంచికలో ఒక ముఖ్య భాగమనదగిన ఆహ్వానసంఘు నివేదిక ఎంత ప్రయత్నించినా లభించలేదు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం

మహాసభ ఆహ్వానసంఘ కార్యదర్శులు:

(1) శ్రీ చక్కిలం శ్రీనివాసరావుగారు
(2) శ్రీ నరేంద్రుని మాణిక్యంగారు

ప్రచారశాఖా సమావేశము:

అధ్యక్షులు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు
కార్యదర్శి శ్రీ కాళే నాగేశ్వరరావుగారు

వయోజనవిద్యాశాఖా సమావేశము:

అధ్యక్షులు రివరెండ్ యం. జె. ప్రకాశంగారు
కార్యదర్శి శ్రీ యల్లాప్రగడ కృష్ణమూర్తిగారు

నిర్వహణశాఖా సమావేశము:

అధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు

ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథాలయ రజతోత్సవము:

అధ్యక్షులు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్త్యుత్సవము:

అధ్యక్షులు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు

కవితాగోష్ఠి అధ్యక్షులు: శ్రీ జాస్తి వెంకటనరసయ్యగారు

మహాసభ నిర్వహణములో ప్రముఖపాత్ర వహించిన తదితరులు:

శ్రీ కోదాటి నారాయణరావుగారు
" వావిలాలగోపాలకృష్ణయ్యగారు
" ఇటిక్యాల మధుసూదనరావుగారు
( స్వచ్ఛందసేవక దళాధిపతి)
" వెంపటి బుచ్చయ్యగారు
" కర్నాటి రాములుగారు
" తెల్ల బుచ్చిరామయ్యగారు
" ఉప్పల వెంకన్నగారు
" కొమ్మా సీతారామయ్యగారు
(సన్మానితులు)

పిల్లలమర్రి దేవాలయము